# మంచి ఏది?

సీ॥ పరమాత్మ భావంబు కలవారి పజ్జను
పడియుండుటే నీకు పాడియగును
పరమాత్మ భావంబు కలవారికింజేయు
సేవయే సరియగు సేవయగును
పరమాత్మ భావంబు కలవారికింబెట్టు
ఫలములే సరియగు ఫలమునిచ్చు
పరమాత్మ భావంబు కలవారికింజేయు
దానమే సత్పాత్రదానమగును

తే॥ చేతయే గీతయగు మాట సత్యమనుచు
చెప్పగలిగిన యట్టి యా గొప్పవారి
పల్కులాలకించియు నీవు పరమ ఆత్మ
దర్శనంబైన జ్ఞానుల దరినిజేరు.



వెల : 40/-

ప్రతులకు : బండి మోహన్, రేపల్లె - 522 265,
గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. ☎ 08648 - 223763.

ముద్రణ : R.K. ఆఫ్‌సెట్ ప్రింటర్స్, మున్సిపల్ ఆఫీస్‌రోడ్,
రేపల్లె. ✆ 222346

# జన్మతరించు

# శ్రీ చిన్నమ్మ

# పలుకులు



మహోత్కృష్టములగు పారమార్థిక ఆశయములు భారతదేశములో కలవు. వాటిని ప్రచారము చేయవలసియున్నది. ప్రచారములేని యెడల ప్రయోజనము లేదు.

- వివేకానందుడు

అందుకే ఈ పుస్తక ప్రచురణ.

ప్రకాశకులు : ☎ 08648 - 223763

బండి మోహన్, రేపల్లె

ఆంధ్రప్రదేశ్

# ఎవరీమె?

సీ. మతము వద్దుర మాకు, పటము వద్దుర మాది
పూజలే వద్దను పుణ్య తల్లి

తలను దాచను మీదు తాటాకు పంచయె
చాలురా మాకను మేలు తల్లి

మంత్రోపదేశమన్ తంత్రంబు నడిపించి
పైకంబు గుంజని పావనమ్మ

కాషాయ వస్త్రాల వేషాలు ధరియించి
గురువుల మేమని కులకనమ్మ

కపట వేదాంతంబు కడు నేర్పుతో చెప్పి
మోసంబు చేయని ముసలి తల్లి

మమ్ము గురువుగ మీరు మదిలోన యెన్నడు
తలచ వద్దని చెప్పు తల్లి యీమె

గురువు యెంగిలి తిన్న కూడు ముక్తి యటంచు
తలపరాదని అమ్మ పలుకు నెపుడు

తే. గ్రంథ వేదాంత మేదియు గరపదమ్మ
ఆత్మ వేదాంతమే చెప్పు అమ్మ యెపుడు
సత్య వేదాంతమే పల్కు సతత మమ్మ
ఆత్మ రూపంబు **చిన్నమ్మ** అవని యందు.

# శ్రీ చిన్నమ్మ

తే. పరుల నని తెచ్చు కొనకుము బాధ నెపుడు
పరులు అన్నారటంచును బాధ పడకు
పరుల జోలేల నీకని పలుకు నమ్మ
వినుము **చిన్నమ్మ** మాటలు కనుము నిజము.

# విషయసూచిక

# ప్రచురణకర్త - తొలిపలుకు

ఈ నవీన యుగములో దేవాలయములు, ఆశ్రమములు అనునవి; బాబాలనువారు చాలా ఎక్కువైనవి. ఎక్కువగుచున్నవి. మానవుడు తను చేసిన కర్మ (ప్రవర్తన) వలన తాను మంచి, చెడు అనుభవించు చున్నాడని ఎరుగక, ఎవరో, ఏదేవుడో మనలను ప్రవర్తింప జేయుచున్నారని, అంతా ఆయన (దేవుని) చలవే యని దేవాలయములకు, ఆశ్రమములకు వెళ్ళి, ఏవేవో కోర్కెలు కోరుట. ముక్తికి విరోధి కోర్కెలు. కర్మబంధ మార్గము అవలంబించుట జరుగుచున్నది. మానవుడు తాజేయు కర్మయే అనుభవించు చున్నాడు గాని, ఎవరో అతనిని ప్రవర్తింపజేయుచున్నారనుట యదార్థము కాదు.

అనాది నుండి మానవులు ఈ సృష్టియంతయు దేవుని సృష్టియని, దేవుళ్ళలో కూడా రక రకాల దేవుళ్ళని మానవుడు భ్రమపడి, ఆ దేవుళ్ళను పూజించుట వలన మనకు అన్నీ కలుగుచున్నవని భ్రమపడ్తూ ప్రవర్తించుచున్నాడు. మనదేశములో విపరీతంగా దేవుళ్ళని బాగా పూజించుచున్నారు. ముఖ్యంగా షిర్డీసాయి బాబాని, వెంకటేశ్వరస్వామియని, అన్నవరం అని యింకా దక్షిణాదిలో అనేక దేవాలయములను పూజించు చున్నారు. మనము చేసిన కర్మ ఫలితమే వచ్చును గాని పూజల వలన ఏమీ రాదు. "చేతయే గీత" యని శ్రీ చిన్నమ్మగారు చెప్పినారు. మనము చేయుచున్న కర్మయే మనలను నడుపుచుండును.

ఈ సృష్టియంతయు మాయ (ప్రకృతిది) యని; అందరూ మాయాస్వరూపులని అనగా "సత్వ, రజ, స్తమో గుణములు మూడునూ, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యము లారున్నూ, రాగ, ద్వేష, ఈర్ష్య, డంబ, దర్ప. అసూయ, అభిమానములు యేడున్నూ అను 16 గుణములతో ప్రవర్తింపబడుచున్నారని, వీటిని ప్రకృతి గుణాలని, ఈ గుణాలే కర్మలు చేయునని, కర్మ ఫలితము మాత్రము జీవుడు (అంటించుకొను, అనుభవించు స్వభావముగల మానవుడు) అనుభవించును. మనము చేసినదే మనము అనుభవించు చున్నాము గాని, ఎవరో, ఏ భగవంతుడో మనలను ప్రవర్తింప జేయుట లేదు. మనయందున్న గుణాలే కర్మ చేయును. మానవుని ప్రవర్తన చాలా ముఖ్యం. అంతేగాని దేవాలయములలో పూజ చేయుట వలన ఏమీ రాదు. పూజ చేయుట వలన వచ్చినది గాదు. నీ కర్మ ఫలితమే అలా వచ్చినది.

శ్రీ చిన్నమ్మగారు ఈ గ్రంథములో మోక్షమార్గము గురించి చెప్పినారు. ఈ గ్రంథమును జాగ్రత్తగా చదివిన అన్ని విషయాలు అర్థమగును.

మానవుడు తన ప్రవర్తనను సరిచేసుకొనక తన కోర్కెలు తీరునని భ్రమతో అనేక దేవుళ్ళకు మ్రొక్కుకొని మితిలేని ధనమును వాటికి వ్యయము చేయుచున్నాడు.

శ్రీ చిన్నమ్మగారు చెప్పినటుల పరమాత్మను దర్శించిన వారి సాంగత్యము చేసి వారి

నుండి మంచి గుణాలు సంపాదించిన ఆ గుణములే మిమ్ములను నడుపును. అప్పుడు మనిషి బాగు పడును. అంతేగాని ఎవరో, ఏ భగవంతుడో మనలను నడుపుచున్నారని భ్రమపడుట యదార్థము కాదు.

మానవునికి పరమాత్మ (అనగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు లేని స్థితి) దర్శించిన వారి సాంగత్యము అవసరం. వారు కనబడనిచో వారి కోసం నిరీక్షించుచూ, మామూలుగా నీతిగ ప్రవర్తించు గృహస్థ ధర్మములో ఉండుట మంచిదని అమ్మ (శ్రీ చిన్నమ్మ) యనెడి వారు. పరమాత్మనే భగవంతుడను చున్నారు. అదియొక పరమతేజో పదముగ యున్న పరమ తేజస్సు. అది పంచభూతములు లేని స్థితి. దాని యందే గుణాలు లేవు. అచ్చటికి ఆత్మ (జ్ఞానము) ద్వారా జేరవలెను గాని, అచ్చటికి జేర్చు భగవంతుడు లేడు. అచ్చటికి జేరిన వారు తిరిగి జన్మమునకు తిరిగి రారు. దానినే మోక్షపదము, నిర్వాణ పదము, కైవల్య ప్రాప్తి, తురీయతా స్థితి, పరమపదము, పరమతేజోలోకము, పరమాత్మ అని అనేక పేరులతో చెప్పుచున్నారు. పరమాత్మను దర్శించిన ఆత్మగలవారి సాంగత్యము జీవిత ముఖ్యోద్దేశం అయి ఉండాలి.

"అమ్మ (శ్రీ చిన్నమ్మ) సాంగత్యమునకు వచ్చిన వారికి "అని" తెచ్చుకోకని," అన్నారని బాధపడకని అమ్మ ఫోటో క్రింద వ్రాసిన పద్యం చెప్పెడివారు. అదిచాలా ముఖ్యమైనది. సామాన్యముగా లోకములో అని తెచ్చుకుంటారు. అన్నారని బాధపడును.

ఉదా : ఒకరు మరొకరిని దూషించినారను కొందము. మరొకరి మీద దూషణం ఎందుకు వచ్చిందంటే వారు చేసిన పూర్వ కర్మ ఫలితమే ఒకరి ద్వారా అనిపించినది. 'చేతయే గీత' యని అమ్మ గట్టిగా చెప్పినారు. ఏదైన మనము చేసినదే యితరుల ద్వారా వచ్చును. చెయ్యనిది రాదు. చేసింది పోదు. మనది ఋణముండి వచ్చిన జన్మ గనుక ఋణము తీర్చే ఉపాయం ఆలోచించి ఋణము తీర్చవలెను. జన్మరాహిత్యం అంటే మోక్షపదము అనగా పరమపదముగా యున్న పరమ తేజస్సు జేరవలెను. అంటే ఋణము తీరవలెను. మానవుడనగా 16 గుణాలతోనున్న జీవుడు. ఆ పదియారు గుణములు లేనట్లయిన పరమాత్మ అనగా పరమేజో పదముగ యున్న పరమపదము కాన్పించును. గుణాలే కర్తలుగాని జీవుడు కర్త కాడు. జీవుడనగా అంటించుకొను, అనుభవించు స్వభావము గలవాడు. మోక్షమార్గమును వివరించిన గ్రంథము.

మనకు సుఖము కావలెననిన యితరులకు సుఖమివ్వవలెను. ఎవ్వరూ దుఃఖము కోరడు గదా! మనము దుఃఖం ననుభవించుచున్న ఏనాడో మనము యితరులకు హాని చేసితిమి. అందువలన దుఃఖం అనుభవింపవలసి వచ్చుచున్నది. ఇది యదార్థము. మనము ఏది అనుభవించవలెనన్న శరీరం ద్వారానే అనుభవించవలెను తప్ప, మరి దేని ద్వారాను అనుభవింపము.

పరమతేజస్సుగా ఉన్న పరమపదము దర్శించిన వారి యందు మాత్రమే ప్రకృతి గుణములు నశించును. వీరిని సన్యాసులని, సాధువులని, ఉత్తమ పురుషులని అనేక

ఉన్నత పేర్లు పెట్టినారు. దర్శించని వారి యందు ప్రకృతి గుణములు ప్రవర్తించు చుండును. గనుక పరమాత్మను దర్శించిన వారిని వెదకి వారి సాంగత్యము చేయండి. శ్రీ చిన్నమ్మగారు లోగడ జన్మలోనే పరమాత్మను దర్శించినారు. ఈ జన్మలో పూర్తిగా ఋణము తీర్చుకొని, అభిమాన రహితులై ది. 7-12-56 న పరమతేజస్సుగా ఉన్న పరమపదమును జేరినారు. అంటే మోక్షము పొందినారు. శ్రీ చిన్నమ్మగారు చెప్పిన సన్యాసి లక్షణము గురించి 7, 8, 9, 10 అనే శీర్షికలు చదివి అటువంటి సన్యాసుల సాంగత్యము చేయండి. అంతేగాని లోకములోని "సన్యాసులందరు ప్రకృతి గుణములు గలవారు. పరమాత్మను దర్శించనివారు. అటువంటి వారి సాంగత్యము చేయరాదు.

దేవుడు నిష్క్రియుడు. పుణ్యపాపములకు, సృష్టిలయములకు కర్తగాదు అని "దేవుడు బాధ్యతలేనివాడు" అనే శీర్షికలో అమ్మ చెప్పినారు. జాగ్రత్తగా చదివి ప్రతివారు యోచించుకొని చూడుడు.

లోకమును అంటే ఈ ప్రపంచమును దేవుడు ప్రవర్తింప జేయుచున్నాడని, అంతా దేవుని సృష్టని అనేక గ్రంథములు తెల్పుచున్నవి. శ్రీ చిన్నమ్మగారు యిదంతా మాయ, ప్రకృతి సృష్టియని; ఈ మాయ, ప్రకృతి లేనిది పరమపదముగా యున్న పరమతేజో లోకము, పరమాత్మ, దేవుడని అన్నారు. పరమాత్మలో గుణాలేమి లేవు. యిట్లు గుణములు లేనివాడు సృష్టి ఎలా చేయగలడు? అందువలన ఈ ప్రపంచము గుణముల ప్రవర్తన. గుణాలతో ప్రవర్తింపబడుచున్న మానవునిచే, మరల యితర జీవరాశులచే ప్రవర్తింపబడు ఈ ప్రపంచము ప్రకృతిది.

మోక్షపదము, ముక్తి అనగా ఋణము తీర్చుకొని పరమాత్మను జేరు మార్గము. ఒక్క మానవ జన్మకే మోక్షము పొందుటకు అర్హత ఉన్నది. మిగతా జీవరాశులకు అర్హత లేదు. అట్టి మానవజన్మను విషయాసక్తికి పోనియ్యక మోక్షమార్గమునకు ఉపయోగించవలెను. అంటే ఆత్మశక్తిని సంపాదించిన అదియే మోక్షమార్గమునకు తీసుకొని పోవును. ఇటువంటి ఆత్మశక్తి పరమాత్మను దర్శించిన వారి యందే దొరుకును. సృష్టించే శక్తి ఎలా ఉండునో సృష్టి రహిత పరచే శక్తి ఉండునని అమ్మ చెప్పెడివారు.

"ప్రార్థన" గురించి అమ్మ చెప్పినట్లు ఎవ్వరూ, ఏ గ్రంథము వివరముగ చెప్పలేదు. పంచభూతములకు వినయ విధేయతలు చూపుట ప్రార్థన. శీర్షిక (60) చదవండి.

ఈ గ్రంథము "శ్రీ చిన్నమ్మ పలుకులు" భగవద్గీత బైబిలు కన్నా గొప్పది (వివరణ క్రింద యివ్వబడినది.) ఎందువలనన మానవుని అంత్యస్థితి ఏదియో ఆ విషయమును మాత్రమే తెల్పు గొప్ప గ్రంథము. అంటే మోక్షము, నిర్వాణము ఎలా పొందాలో చక్కగా చిన్న చిన్న ఉపమానాలతో అమ్మ తెల్పిన గ్రంథం. " ఎవరిది వారిదే, ఎవరి మాట వారిదే, ఎవరి కష్టదుఃఖాలు వారు చేసుకున్న పురాకృత కర్మ ఫలితాలే గాని మరియొకటి కాదు. కానిది రాదు. మనది పోదు." అను సూక్ష్మ విషయమును అమ్మ చెప్పినారు.

పరమాత్మ అనగా శబ్ద, స్పర్శ, రూప, రస గంధము లేనిది. దీనినే దేవుడందురు. అంతేగాని మానవుడు దేవుడు కాదు. పరమాత్మ (దేవుడు) గుణ రహితుడు. అటువంటి గుణరహితుడు ప్రకృతి కర్మలతో అందదు. మనము ఋణముండి జన్మకు వచ్చినాము గనుక, ఆ ఋణమును తీర్చితిమా ఆ పరమాత్మ స్థితి పొందగలము.

ఈ పై వివరాలన్నీ శ్రీ చిన్నమ్మ గారిచే చెప్పబడిన "జన్మతరించు శ్రీ చిన్నమ్మ పలుకులు" అను గ్రంథములో నున్నవి. వీనిని అన్ని భాషలలోకి తర్జుమా చేయాలని మా అభిప్రాయము. ఎందువలనంటే ఈ గ్రంథం మానవాకారముతోనున్న ప్రతివానికి ఉపయోగపడును. జాతి, మత, కుల వ్యవస్థలేని గ్రంథం. ఒక్క మోక్షమార్గమునే తెలుపు గ్రంథము.

దీనిని పఠించి యిందు చెప్పబడినట్లు పరమాత్మను దర్శించిన ఆత్మశక్తి గలవారిని వెదకి, వారి సాంగత్యమున ఆ శక్తిని పొంది, ఆ శక్తితో మోక్షమార్గము పొందగలరు. ఇది యదార్థము.

మన నిత్య జీవితంలో సుఖంగా జీవించవలెనన్న ఈ గ్రంథములోని వాక్యాలను ఆధారంగా జీవితంలో ఆచరణ పెట్టండి. అప్పుడు ఈ గ్రంథము విలువ తెలియును. అదీగాక మన నిత్య జీవితంలోని సమస్యలను కూడా అమ్మ పలుకుల ద్వారా పరిష్కరించుకోవచ్చు. ఆ పరిష్కరించు మార్గము ఈ గ్రంథ ప్రచురణ కర్త తెలుప గలరు.

మోక్ష మార్గమునకు దారి ఈ ప్రపంచ కర్మలు అవసరం లేదు అనేవారు. అంటే అతని దగ్గర ఉన్నదంతా యిచ్చేవాడు. ఋణము తీరితే గాని జన్మరాహిత్యం రాదు.

ఈ గ్రంథమును యోచనతో చదివి అందలి భావములను గ్రహించి జాగ్రత్తగా ప్రవర్తించిన మోక్షపదమును అనగా పరమతేజస్సుగా ఉన్న పరమపదము జేరగలరు.

1. జన్మరాహిత్యం ఎలా పొందాలో వివరించిన గ్రంథం.
2. బైబిలు, భగవద్గీత కన్నా గొప్ప గ్రంథము.
3. ఇందలి విషయాలు అతి తేలిక భాషతో ఉన్నత భావాలతో చెప్పబడినది.
4. ప్రతివాడు ఈ గ్రంథమును జాగ్రత్తగా చదివి యోచించి ప్రవర్తించు వారికి జీవితము ఆనందమయమగును.
5. ప్రతి మానవాకారముతో నున్నవారికి ఉపయోగపడు గ్రంథము.
6. జాతి, మత, కుల, దేశ, కాల నిమిత్తములకు అతీతంగా చెప్పబడిన గ్రంథము.
7. ఇటువంటి భావాలతో కూడిన గ్రంథము దొరకుట దుర్లభము.
8. 'ఎవరు చేసుకొన్నది వారిదే'. దీనినే చేతయే గీత అని అమ్మ చెప్పినారు.
9. ఇందులో చెప్పిన సన్యాసి లక్షణముల గల వ్యక్తిని వెదకి అనుసరించిన సులభముగ జన్మరాహిత్యం పొందగలరు.

10. అక్షర జ్ఞానంలేని శ్రీ చిన్నమ్మగారిచే చెప్పబడిన గ్రంథము.
11. జన్మతో ప్రకృతి గుణాలు లేని వ్యక్తిచే చెప్పబడిన పలుకులు. ఇందు యితరుల కాల్పనిక భాష ఏమీలేదు.

# జన్మతరించు శ్రీ చిన్నమ్మ పలుకులు భగవద్గీత, బైబిలుకన్నా గొప్ప గ్రంథం - వివరణ.

భగవద్గీత అనే గ్రంథం సంస్కృత భాషలో వ్యాసునిచే వ్రాయబడినది (ఆ కాలంలో సంస్కృత భాష వాడుక భాష గనుక ఆ భాషలో వ్రాయబడినది). కాలక్రమమున ఆ గ్రంథములో ఉన్న సంస్కృత భాషను అనేకార్థములతో అనేక భాషలలో చాలామంది వారికి తోచినట్లు వ్యాఖ్యానించినారు. వ్రాసిన వ్యాసుడు పరమాత్మను (పరమపదమును) చూచినవారు కాదు. వారి వారి భాషా పటిమతో ప్రకృతి గుణములతో వ్రాసినారు. ఈ గ్రంథంలో కృష్ణుడు పరమాత్మను దర్శించిన వ్యక్తి. ఈ వ్యక్తిచే చెప్పబడిన కొన్ని మంచిమాటలను వ్రాయుచూ, అందు కొంత కాల్పనిక భాష ఉండుట వలన అనేకులు బహువిధములుగ ఆ గ్రంథమును వ్యాఖ్యానించినారు. అది చదివితేనే (పారాయణం చేస్తేనే) ముక్తి అని అనేకులు ఉద్ఘోషించినారు. పారాయణం చేసినంత మాత్రాన ఏమీరాదు. గాని అందు చెప్పినట్లు ప్రవర్తించిన మానవుడు పురోగతి పొందగలడు. ఇంతవరకు ఆ గ్రంథమును ఎన్నిసార్లు కంఠోక్తి చేసినారో, వారందరు ముక్తి పొందినట్లు ఎచ్చట ఏ గ్రంథములో వ్రాయలేదు. హిందువుల మతగ్రంథము. ప్రపంచంలో బైబిలు తర్వాత రెండవ స్థానం పొందిన గ్రంథము. ఈ గ్రంథములో కృష్ణుడు కర్త. కృష్ణుడు ఆ జన్మలో అభిమాన రహితులు కాలేదు.

సరే యిక బైబిలు. ప్రపంచములో ఎక్కువమందిచే చదువబడిన గ్రంథము. మొదటస్థానం ఆక్రమించిన గ్రంథము. ఇందు కర్త ఏసుక్రీస్తు. ఏసుక్రీస్తు పరమాత్మను దర్శించినవారు. వీరి పూర్వ సంస్కార కర్మవలన శిలువ వేయబడి అనేక బాధలకు గురైనారు. ఇదంతా ఆయన పూర్వము చేసిన కర్మ ఫలితమే. ఆ ఋణము తీరిన తర్వాత మరల మానవజన్మ ఎత్తి, అనుభవించవలసిన కర్మ రహితమై, వృత్తి రహితులై మోక్షమును పొంది ఉండవచ్చు. ఈ గ్రంథములో కూడా అనేక కాల్పనిక విషయము యిమిడి యున్నది. ఈ గ్రంథమును కూడా అనేక ఫాదర్సు తమకు యిష్టము వచ్చినట్లు వ్యాఖ్యానించి యితరులకు బోధించుచున్నారు. బోధించువారిలో గాని, విన్నవారిలో గాని 'ఎవ్వరూ ఏసుక్రీస్తువలె పరమాత్మను దర్శించునట్లు ఎచ్చట ఏ గ్రంథమున వ్రాసిలేదు. కనీసము నీతి ప్రవర్తన కూడా ఉండుటలేదు. ఉదా : క్రీస్తుగారు ఏ జీవికి హింస చేయరాదని, హింస చేసిన ఆ ఫలం మనము అనుభవించ వలసి వచ్చునని, నేను కూడా పూర్వము ఏ జీవికో హింస చేయుట వలననే నన్ను ఈ జన్మలో శిలువ వేసి హింసించినారని చెప్పినారు. అందువలన ఏ జీవిని హింసించరాదని చెప్పినారు. మన ఫాదర్సు అనేక జీవులను చంపి వాని

మాంసమును తిని నూతన బాధలకు కారకులగుచున్నారు. ఇది వీరి బోధ. ఎక్కువ పైకము యితరులకు యిచ్చి అనేక బాధలు కలిగించే కర్మలు చేయించుచూ బోధ చేయుచున్నారు. వీరు తమ మత ప్రచారానికి ఎంత నీచకర్మలైన చేయుచున్నారు. ఇది ప్రస్తుత బైబిలు ప్రచార ప్రవర్తన.

"జన్మ తరించు శ్రీ చిన్నమ్మ పలుకులు" అను గ్రంథం బైబిలు, భగవద్గీత కన్నా గొప్పది.

నిరూపణ - చదువరులు జాగ్రత్తగా శ్రీ చిన్నమ్మ గారి జీవితమును, వీరి ఉన్నత భావాల పలుకులను చదివి యోచించుకొనుము. యోచించుట వలన మీకు ఈ గ్రంథము గొప్పదని భావన రావచ్చు. కేవలం జన్మ రాహిత్యం కొరకే చెప్పిన గ్రంథము.

1. గ్రంథంలోని విషయం శ్రీ చిన్నమ్మగారిచే శక్తి ప్రేరణచే చెప్పబడినది. ఇందు కాల్పనికం ఏ మాత్రము లేదు. ఎవ్వరూ వ్యాఖ్యానించలేరు.
   బైబిలు, భగవద్గీతలో అనేక కాల్పనిక విషయాలున్నవి.
2. శ్రీ చిన్నమ్మగారు పరమాత్మను దర్శించిన తర్వాత చెప్పబడిన 'జన్మతరించు పలుకులు' అనుభవ పూర్వకమైనవి. బైబిలు, భగవద్గీత యితరులచే వ్రాయబడినవి.
3. ఈ గ్రంథమును చదివినవారు యోచించినచో దీనిని వ్యాఖ్యానించలేరు. ఎందువలెనంటే కాంక్రీటు ఉపమానాలతో చెప్పబడిన పలుకులు.
   అనేకమంది భగవద్గీత, బైబిలును వ్యాఖ్యానించినారు.
4. మానవాకారముతో ఉన్న ప్రతి మనిషికి ఈ గ్రంథము ఉపయోగపడును. జాతి, మత, కుల, వివక్షతలేని గ్రంథము.
   భగవద్గీత - హిందువుల మత గ్రంథము అని, బైబిలు క్రీస్తు మతం వారిదని ఉద్దేశింపబడినవి. అలాగే లోకములో ప్రచారంలో ఉన్నవి.
5. 'సన్యాసి' గురించి ఎలా చెప్పినారో మీరు 7,8,9,10 శీర్షికలు చదివిన మీకు అర్థమగును.

   భగవద్గీతలో, బైబిలులో చెప్పిబడినట్లు 'సన్యాసులు' కాదు. ఇందులో ప్రతి విషయము శ్రీ చిన్నమ్మగార్కి ఆత్మశక్తిచే ప్రేరేపింపబడి చెప్పబడినవి. వీటిని మీరు జాగ్రత్తగా చదువుకొని, యోచించుకొని, అచరణలో పెట్టిన వారి జీవితము ధన్యమగును.
7. శ్రీ చిన్నమ్మగారి ఫోటోక్రింద పద్యం యొక్క భావనను ప్రతి ఒక్కరికి అమ్మ గట్టిగా చెప్పేవారట. "అని తెచ్చుకోకని, అన్నారని బాధపడకని." ఇటువంటి చిన్న చిన్న పలుకులు భగవద్గీత, బైబిలులో కనబడవు.
8. ఇంత సులభశైలి భాషతో ప్రతి ఒక్కరికి అర్థమయ్యే భాషలో చిన్నమ్మగారు చెప్పినారు. భగవద్గీత, బైబిలు యిలా అతి తేలిక భాషతో, వివరంగా ఉన్నట్లు లేదు.

9. అమ్మ శతకం, పాటలు, పద్యాలు చూడండి. ఎంత తేలిక భాషతో వారి భావాలను యిమిడ్చినారో చదువరులే గమనించాలి.

10. అమ్మలోని శక్తి పొందవలెనంటే ఎంత పైకము వలనను రాదు. అటువంటి వారి సాంగత్యమున ఆ శక్తిని కాయక సేవతో సంపాదించాలి. ఆ శక్తిని సంపాదించిన అదే ఈ లోక ఋణము తీర్చి మోక్ష మార్గమునకు దారి చూపును.

భగవద్గీత, బైబిలులో శక్తి సంపాదించమని ఎక్కడా చెప్పినట్లు లేదు. పూజలు, పారాయణములు చేయుమని వ్రాసినారు. ఇవన్నియు ఉపయోగం లేనివి.

11. అన్నిటికన్నా ముఖ్య విషయము. "ఎవరి చేసుకున్నది వారిదే. చేతయే గీత" యని బాగా చెప్పినారు. ఒకరిది మరియొకరికి రాదు. చేసిన కర్మ ఫలితమును ఎవ్వరూ తప్పించుకోలేరు. ఏది నీకు సంభవించిన అది నీ పూర్వ కర్మ ఫలితమే అని అమ్మ గట్టిగా చెప్పినారు. అందువలన ప్రతివానిని జాగ్రత్తగా ప్రవర్తించుచూ పరమాత్మను దర్శించిన వారి సాంగత్యం చేయమన్నారు.

12. దేవుడు బాధ్యత లేనివాడని, దేవుడంటే పరమతేజోపదముగా ఉన్న పరమపదము. గుణరహితుడు. ఆ పదమును జేరవలెను గాని మనను జేర్చు "భగవంతుడు లేడు". ఆత్మ (జ్ఞానము) ద్వారా పరమపదమును చూడవలెను. కర్మ నివృత్తి కాగా ఆ పరమపదమును జేరుదురు అని ఘంటాపథంగా అమ్మ చెప్పినారు. ఈ సృష్టి అంతా మాయ, ప్రకృతిది అని అమ్మ గట్టిగా చెప్పినారు.

భగవద్గీత, బైబిలులో ఈ సృష్టి అంతా దేవుడు, ఈశ్వరుడు ప్రవర్తింప జేయుచున్నాడని, ఈశ్వరుని శరణువేడుకొనినవాడే మోక్షమార్గంనకు అర్హుడనని ఈ గ్రంథాలలో వ్రాసినారు. ఇది యదార్థము కాదు.

శ్రీ చిన్నమ్మగార్కి అభిమానము పోయినది. అభిమాన రహితులే జన్మ రహితులు. క్రీస్తు, కృష్ణులకు ఆ జన్మలో అభిమాన రహితం కాలేదు.

పై చెప్పిన కారణాలవలన జన్మ తరించు శ్రీ చిన్నమ్మ పలుకులు భగవద్గీత, బైబిలు కన్న గొప్పదని ప్రచురణకర్త చెప్పవలసి వచ్చుచున్నది.

ఏమైన సందేహాలు, వివరాలు కావలెననిన ఈ క్రింది ఫో.నెం. కు లేదా మా అడ్రసుకు తెలియజేసిన మీ సందేహాలకు సమాధానం దొరుకును.

జై శ్రీ చిన్నమ్మ జై శ్రీ చిన్నమ్మ జై శ్రీ చిన్నమ్మ



# ఎవరిది వారిదే

సీ॥ ఒకచోట నొకమాట ఒకడు విన్న ఫలంబు
అనుభవించునువాడు, అన్యుడెట్లు?
ఒక పండులో నుండు ప్రకటమౌ రుచులెల్ల
తినువానిదే యంచు తెలిసికొనుము
ఒక చిత్రశాలలో చకచకల్ కనుసొంపు
చూచువానిదెగాక జూచునెవడు?
గాఢనిద్రలో గల్గు కమ్మని సౌఖ్యంబు
నిద్రించు వానిదే నిజము దలుప

తే॥ అన్ని ఫలములు వారినే యంటిన్నట్లు
మనల కోపాన ఒరులన్న మాట కూడ
అన్న వారిదె గాక యెట్లౌను మనకు
ఇంత మాత్రము తెలియదా, చింతజేయ!



# మామాట

అమ్మ, తాము మాటలు చెప్పు సందర్భమునగాని, వ్రాయించిన మాటలు చదివించునపుడుగాని, "వ్యాజ్యము గెలువకపోయినను, మాయ అమలు అయినా తెలిసికొని వుంటే మంచిద"ని అనెడివారు. అందుకే యీ పుస్తక ప్రచురణ. ఇందు పేర్కొనినట్లు ఆత్మశక్తి సంపన్నుల సాంగత్యము చేసి వ్యాజ్యము గెలువగలిగితే (శాశ్వతానందము నొందగలిగితే) కావలసినదేమున్నది?

అమ్మ మౌనకాలమున – చదువురాని కారణముచే సంజ్ఞల ద్వారా తెలిపిన పలుకులు గాన, యిందే వేని లోపములున్నను కర్తృత్వమును వ్యక్తీకరించునట్లేచ్చటేని కాన్పించినను అది సైగలను గ్రహించి వ్రాయువారి భాషాపటిమ చాలమియేగాని, మరొండు కాదు.

ఆత్మదాపున నుండునదే మాయను ఖండించును గాన వాడుకలో దీనిని కూడా ఆత్మ యనుచుండిరి. అందుచే "ఆత్మ మాయను ఖండించున"ను భావము వచ్చునట్లేచ్చటేనియున్న యిట్లర్థము చేసుకొనగును. ఆత్మ దాపున నుండునది మాయను ఖండించును. ఆత్మకు మాత్రము పరమాత్మయే.

గ్రంథ విస్తరణ భీతిచే అమ్మ జీవితమందలి ప్రతియంశమును పేర్కొనవలను పడలేదు. లోగడనే అమ్మ జీవిత చరిత్రను కొంతవరకు వ్రాసియుంచిన శ్రీ తత్వానందస్వాముల వారి కృషియు, శ్రీ రేపల్లె బసవయ్యగారు వ్రాసియుంచిన అమ్మదైనందిన చర్యయు యిందెక్కువ తోడ్పడినవి.

– ప్రకాశకులు



# శ్రీ చిన్నమ్మ జీవిత సంగ్రహము

పూర్వజన్మ సంస్కార జనిత పుణ్య విశేషంబుచే జ్ఞానిగా వెల్గొంది, లోకవృత్తులన్నియు నొకటొకటిగా రహితమై, శాశ్వతానంద స్థితిని బడసి, ఆధ్యాత్మిక జిజ్ఞాస పరులకు దివ్య మార్గదర్శినియైన వ్యక్తి శ్రీ చిన్నమ్మగారు. శ్రీకృష్ణ, బుద్ధ, వేమన, రామకృష్ణ పరమహంస, రంగావధూత, దొంతులమ్మ, మడుగుల స్వామి మున్నగువారి సాంప్రదాయమునకు చెందిన వారు వీరు. గొప్ప జ్ఞాని.

# బాల్య జీవితము

గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా లోని గొరిగపూడి యను గ్రామమున రేపల్లె లక్ష్మయ్య, శాయమ్మ అను దంపతులకు యిద్దరు కుమారులు, యిద్దరు కుమార్తెలు గలరు. వారిలో కడసారి బిడ్డకు మాచమ్మ యని పేరిడబడినది. ఆమెయే కాలక్రమమున శ్రీ చిన్నమ్మ యను సుప్రసిద్ధ నామముతో వ్యవహరింపబడినది.

వీరి జననకాలము నిర్ధారణగా తెలియదు. కాని 1887 వ సంవత్సరమని యూహింపబడు చున్నది. వీరు చిన్నతనము నుండియు శుద్ధ సాత్త్విక స్వభావము గలవారు. వినయ విధేయతలకీ తల్లిని చెప్పి మరొకరిని చెప్పవలయు ననిన నతిశయోక్తి కాదు. అత్యంతము సత్యప్రియురాలు. శైశవమున యీ సద్గుణములను గుర్తింపజాలని వారాబిడ్డ వర్తనమును జూచి వింతపడు చుండెడివారు.

తమ చిన్నతనములో ఎవరైన మనుష్యులు చనిపోవుట చూచినపుడు గాని, వినినపుడు గాని యీ అశాశ్వత దేహములను, యీ అనిత్య ప్రపంచమును జూచి వారిగుండె యెప్పుడును దడ దడ కొట్టుకొను చుండెడిదట.

పసితనమున నొకసారి యింటిలో కూర్చుండి యీమె చలిది కుడుచు సమయమున అన్న మెక్కువ కాగా "అక్కా! అన్నమెక్కువయినదే?" యని పలుక దొడ్డిలో పనులు చేసుకొనుచుండిన అక్కగారు, "ఎక్కువైతే నెత్తిన వేసుకో" అనెనట. అంతట నా బాలిక మిగిలిన యన్నమును తలపైనిడుకొని అక్క కడకు పోయెను. అంతట అక్కడున్నవారా అమాయకపు చేష్టను చూచి నవ్విరట.

తోడి బాలికలు ఎకసక్కెములాడుచో అపహాస్యమును భరింపలేక యీమె యేడ్చెడిదట. అప్పుడు పెద్దవారెవరైనను మరల తిట్టుమనియో, కొట్టుమనియో చెప్పగా, అటుల చేయ నొల్లక, 'నేను అనిపించుకొనుటకే పుట్టినాను' అను భావమును వెల్లడించెడిదట. కాని కోప తాపములతోడ నేమియు చేయ నొడంబడు టెన్నడును లేదు. కొద్దికాలమయిన వెనుక 'ఎవరి తిట్టు వారిదే. ఎవరి వెక్కిరింపు వారిదే. మనకేమి? అని తెలిసిన తరువాత ఆ ఏడుపు కూడ లేకుండ పోయెను.

సాధారణముగ స్త్రీలు తగవులాడు కొను సమయమున, 'నీ కడుపు మాడ,' అని

తిట్టుట కద్దు. అటులెపుడయిన వారి తల్లి యితరులను తిట్టుట జరిగిన, 'అలా తిట్టరాదు. ఎవరి తిట్టు వారిదే. ఈ తిట్ల వలన నీకే గదా నష్టమ'ని హెచ్చరించెడి వారట.

పదునాలుగు వత్సరముల వయసున గరిగపాటి గోవిందయ్య యనువారికిచ్చి యీామెకు వివాహము చేసిరి. తలంబ్రాలు పోయు సమయమున భర్తగారొక్కరే తలంబ్రాలు పోయుట జరిగినది. ఆ యమ మాత్రము పోయలేదు.

# గృహస్థ జీవితము

తలిదండ్రులు తన తనువును భర్త కొసగినందున, అది సంపూర్ణముగ ఆయన స్వామ్యమయ్యెనని, మాచమ్మగారు, అత్త వారింట కాపురము చేయునపుడు, దాస్యభావముతో సకల గృహకృత్యములను లోటు లేకుండ చేసెడివారు. భర్త యాజ్ఞ లేనిది కాయికముగా నేపనియు చేసెడివారు కారు.

ఒకసారి యిరుగు పొరుగు యువతులు సముద్రస్నానము నకు బోవ నుద్యమించిరి. ఈ అమ్మనుకూడ తోడు రమ్మనగా భర్త యిష్టపడునని తోచి వారితో బోవ నొడంబడెను. కాని భర్త వలదనెను. వెంటనే ఆమె ప్రయాణోద్దేశమును మానెను. తోడివారి కుత్సాహము కుంటుపడినది. వారును మానిరి. వారికి మనస్తాపము కలిగిన దనియు తాను దానికి కొంత కారణ భూతురాలననియు నామె పరితపించు చుండెను. అట్టి సమయమున లక్ష్మీ దేవమ్మ యను నొక స్నేహితురాలు (తదుపరి ఆమె పెద్దమ్మయని వ్యవహరింపబడినది.) ఆమె పరితాపమును బాపనెంచి, ఆమెను తీసుకొని వెళ్ళి, కృష్ణానదిలో స్నానము చేయించి, ఒక బ్రాహ్మణునికి దానమిప్పించి, అచటి దేవాలయమునకు తీసుకొని వెళ్ళి, "అత్త కడుపు చల్లన, అమ్మ కడుపు చల్లన," అని నమస్కారము చేయుమనెను. అంతట ఈ యమ "నాకేమి కావలయునో నాకు తెలియదు. నీకు తెలియును." అని నమస్కారము చేసెనట. లక్ష్మీదేవమ్మగారిది విని "ఆదేమిటే, అట్లా చేసినావు" అనెనట.

ఇతరులవలె హరికథలు, బుర్రకథలు మొదలగునవి విని నపుడు ఆ కథలో ఎక్కువగా వినబడువంత చరణము తప్ప మరేమియు గుర్తుండెడిది కాదట. కొంతకాలమయిన తదుపరి యీ కథలు, నాటకములు, సినిమాలు చూచువారి విషయములో వారి భావన యిది: "ఒకసారి కథ విన్న తరువాత అటుల నడువలేనపుడు, యింక మాటి మాటికి కనుట, వినుట దేనికి?".

"ఊరంతయు యిన్ని కుండలేల? ఒకేకుండ ఎందుకు వండుకొనరాద" నెడి యున్నత భావన ఆ కొద్ది వయసులోనే వారికి కలుగుచుండెడిదట.

ఎవరైనను బ్రతికి చెడ్డవారున్న, సంఘములో వారికి నగుబాటు రాకుండ, రహస్యముగ వారికెంతయు సాయపడు చుండెడివారు వీరు.

కాలక్రమమున వీరికి అయిదుగురు బిడ్డలు పుట్టి పసితనముననే చనిపోవుచు వచ్చిరి.

వారు చనిపోవుచున్న తరి, ఋణము తీర్చుకొని పోవుచున్నారనెడి భావనతో కంట తడి పెట్టెడివారు కారు. మరియు గతజీవుల నింటినుండి తీసుకొని పోయిన వెంటనే యింటిపనులు చేయుటకును, కాలువకు పోయి నీరు తెచ్చుటకును సమ కట్టెడివారు. కాని ఆ శిశువులు బ్రతికి యున్నంతకాలము, ప్రాల్మాలిక లేక, అత్యంతశ్రద్ధతో సమస్తోపచారములు చేసెడివారు. నిస్సంగముగ సమస్త కార్యములు నిర్వహించెడివారు.

ఎవరైన అప్పు నెగవేయునెడల అప్పిచ్చిన వారు, "ఇప్పుడెగవేసినను నా కొడుకై పుట్టి ఋణము తీర్చెదవులే." అనుట కలదు. మరియు "నవ్వుచు అప్పులెగవేసి, యేడ్చుచు తీర్తుర"ను నుడియు కలదు. మాచమ్మగారి నడవడి దీనికి వ్యతిరేకము. బిడ్డలు ఋణగ్రస్తులై పుట్టుదు రనుట వీరికి సమ్మతము కాదు. తలిదండ్రులే ఋణగ్రస్తులనియు, వారొకప్పుడెగ గొట్టిన ఋణములను తీర్చుకొను అవకాశము కొరకే బిడ్డలు పుట్టుదురనియు, వీరు చెప్పెడివారు. గతమున కృపణతతో నపహరించిన దానిని, మమతతో, పుత్రవాత్సల్యముతో తలిదండ్రులా ఋణము తీర్చుకొందురనియు, మీదు మిక్కిలి ఆ బిడ్డలు పోయినపుడు మమతచే మోహితులై యేడ్తురనియు అనెడివారు. కాని అప్పులవారు వచ్చి అప్పులు జమచేసుకొను సందర్భమున వారిని సమర్యాదగా జూచి, వారు వచ్చినపని నెరవేర్చి, సంతోషముగా పంపుట న్యాయము. బిడ్డలు పుట్టినపుడును, పెరుగునపుడును, చచ్చునపుడును అట్టి భావములతో మెలగు టొప్పగును. ఆ తీరున మాచమ్మగారు ఆదర్శమాతయై వఱలిరి.

## పోట్లఎద్దు

ఆ కాలమున గోవిందయ్యగారి వద్ద ఒక ఎద్దు కలదు. అది కొంచెము పోట్ల స్వభావము కలదగుటచే దానివద్ద కెవరును రా సాహసించెడివారు కారు. ఒకనాడది త్రాడు తెంపుకొని వూరివెంట బడినది. ఎదురుగా వచ్చి దానిని మరలించ నేరికిని ధైర్యము చాలక పోయెను. వెనుకనుంచి యైనను, దాగుట కేదేని యాధారము చూచుకొని గాని అదలించెడి వారు కారు. అపుడైనను ఆ అదలింపు వినగానే అది వారివెంట బడెడిది. ఇట్లెంద రెన్నివిధముల ప్రయత్నించినను ఫలితము కాన రాదయ్యె. అందరు అలసిపోయి చేయునది లేక దాని వెంటనే తిరుగుచుండిరి. తుదకదియును తిరిగి తిరిగి వచ్చి చావడిలో ప్రవేశించినది. చావడి చుట్టును ప్రజలు గుంపులుగా కూడి యుండిరి.

ఇదిచూచి మాచమ్మగారు, "ఎందుకట్లా దాని వెంటబడి కష్టపెడ్తారు?" అని అనెను. అంతట గోవిందమ్మగారు "అయితే నీవు కట్టేయి, మాటలు కాదు." అని ఉద్రిక్తులై పలికెను. చెప్పినట్లు చేయుటయే విధియని మాచమ్మగారు దానిని కట్టి వేయ బయలుదేరిరి. 'పొడుస్తుంది, వద్ద'ని ఎందరు వారించినను వినక, శరీరముపై నిమురుచు ముందుకు పోయిరి. కాని అది మాత్రము అమ్మను విడిచిపెట్టి, బుసలు కొట్టుచు దూరముగ నున్న వారిపై దుముక జూచు చుండెను. మాచమ్మగారు దాని రెండు కొమ్ములను పట్టుకొని త్రాటితో కట్టివైచిరి.

## సచ్చిదానందమూర్తి జననము

ఆరవ సంతానముగా నొక బాలుడు (సుమారు 1911) జనించెను. పెద్దమ్మగారు మ్రొక్కులు మ్రొక్కుకొని, దానములు చేసి వీని నెటులయిన బ్రతికించుకో అన్నారట. నెన్నెన్నో ప్రయత్నములు చేసిరి. బిడ్డడు బ్రతికినాడు. ఈ బాలునకు సచ్చిదానందమూర్తి యని పేరు పెట్టిరి. ఈతని సౌమ్య భావము, శాంత దమాది సుగుణములు వీనిని సార్థకనాముని గావించినవి. వీనిం గూర్చిన యొక యుదంతము పేర్కొందము గాక.

మాచమ్మగారు తన యలవాటు చొప్పున నొకసారి గ్రామాంతరమున గల జ్ఞానియని ప్రసిద్ధిగన్న యొక సాధ్విని జూడ బోయిరి. బాలకుని నింటికడ విడిచి పోయిరి. సాయంకాలము తిరిగి వచ్చునప్పటికి బాలకుడు గతజీవి యయ్యెనని బయట పెట్టుకొని యేడ్చుచుండిరి. చిన్నబిడ్డ గుణము వచ్చి జీవ చిహ్నములు లేక పడియున్న బాలుని మాచమ్మగారు భుజమున నిడుకొని యింటిముందు తాము నాటియున్న తులసిమొక్క దాపునకు బోయి, దానిని పెరికి వేయుటకై చేతితో పట్టుకొనిరి. తక్షణమే భుజమున నున్న బాలుడు తుమ్మెను. క్రమేణా ఆరోగ్యము పొందినాడు. ఒక విషయము. వీరు తులసిపూజ చేయుట, భర్త చెప్పినటుల చేయవలెననియే గాని, తాముగా పుణ్యము సంపాదించవలె ననెడి దృష్టితో కాదట.

## అన్నియు నేనే - ఒకటియు నేను కాదు

ఈ బాలుడు జనించిన ఇరువది యొకటవ దినమున (సుమారు జూన్ 1911) మాచమ్మగారికి, “అన్నియు నేనే – ఒకటియు నేను కాదు.” అనెడి స్థితి ప్రారంభమయినది. సాధారణముగ వారి అవయవములు “అన్నియు నేనే” యను భావముండి పనిచేయు చుండును. కాని “ఒకటియు నేను కాదు” యని కాన్పించినపుడు, పనులు చేయుచుండిన, ఆ పనులు తటాలున నాగిపోయి, చేతనున్న వస్తువులు పడిపోయెడివి. వడ్లు దంచుచుండగా, ఒకటియు నేను కాదను భావము స్ఫురించుచో, పైకెత్తిన రోకలి అటులనే హఠాత్తుగా చేతనుండి జారి పడి పోయెడిది. చేయి యున్నదున్నటుల నిలచి పోవును. నీళ్ళు తోడుచుండు తరిని వేఱను భావము తట్టెనేని, చేదను పైకి లాగ గలిగెడి వారు కారు. చేతులున్న వున్నటుల నిలుచును. మరల ‘అన్నియు నేనే’ (దేహము నేనే) యను భావము కలిగిన యథాప్రకారము పనులు చేయగలిగెడివారు. ఇటుల రెండు సంవత్సరములు గడచెను.

“ఒకటియు నేను కాదు.” అనునపుడు తాను వేరయి, శరీరము తోలుబొమ్మ యగుట చూచి, ‘నేను గదా యీ శరీరమును వాడుకొనునది. నేను లేని యెడల దీనిపని ఖాళీ’ యనునటుల ఆ మాయ ఎంతయో విపరీతముగ నవ్వెడిది. వీరి కపుడపుడు కలుగు ఈ విపరీతపు నవ్వును ఒకరి శిష్యులు చూచి ఆశ్చర్యము చెంద, శిష్యుల కోరిక పైననే వారి గురువుగారు, ‘యిదెంత భాగ్యము, మేమును అట్టి యానందమును తెప్పించగలమ’ని శిష్యులకేదియో మందిడుట, తన్మూలముగ వారు ఆనందము లేకపోగా, బాధపడుట

సంభవించినది. తదుపరి వారికి విరుగుడు మందిచ్చి, మందును కక్కించిరి. అపుడా గురువుగారు భయపడి ఆ సమయముననే స్వగ్రామమునకు వెళ్ళిపోయిరి.

## పరమాత్మ దర్శనము

సచ్చిదానందమూర్తి పుట్టిన రెండు వత్సరములకు వెంకట్రామయ్యయను కుమారుడు పుట్టెను. వీని కెనిమిది నెలల వయసున (1914) తల్లి పొరుగింట కొందరి స్త్రీలతో కలసి కూర్చుండి యుండెను. వేసవి కాలము, మధ్యాహ్న సమయము. అపుడు హఠాత్తుగా నామెకు దేదీప్యమానమగు వెలుగు కానుపించినది. పెద్దమెరుపు గోచరించునపు డన్యమేమియు గోచరించని తీరున, అపుడు వారి కితరమేమియు గాన్పింపలేదు. ఈ మెరుపు మధ్యాహ్నవేళ సూర్యకాంతి నతిక్రమించి ద్యోతక మగుట వారి కాశ్చర్యముగా నుండెను. తమ చుట్టునున్న వారిని 'యిపుడు మెరుపు మెరిసినదా?' యని ప్రశ్నింప, వారు చూడ లేదనిరి. కొందరు వింతపడి, 'ఇపుడు మెరుపేమిటమ్మా?' యనిరి. కాని మాచమ్మగారికి మాత్రము తాము దర్శించినది పరమాత్మయే యని ధృఢ విశ్వాస మమరినది. పరమాత్మ లోక రహితమైనదనియు, అందు ప్రకృతికి స్థానము లేదనియు తెలిసినది. తదుపరి ఆ దివ్యకాంతి తరచు కాన్పించు చున్నను, సుస్థిరముగ లేని కారణమునను, దాని దర్శనములేని సమయము లందు ప్రపంచము గోచరించుట వలనను, పరమాత్మ సాధారణ మానవుని ఎరుకకు గోచరించునది కాదనియు, పరమాత్మను జూచు నెరుక వేరనియు వారికి నిశ్చయము కలిగినది.

మొదట 'అన్నియు నేనే – ఒకటియు నేను కాదు' అనుచు వేరుపడు తెలివినే వీరు పరమాత్మగ భావించిరి. కాని యదార్థము కాన్పించుటతో అది మాయ యని దృఢపడినది.

## కొన్ని మహిమలు

గొరిగపూడి దగ్గర నొక గ్రామములో కొల్లూరు దుర్గయ్య యను పిచ్చివాడుండెను. అతని పేరు చెప్పిన అందరును భయ పడెదరు. ఒకరోజున అమ్మవద్దకు వచ్చి "అమ్మా! సీతమ్మ తల్లీ! అన్నము పెట్టుమ'ని అడిగెను. మాచమ్మగా రన్నము తెచ్చుటకై యింటిలోనికి వెళ్ళిరి. ఇంతలో అతడు అచటనే మూలనున్న రోకలిబండ యొకటి తీసుకొని గిర గిర త్రిప్పసాగెను. అమ్మకేమైన ప్రమాదము కలిగించునేమో యని అందరు భయపడిరి. అమ్మ అన్నము పెట్టగనే అతడా రోకలి బండను క్రిందబెట్టి దానిమీద కూర్చుని, సాధువువలె అన్నము తిని పోయెను.

మరియొక పర్యాయమతడు ఒక నాగలి దుంప భుజమున నిడుకొని అమ్మ వద్దకు వచ్చెను. అమ్మ అపుడు ఉలవలు రుబ్బుచుండిరి. ఆ దుంప క్రింద బడవైచి, అమ్మ పాదములపై బడి, "నమస్కారము సీతమ్మ తల్లీ!" అని యనెను. "తప్పుకాదా నాయనా! అలా కాళ్ళమీద పడవచ్చా!" అని అమ్మ అనిరి

ఒకనికి జబ్బుచేసి సంధించినది. ఆ సంధిలో పూర్తిగా మతిచెడి పిచ్చివానిలా వ్యవహరించు చుండెడివాడు. అమ్మ అతని ప్రక్కలో కూర్చొనగానే అతని సంధి వెంటనే తగ్గిపోయినది.

## దొంతులమ్మతో

అతీతులెచ టయినా యున్నవారిని దర్శించి, తమ యనుచరులను వారివద్ద నుండుమని ప్రోత్సహించెడి వారు అమ్మ.

అప్పటిలో (1917) బందరులో అతీత స్థితిలో నున్న దొంతులమ్మ యను వారొకరుండిరి. పెద్దమ్మగారి తోడ ఒకటి రెండు పర్యాయములు అమ్మ వారి దర్శనమునకు వెళ్ళిరి. ఒక పర్యాయము వెళ్ళినపుడు అమ్మ దొంతులమ్మగారి నిట్లడిగిరి. "అమ్మా! లోక గుణములన్నియు ఒక్కసారే విడిచిపోవునా లేక ఒక్కొక్కటే పోవునా?"

"అయే పోతాయి." అని దొంతులమ్మగారు దాపున నున్న ఒక ముంతను తీసుకొని, దానిలోని నీటిని కొంచెము వంచివేసి, కొంత తడవాగి, మరికొంత నీటిని వంచివేసి, మరల ఆగి, తుదకు నీటినంతటిని పారబోసి వట్టి ముంతను జూపిరి. అంతట అమ్మ సంతసించి, 'అమ్మా! ఒక్కొక్క గుణమే క్రమముగ విడిచిపోవుచు, చివర కన్నియు పోగా నిర్గుణము మిగులునని తెలిపితివా?' అని ఎంతయో మక్కువతో వారి గడ్డమును నిమిరిరి.

మరొక పర్యాయము వెళ్ళినపుడు, దొంతులమ్మగారు, 'గాజులూ ... తాలిబొట్టు ... అటుచూడు' అనిరి. అనగా గాజులు, తాలిబొట్టు మొదలైన వేవీలేని స్థితి ఒకటున్నది. అదియే పరమాత్మయని వారి భావన. ఈ భావమును గ్రహించి అమ్మ యెంతయు ఆనందించిరి.

## తండ్రి భావము

వెంకట్రామయ్య జనించిన రెండేండ్లకు (1916) శ్రీరామమ్మ యను కొమరిత జనించినది. గర్భవతియై యున్న కాలముననే వీరి యారోగ్యము సరిలేదు. పురుటిలో నొకనాడు భూశయనము జేయుట తటస్థించినది. ఆ సమయమున బాహ్య స్మృతిలేక పడియుండగా మాచమ్మగారి కొక ముదుసలిది గుమ్మము మీద కూర్చుండి యున్నటుల కాన్పించినదట. అటు ఇంటిలోపల అగాధమగు చీకటి కోణముగా నున్నదట. ఇటు దేదీప్యమానమగు ప్రకాశము. ఆ ముదుసలిది వీరితో 'అమ్మాయీ! నీవిటు వచ్చేదానివా లేక అటు పోయేదానివా?' అని ప్రశ్నించినది. ఆ చీకటి యగాధము గాంచి భీతిల్లిన మాచమ్మగారు, లోనికి రాననెనట. "అట్లయిన నీ దారిని నీవు పో" అని ఆ ముదుసలిది అంతులేని ఆ చీకటి గోతిలోనికి జారిపోయెనట. ఇంతలో స్పృహ వచ్చినది. క్రమముగా బల సత్త్వములు లభించినవి. ముదుసలిది చూపిన మార్గము సంసార కూపము. మాచమ్మగా రెన్నుకొనినది ప్రకృతి రహితమౌ ఆత్మగతి.

పై ఘటనా సందర్భముననే పితృభావ ముదయించినది. ఆరుమాసముల తదుపరి ఒకనాటి రేయి భర్తగారు వీరి మంచమును సమీపించు తరి, వీరికి భయము కలిగినది. వీరిని చూడగనే భర్తగారి గుండె ఝల్లుమనెను. ఆయన కీమె తల్లిగా కాన్పించినది. ఈమె కాయన తండ్రిగా కాన్పించెను. అప్పటినుండి మాచమ్మగారు వీరిని 'గోవిందయ్యబాబు' యనియు, వీరు మాచమ్మగారిని "అమ్మా" యనియు అనెడివారు.

## పెద్దమ్మను పిలుచుట

ఒక పర్యాయము వెంకట్రామయ్య (ద్వితీయ పుత్రుడు) గారికి పెద్ద జబ్బు చేసినది. నయమగు సూచనలు కనుపించలేదు. అప్పటికే అమ్మకు గొప్పవారనెడి పేరు వచ్చి యున్నది. గోవిందయ్య గారపుడు, 'నీ సత్యమేమిటో యిపుడు చూస్తాను గదా!' (నీ సత్యమున్న బ్రతుకవలె గదా!) అని యనిరి. అంతట అమ్మ "వీడి ప్రాణం పోతే, వీడితో పాటు నా ప్రాణం కూడ పోవలసిందే" అనిరి. ఆ కుర్రవానికి జబ్బు యెక్కువై బయటపెట్టు పరిస్థితి వచ్చినది. అమ్మ అట్లనిరే గాని, మాట యసత్యమగు నేమోయని తదుపరి భయపడిరి. అథవా ఆ బాలుడు చనిపోవుట జరిగిన అమ్మ చనిపోవుటెట్లు? ఏమియు తోచలేదు. వెంటనే అచటికి 10 మైళ్ళ దూరమున గల బొబ్బర్లంకలో యున్న పెద్దమ్మ కనిపించి, "అమ్మా!" యని బిగ్గరగా కేక యిడిరి. ఆ సమయములో పెద్దమ్మ పలుదోము కొను చుండిరి. ఈ కేక వినిపించగనే ప్రక్కనున్న వారితో, "ఇదేమిటే! మాచమ్మ 'అమ్మా!' అని పిలుస్తోంది.' అని పలికి వెంటనే బయలుదేరి యీ అమ్మవద్దకు వచ్చి, 'ఎందుకే నన్ను పిలిచావు?' అని యడిగిరి. అపుడు అమ్మ, 'వీడికి జబ్బుచేస్తే నేనిలా అన్నాను. మాట అసత్య మవుతుందేమో నని భయమేసింది. ఒకవేళ వాడు చనిపోతే, నేనెట్లా చచ్చిపోయేది?' అని చెప్పిరి. 'వాడేమిటి? చచ్చిపోవడ మేమిటి? వాడి ప్రాణానికి నా ప్రాణం అడ్డం' అని పెద్దమ్మగారు హామీ యిచ్చిరి. కుర్రవాడు సజీవుడై క్రమముగా ఆరోగ్యము పొందెను. చివర కుభయుల వాక్యములు సత్యమయినవి.

## పనులు చేయు శక్తి పోవుట

అమ్మ యథాప్రకారము యింటి పనులన్నియు చేయుచునే యుండిరి. కాని పనిచేయుట చాల భారముగ నుండెడిది. తమలోపల విచారము పెల్లుబుకుచుండ, నింటికడ నేడ్చినచో నందరు విపరీతముగ భావింతురను తలంపుతో కందిచేలలోనికి పోయి బిగ్గరగా వెక్కి వెక్కి యేడ్చెడివారు. దుఃఖ ముపశమించిన పిమ్మట తిరిగి వచ్చెడి వారు.

ఒకనాడు గోవిందయ్యగారు 'ఇట్లా యేడుస్తూ చేస్తుంటే మాకు మంచిది కాదు. రేపటినుంచి పనులేమీ చేయనక్కరలేదులే' యనిరి. మరుసటి ఉదయము నూర్చుకొని వచ్చిన ధాన్యమును మగవారు పాతరలో పోయుచుండిరి. అమ్మ పచ్చి మిరపకాయలు వేయించు చుండిరి. అపుడు, 'నీనుంచి బాగుపడేవారున్నారు. చెడిపోయేవారున్నారు.

లే,' అని అమ్మకు తన లోపలనుండి ఒక శబ్దము వినిపించినది. ఇకనేమున్నది. 'నన్నెత్తుకు పోతోందే,' అని అమ్మ పెద్దగా అవురుమనిరి. ఆ కేక విని పాతరలో ధాన్యము పోయువారంతా పరువిడి వచ్చిరి. 'నిన్నేమిటి? ఎత్తుకు పోనీయడ మేమిటి? తలుపులు వేస్తాము,' అని వారనిరి. 'ఇంటికప్పు ఎగురగొట్టుకొని ఎత్తుకు పోతుందట.' అని అమ్మ స్పృహ తప్పి పడిపోయిరి.

ఆ సాయంకాలమునకు స్పృహ వచ్చినది. తక్షణమే ఎవరో ఆమెను హఠాత్తుగా గుద్దినట్లయినది. ఆ దెబ్బతో వారు యింటినుండి బయటికి వచ్చిరి. మరల నింటిలోనికి పోబోవ, ద్వారము చెంతకు రాగానే కాలు సేతులు సత్తువ లేని వై పడి పోయిరి. దాపున నున్న వారిని, తనను ఎత్తి యింటిలోపల బడ వేయుమనెను. వారటుల చేయ ప్రయత్నించిరి. కాని, చేయ జాలక పోయిరి. ద్వారము కడ అరుగు మీదనే వీరుండి పోయిరి.

## పిల్లల ఋణము తీరుట

ఒకనాడు సచ్చిదానందమూర్తి బడినుండి వచ్చి, కంచములో నన్నము పచ్చళ్ళు పెట్టుకొని, నేతిగిన్నెతో సహా తెచ్చుకొని తల్లిదాపున బెట్టి, 'అమ్మా! యీ గిన్నె పట్టుకొని నెయ్యి వడ్డించమ్మా' అని అనగా అమ్మ అటుల చేయజూచిరి. కాని చేయి రాకపోయెను. "అయ్యో! మీ అమ్మ బ్రతికి యుండగనే, మీరు తల్లిలేని పిల్లలైనారా?" అని యేడ్చిరి. ఆమె లోపలిశక్తి 'ఏయ్! యింతమందికి తల్లివి కానిదే, యీ పిల్లలకు తల్లివి ఎట్లా అయ్యావ్?' అని పలుకు సరికి ఆ ఏడ్పును లేకపోయెను. పసిబిడ్డ శ్రీరామమ్మకు పాలీయబోవ యివ్వలేక పోయిరి. ఆ బిడ్డకూడ తల్లి దాపునకు రాలేక దూరముగా పోయినది.

## మంగళ సూత్రము

ఇంటి పంచనుండెడి రోజులలో ఒక చిన్న సంఘటన జరిగినది. ఆధ్యాత్మిక రంగములో అమ్మ గొప్ప వారనెడి సంగతి అప్పటికే నలుగురకు తెలిసి యుండుటచే నలుగురు వచ్చిపోవుట జరుగుచుండెడిది. ఒకనాడు అమ్మ నలుగురితో కూర్చొని మాట్లాడుచుండిరి. ఆ సమయములో వారి దృష్టి మెడలోనున్న మంగళసూత్రము మీద పడినది. "ఇదేమిటే, మెడలో?" అని లోపలి శక్తి ప్రశ్నించినది. మెడపై ఏదైనా విషపు పురుగు కనపడిన, భయపడి మనము గభాలున తీసి, అవతల పారవేయునటుల, ఆ మంగళ సూత్రము కూడ ఆ విధముగా కనుపించ, వెంటనే తీసి అవతల పారవైచిరి. అదిపోయి దగ్గర కూర్చొనియున్న ఒకరిపై పడినది. వారుకూడ భయపడి వెంటనే తీసి ప్రక్కనున్న వారిపై విసరిరి. వారుకూడ నటులనే చేసిరి. ఇటుల అచట ఎంత మంది కలరో అందరి చేతులలోను తిరిగి చివరకు వెంకయ్యగారను (భక్తులు) నొకరి చేతిలోనికి పోయినది.

ఈ ఘటనా ప్రసక్తి వచ్చినపుడు అమ్మ యిటులను చుండెడి వారు. – ' పెండ్లినాడు మంగళ సూత్రము అందరి చేతులలో తిరిగి చివరకు మెడలోకి ఎట్లు చేరునో, అటులనే దానికి పోటీయా యనునట్లు మెడలోనుండి తీసివేయబడి అందరి చేతులలోనూ తిరిగినది.

## మౌనము

పనులు చేయు శక్తిపోయి యింటి పంచను వుండు కాలములోనే అమ్మకు మౌనము ప్రారంభమయినది. మౌనమన మాట్లాడగలిగి యూరకుండుట కాదు. మాట్లాడుదమని అమ్మ ఎంత ప్రయత్నించినను నోరు, పెదవులు కదిలెడివి గాని, శబ్దము వచ్చెడిది కాదు. పూర్వము వచ్చిన మాటలు లేని సినిమాలలోని బొమ్మల పెదవుల వలె, వీరి పెదవులు కదిలెడివి గాని, శబ్దము లేదు. ఏదయినను చెప్పవలసి వచ్చిన పెదవుల కదలిక ద్వారాను, లేదా సంజ్ఞ ద్వారాను చెప్పుచుండెడి వారు. ఇటుల పండ్రెండు వత్సరములు గడచినవి (1919 నుండి 1930 వరకు). మరల 7 వత్సరములు గడచిన తదుపరి రెండవ మౌనము ప్రారంభ మయినది. ఈ మౌనకాలము సుమారు అయిదు వత్సరములు. ఈ మౌనకాలములోనే అమ్మలోనుండి జన్మ తరింపుమాట లనేకము వచ్చినవి. అదికూడ ఋణమేనని, చదువులేని కారణముచేత, వ్రాయగల వారెవరైన సంభవించు నపుడెల్ల సౌంజ్ఞతో తెలిపి, బ్రతిమాలి ఆ మాటలు వ్రాయించిరి. వాటిని దగ్గరనున్న వారు ఒక పుస్తకముగా రూపొందించిరి. అదియే యీ "జన్మ తరించు శ్రీ చిన్నమ్మ పలుకులు" (మాయ అమలు తెలుపు మార్గము.)

## ఇంటి ఋణము తీరుట

ఒకరోజున అమ్మ దగ్గరలో నున్న యొక గ్రామమునకు వెళ్ళి తిరిగి వచ్చుచుండిరి. త్రోవలో, నీళ్ళమీద నడచుట కెంత భయమో, భూమిమీద కాలిడుట కంత భయము వేసి, కాళ్ళకు శక్తిలేక అట్లనే పడిపోయిరి. పరిచితులెవరో వారిని చేతులతో తీసుకొని పోయి యింటివద్ద చేర్చిరి.

కొలది దినములు గడచిన తదుపరి ఒకటికి, రెంటికి బయటకు వెళ్ళగలిగెడి వారే గాని, తిరిగి వచ్చుటకు కాళ్ళు వచ్చెడివి కావు. అపుడు పది, పండ్రెండేళ్ళ బాల బాలికలైనను అమ్మను యెత్తుకొని వచ్చి అరుగుపై కూర్చుండబెట్టెడి వారు. అటుల ఎనిమిది దినములు మాత్రమే గడచినవి. చివరి దినమున మామూలుగనే అమ్మ బయటకు వెళ్ళగా, వారిని యెత్తుకొన బోగా 'అంటుకో చూద్దాం.' అని యనిరి. అంతట ఆయన వారిని తాకలేక పోయెను. ఇంటి ఋణము కూడ తీరినది కాబోలు. ఇక స్థానమేది? దగ్గరలోనే శిథిలమైయున్న రామ మందిరమొకటి కలదు. అదిగో నీస్థానమనినట్లు లోపలిశక్తి ఆ స్థలమును చూపించినది. వెంటనే అమ్మ ఆ పడిపోయిన గుడి లోనికి జేరిరి. అచట కూడ ఎక్కువ కాలముండ వలను పడలేదు. ఆ గ్రామమును కూడ వదలి పెట్టి పోవలసి వచ్చినది. ఆ పోవు నపుడు 'అయ్యో! వూరు విడిచి పోవలసి వచ్చింది. లోకములో ఎవరికెట్లా కనుపిస్తానో? అందరికి తల్లిలాగ కనుపిస్తానో లేదో!' యని రోడ్డుప్రక్క ప్రతిలోబడి ఎంతగానో యేడ్చిరి. వీరి ననుసరించుటకు ఒకరు వీరివెంట రాగా, 'యింతమంది కానివారు కాగా, యింక నీవొక్కడవా నాకు తోడుపడేది?' అని ఒక గీతగీసి, "యీ గీతదాటి రాబోక"ని

యనిరి. అంత వారు భయపడి అమ్మ అనుసరించ లేక పోయిరి. అంతటితో ఆ వూరు ఋణము కూడ తీరినది.

## సన్యాస జీవితము

ఊరు విడువ బడిన పిదప, అందరికిని తల్లిగా కనబడుదునో లేదో యని శ్రీ చిన్నమ్మ ★ యొదిగి యొదిగి అచటచట తల దాచుకొని కాలము గడుపుచుండిరి. వీరి ననుసరించు వారు కూడ వీరికి తగు రక్షణ గల్పించుచుండిరి. ఈ కాలములో వీరెక్కువగా నల్లూరుపాలెం, బొబ్బర్లంక, గొరిగపూడి గ్రామములలో కాలము గడుపుచుండెడి వారు.

## ధనము తాకలేక పోవుట

ఒకనాడు నల్లూరుపాలెం గ్రామములో అమ్మ కొందరితో కూర్చుండియున్న సమయమున అచటికి ఒక నిరుపేదరాలు వచ్చి, 'అమ్మా! పొట్టకు, బట్టకు ఏదో విధంగా తంటాలు పడతాను. కాని తలదాచుకోవటానికి పంచలేక యిబ్బంది పడుతున్నాను. మీరు చెబితే నలుగురూ ఏదైనా సాయము చేయవచ్చునని చెప్పుకుంటున్నానమ్మా!" అని యనెను. అంతటచట కూర్చున్నవారిలో నొకరు వెంటనే ఒక రూపాయి బిళ్ళను, 'అమ్మా! ఇదిగో నా వంతు ఒక రూపాయి' అని అమ్మ పైకి విసరిరి. ఈ రూపాయిబిళ్ళ మీద పడుసరికి నేదియో విషసర్పము మీదపడిన భయపడినట్లుగా అమ్మ భయపడి, నేలమీద పడి దొర్లిరి. అపుడు రెండు మోకాళ్ళపైన రెండు పుండ్లు పడినవి. ఈ సంఘటనను గురించి ప్రస్తావించునపుడెల్ల తమ మోకాళ్ళ మీదనున్న ఆ పుండ్లమచ్చలను అమ్మ చూపించు చుండెడివారు.

శ్రీరామకృష్ణ పరమహంస జీవిత చరిత్రలో కూడ యిట్టి సంఘటనయే కాన్పించును. వివేకానందుడు రామకృష్ణుని ప్రక్క క్రింద రూపాయి బిళ్ళ పెట్టినపుడు పరమహంస తటాలున లేచి, ఏదియో పురుగు కుట్టినట్లు శరీరము మంటలెత్తుచున్నదని చెప్పిరట.

యీ సంఘటనతో తాము ధనము తాకలేమన్న సంగతి అమ్మకు యిప్పుడే తెలిసినది. కాని వారు పనులు చేయలేక పోయినపుడే ధనము తాకలేని స్థితి వచ్చినదని గ్రహించవలెను. తదాది ధనము తాకుట యనిననే గజగజ వణకెడి వారు. కొంతకాలము ఒక్క మన్ను మినహా ఏ లోహపు వస్తువులనుగాని లేదా ఆ వస్తువులను ధరించిన వ్యక్తులనుగాని దగ్గరకు రానిచ్చెడి వారు కారు. అందుచేత ఆ కాలములో అమ్మ మట్టిపాత్రలనే వాడుచుండెడివారు.

**★ అమ్మకు ప్రధాన స్నేహితురాలు లక్ష్మీదేవమ్మగారని లోగడనే పేర్కొంటిమి. వయసున పెద్దవారగుటచే లక్ష్మీదేవమ్మగారిని పెద్దమ్మ యనియు, చిన్నవారగుటచే అమ్మను చిన్నమ్మ యనియు లోకమనుచూ వచ్చినది.**

## మరికొన్ని మహిమలు

ప్రాథమిక దశలో అమ్మ ననుసరించిన వారిలో యలవర్తి వెంకయ్యగారొకరు. వారు రేపల్లె బజారునకు వెళ్ళి ఏదో యొక ఫలహారమును, అమ్మకు పెట్టుకొనుటకై కొని తెచ్చి, దానిని దాచి, "అమ్మా! ఇదేమిటమ్మా!" యని అడుగగా, వారు తెచ్చిన వస్తువునే అమ్మ చెప్పెడివారు. ఈ విధముగా కొన్ని దినములు జరిగిన తదుపరి, ఒకరోజున వారికి బజారులో ఏమియు కాన్పించక తిరిగి వచ్చి మామూలు ప్రకారమే అడుగగా, ఏమియు లేదని చెప్పినారు.

ఈ వెంకయ్యగారికే ఒకపర్యాయము కీళ్ళవాతము వచ్చినది. రేపల్లెలో ఒక డాక్టరుగారిచే చికిత్స చేయించుకొని అమ్మవద్దకు వచ్చిరి. అమ్మ, 'నయమయినదా వెంకయ్యా? పైకమెంత యిచ్చితివ'ని వారి నడిగిరి. వారు 'నయమయినది. నలభై రూపాయ లిచ్చితిన'ని చెప్పిరి. అంత అమ్మ ఇంకా అరవై రూపాయలివ్వాలే! ఎలా నయమయింద'ని అడిగిరి.

ఈ మాట అనిన వారము దినములకే మరల వచ్చినదా వ్యాధి. అంత వారు డాక్టరు క్షీరసాగరం (మంగళగిరి) గారి వద్దకు వెళ్ళిరి. వీరిని చూడగనే, పరిచయస్తు లగుటచే, 'అరవై రూపాయిలివ్వండి. శరీరం వజ్రకాయంలా చేస్తాను.' అని చనువుకొద్దీ వీపుపై తట్టి చెప్పిరి. అటులనే అరువది రూప్యము లిచ్చుట, వ్యాధి కొద్ది దినములలోనే నివారణ యగుట జరిగినది.

## పరమహంస

సుమారు 1921 వ సంవత్సరమున అమ్మకు రెండు పిప్పి పండ్లు లేచినవి. వాటిని వూడపీకించుటకు డాక్టరు క్షీరసాగరం (మంగళగిరి) గారి వద్దకు వెళ్ళిరి. చికిత్స ప్రారంభించిరి. పండ్లు కొంచెము బలవంతముగా పీకవలసి వచ్చుటచే ఎక్కువగా రక్తము స్రవించ నారంభించినది. ప్రక్కనున్నవారీ రక్తము చూచి గజ గజ వణకి పోయిరి. కాని అమ్మ మాత్రము ఏమియు చలించక అటులనే నోరు తెరచి వుంచిరి. ఇంత నెత్తురు కారినను, యింత బాధ కలిగినను ఎట్టి ముఖ వికారము బొందక యున్నందులకు డాక్టరుగారెంతయో ఆశ్చర్యము నొంది, 'అమ్మా! పరమ హంస వయ్యావా? <u>పరమహంస</u> అనేమాట పుస్తకాలలో చదివాను కాని యీవేళ ప్రత్యక్షంగా చూచాను. అమ్మా! యీ గోంగూర రాజ్యంలో ఎలా వుండ గలుగుతావమ్మా? అనుచూ ముమ్మారు అమ్మచుట్టును ప్రదక్షిణము చేసి నమస్కరించిరి.

## అన్నము తినజాలక పోవుట

1923 మార్చినుంచి సుమారు 7 1/2 సం॥ల కాలము అన్నము తిన వలనుపడక, అన్నము, అన్నము అను పేరు వచ్చు పరమాన్నము మినహా తక్కిన పిండివంటలు, పండ్లు మొదలగు ఫలహారములు తినగలిగెడివారు.

ఒకనాడెవరో జున్ను తీసుకొని వచ్చి అమ్మకు పెట్టిరి. దానిని తినుచుండగా ఆ జున్నంతయు లోపలికి పోవునపుడు దానిలో కొంత పదార్థము లోపలికి పోకయుండెను. దానిని బయటికి తీసి పరిశీలించ అది అన్నపు మెతుకై యుండెను. అమ్మ అన్నము తినజాలని కారణమున, యిట్లన్నపు మెతుకైన, వారికి తెలియకున్నను, లోపలికి పోకుండ, వారి జీవితమును నడుపుచున్న శక్తి కాపాడుచుండెనని గ్రహింప నైనది. ఈ ఫలహారములు తీసుకొను రోజులలో కూడ కొద్దికాలము ఒక నిమ్మ (పంచదార) తొన, సగము సోడానీరు మాత్రమే ఆహారముగా సరిపోయినదట.

## శరీరమునకు అభిమానము వచ్చుట

1924 సం॥ ఆగస్టు నెలలో నొకదినమున అమ్మకు తానెరిగిన బట్టల వర్తకుడు బొబ్బర్లంకలో తానున్న పాక సమీపమున కాన్పించెను. దిసమొలతో నున్న స్త్రీని పురుషుడు చూచిన ఆమెకెంత అభిమానము కలుగునో, అమ్మకు అంత అభిమానము కలిగి యింటి లోపలికి వెళ్ళిపోయిరి. ఆ క్షణము నుండి స్త్రీ పురుషులెవరును తమను చూడకుండ చీకటింటనే యుండిరి. రాత్రులందా నిర్బంధము లేదు.

ఆ కాలమున తామున్న చీకటింట సూర్యకిరణము లెంత మాత్రము చొరరాకుండ, కప్పులో నేమేని రంధ్రములున్న, వానిని గుడ్డముక్కలతో కప్పించెడివారు. చీకటిలో నున్న సమయమున అన్నమే కావలయునో, నీరే కావలయునో, మరేమి కావలయునో తెలిసికొను తెరవు లేదయ్యెను. నోట చెప్పుదమన్న ఆరువత్సరముల క్రిందటి నుండి ఆమెను మౌనమావేశించి యున్నది. నోటితో ధ్వనిని వెలువరించుటకు శక్యము కాదయ్యె. వ్రాసి చూపుదుమన్న చదువురాదు. ఈ దశను నివారించుటకై నల్లూరుపాలెం మునసబుగారగు శ్రీ సుఖవాసి నారయ్యగారు, 'అమ్మ దీపపుకాంతిని కూడ భరింపలేని సమయమున' ఒక దీపము వెలిగించిరి. మంత్రసాని యెదుట స్త్రీ మానము దాచు కోలేనటుల, ఆ దీపపు వెలుగులో విధిలేక అమ్మ యితరులకు కన్పడక తప్పినది కాదు.

ఇట్లుండు కాలముననే అమ్మకు తాము కట్టుకొను బట్ట విషయమై సందేహము కలుగ నారంభించినది. ఒంటిమీద బట్టకూడ (ఋణముతీరి) పోవునేమోయని ఆమెకు భయము వేసినది. "ఏ విధముగా నైనను బట్ట మాత్రము పోకుండ కాపాడ వలెననుకొనిరి. ఒక వేళ పోయెడి పక్షములో బెజవాడ వద్ద రైల్వే బ్రిడ్జిపై నెక్కి, వరద నిండుగా వచ్చినపుడు కృష్ణానది మధ్యభాగములో బడి ప్రాణమునైన వదలెద గాని, యీ శరీరమును మాత్రము బయట పడనివ్వను. చనిపోయినప్పటికి శరీరము నితరులు చూడకూడద"ని గట్టి పట్టుదల పట్టియుండిరి.

ఇట్లు కొన్ని దినములు జరిగిన తరువాత ఆమెయున్న యింటిలో కిరసనాయిలు దీపము పొగవేయు కారణము చేత దానిని మాని ఆముదపు దీపము వెలిగించెడివారు. ఆ ఆముదపు ప్రమిద యందెన్నడును ఒక్క పురుగైనను చచ్చి పడియుండలేదు. అమ్మను

చూచుటకు వచ్చెడివారు ఆ దీపపు వెలుగున, పెదవులతో గాని, చేతులతో గాని అమ్మ చేసెడి సైగలను బట్టి విషయములను గ్రహించు చుండెడివారు. ఒక వింత విషయము. అమ్మ చేయు సైగలు, చూడవచ్చిన వారికి కష్టము లేక అర్థమగు చుండెడివి. ఏమన, అమ్మను మౌనముచే బంధించి, చీకటిలో నిలిపిన శక్తియే, ఆ సైగల యర్థమును తేలికగ తెలియజేసెడి దని చెప్పనగును. ఈ విధముగ దీర్ఘకాలపు సంభాషణలు సైతము సాగుచు వచ్చినవి. అమ్మలో నిట్లు శరీరమున కభిమానము నెలకొనెనని చెప్పవలయును.

ఈ దశయందు అమ్మ ఎచటికయినా వెళ్ళవలసి వచ్చిన రాత్రులందే వెళ్ళెడివారు. ఇట్లు 3 సంవత్సరముల 3 మాసములు గడచినవి. ఈ కాలములో వీరెక్కువగా నల్లూరు పాలెం, వివేకానందపురం (బొందలగరువు సమీప గ్రామము). బొబ్బర్లంక, గొరిగపూడి గ్రామములందుండెడివారు.

వివేకానందపురమున నుండు కాలమున అమ్మయున్న గృహము నందొకనాడు జరిగిన ఘటన. ఒక ఎలుక పిల్లి దగ్గరకు పరుగెత్తుకొని వెళ్ళెడిది. ఆ పిల్లి దానిని నోట కరచుకొని, దాని కన్నము వద్ద విడిచి పెట్టెడిది. ఈ విధముగా అమ్మ యెదుటనే కొన్ని నిముసముల వరకు ఆటలాడుకొని, తదుపరి దేనిదారి నది వెళ్ళిపోయినవి. అవి యాట లాడుకొను సందర్భమున ఏమేని హింస జరుగునేమో యని అమ్మ భయపడెడి వారు.

## అభిమానము పోవుట (దిగంబరి యగుట)

1927 సం॥ నవంబరు నెలలో బొబ్బర్లంకలో నున్న సమయమున అమ్మకు నీరసము వచ్చినది. ఈ నీరసము రాక పూర్వము కొలది దినముల క్రిందటి నుండి అమ్మ, 'మీ కందరకు బట్టలు లేనటుల కనుపించు చున్నద'ని యను చుండెడి వారు. "అయితే మాకు బట్టలఖర్చు తప్పునులే." యని పాములపాటి బుచ్చి రాయుడుగారన దగ్గర నున్నవారు నవ్వుచుండెడివారు.

పై నీరసము 13 దినములు కొనసాగినది. 13వ దినమున పూర్తిగా నీరసించి స్పృహ తప్పి పడియుండిరి. అమ్మ యున్న చీకటి గదిలోని అడ్డమును తీసివేసి, తలుపు కిటికీలను తెరచి, నిండారు ముసుగుతో పడియున్న అమ్మ చుట్టును చేరి యున్న వారు, యిక అమ్మ జీవించునను యాశలేనివారై విచారపడసాగిరి. కాని ఆ సమయమున అమ్మభావము ఒక స్థితి నను భవించు చుండెను. అప్పుడు ముగ్గురు స్త్రీలు (భక్తి, జ్ఞాన, వైరాగ్య శక్తులు) అమ్మను ముక్కోణముగ నమర్చిన స్తంభము నొద్దకు తీసుకొని పోయిరి. ఆ స్తంభమునకు చివరి వరకు మెట్లున్నవి. ఆ మెట్లవెంట అమ్మ నెక్కించుచు వీరును వెను వెంటనెక్కి వెళ్ళిరి. అమ్మ ఆ స్తంభపు పై భాగమునకు వెళ్ళగనే, వారిలో నొకరు చక్కిలిగింత పెట్టిరి. అమ్మ వులిక్కిపడి ఒక నిట్టూర్పు విడిచిరి.

ఈ కదలికతో దగ్గర నున్న వారందరు అమ్మ బ్రతికి యున్నదని సంతసించిరి. అపుడు అమ్మలోని శక్తి బట్టముడి విప్పి చూడుమని పలికినది. వెంటనే వారు ముడి విప్పిరి.

వారిని ముడి విప్పుమనిన శక్తియే అమ్మయై, బట్టను ఒక తన్ను తన్ని, దిగంబరియై బయటికి వచ్చెను. మరల అమ్మ నిస్సత్తువతో నడువలేక పోయిరి. అంతట వారిని యింటి లోనికి తీసుకొని వచ్చి పరుండ బెట్టిరి. దగ్గర నున్న వారు "అమ్మా! బట్ట కట్టుకోరా?" యని బట్ట యియ్యబోగా, అమ్మలోని బట్టలేని శక్తి "యిదివర కెప్పుడయినా బట్ట కట్టుకున్నామా, యిపుడు కట్టుకోవడానికి?" అనెను. విచిత్రమేమన, అప్పటికి నలుబది వత్సరముల నుండి కట్టుకొన్న బట్ట అరవడి కూడ ఆమె శరీరముపై ఆ క్షణములో మాయమైనది. తదాది వీరు దిగంబరి. కాని శీతోష్ణస్థితుల నుండి కాపాడుకొను నిమిత్తమొక బట్టను మాత్రము కప్పు కొను చుండెడివారు. అప్పటినుండియు వీరు ఒంటి బట్టతోనే కాలము గడుపుచుండిరి.

## నీరసములు

సాధారణముగ అమ్మకు ఒక్కొక వృత్తి రహితమగునపుడెల్ల నీరసము కలుగు చుండును. నీరసమనగా, ఒక నగను ముక్కలు ముక్కలుగా నరికి, కరగబెట్టి దాని రూపును మాపి వేయు తీరున, ఒక్కొక్క గుణమును మాపివేయు అవస్థ. ఈ సందర్భమున తీవ్రమైన వేదనతో శరీరమంతయు నలిగిపోయి, బ్రతుకునో లేదో యనునంత భయము కలుగును. కాళ్ళు, చేతులు వంకరలు తిరిగిపోవుట, వాటిని సరియైన స్థితిలో నుంచుటకు దగ్గరనున్న వారి స్వాధీనము కూడ కాకపోవుట జరుగును. కొంత వడికవి యథాస్థితికి వచ్చును. తుదకు ఒకవృత్తి రహిత మగును.

ఈ నీరసములలో మాయకును, జ్ఞానమునకును తీవ్ర సంభాషణ (సంఘర్షణ) జరుగును. ఒకేవ్యక్తి ద్వివిధ పాత్రల కనుగుణ్యమగు కంఠస్వరములో నాటకమును చదువునపుడెటు లుండునో, అటులనే యీ సంభాషణ కూడ.

ఈ సంఘర్షణ యందు మాయ, తాను నశించు నను భయముతో యేడ్చుటయు, జ్ఞానము నవ్వుటయు జరుగును. అంత మాత్రముననే ఆ గుణము విడిచిపోదు. కాని వారిలోని వైరాగ్యము బయల్వెడలిన వెంటనే ఆ గుణము భయపడి, చేయునదేమియు లేక అమ్మను విడిచి పోవును. అప్పుడాగుణ సంబంధమైన వృత్తియు రహితమగును.

ఒకవృత్తి రహితమైన తదుపరి అమ్మ ఎంతయో తేలికగా నుండెడివారు. పాము, కుబుసము విడిచిన తదుపరి చురుకుగా, తేలికగా, వుత్సాహముగా నుండునటుల, మాకుండెడిదని అమ్మ చెప్పెడివారు.

భర్త భావము రహిత మైనపుడు గొరిగపూడి నుండి బొబ్బర్లంకకు (10 మైళ్ళ దూరము) ఉదయము కొలది కాలములోనే వెళ్ళి, మరల సాయంకాలము అదే కాలములో తిరిగి వచ్చెడివారు. రైలులో ప్రయాణము చేయునపుడు ప్రక్కనున్న చెట్లెట్లు వెనుకకు పరుగిడునట్లుండునో, అటులనే వీరు నడచి వెళ్ళునపుడు త్రోవ ప్రక్కన చెట్లు అట్లు కనుపించెడివట.

ఇటులొక వృత్తి రహితమైనపుడెల్ల అమ్మ ఎంతో ఉత్సాహముగా, చురుకుగా నుండెడివారు.

## తలబోడి

అమ్మ మామూలుగా కొప్పు పెట్టుకొని యుండెడివారు. ఒకనాడు, 'అదేమిటే?' అని కొప్పును చూపించినది లోపలి శక్తి. అంతట కొప్పు వుంచుకొనుట ఎంతో తప్పుగా తోచి, కొప్పు తీసి ముడిగా నుంచుకొనిరి. తదుపరి, 'ఊ! భోగందానిలాగ బాగానే వుందిలే ముడి' అని ఆ శక్తి మరల అనుసరికి ఆ ముడి కూడ వుంచుకొనుటకు వీలులేక వెంట్రుకలు విరియ బోసుకొనవలసి వచ్చినది. అమ్మ వెంట్రుకలు చాల నిడివిగా నిగ నిగలాడుచు నుండెడివి. "అంతా చూచారులే! బాగానే ఉన్నాయి అందంగా, బారుగా," అని మరల హెచ్చరిక రాగా అటుల కూడా జుట్టు వుంచుకొనుటకు వీలులేక పోయినది. అంత అమ్మలోని మాయ, "అయ్యో! బోడినయ్యేదా! బోడినయ్యేదా!" యనుచు యేడ్వ నారంభించింది. కొంతవడి యేడ్చి యేడ్చి, "యింక చేసేదేముంది? జుట్టు కత్తిరించండి," అని అమ్మ అనిరి. తప్పనిసరియయి వెంట్రుకలను కత్తిరించిరి. తదాది అంత్యదశ వరకు బోడితలతోనే యుండుట జరిగినది.

విధి పూర్వకమగు జ్ఞానుల యిట్టి నడకను చూచి తలబోడి చేయించు కొన్ననే మోక్షప్రాప్తని భ్రమసి కొందరు ఏ తత్కార్య క్రమమునకు పూనుకొని వ్యవహరించుచున్నారు. "తలలు బోడులయిన తలపులు బోడులా" యని అనినాడు వేమన.

## మల విసర్జనము

అమ్మ గొరిగపూడి చెరువు గట్టుపై నుండగా జరిగినది.

సీ. మాతయు ఒకనాడు మామూలు మాదిరి
బాహ్య భూమికి తాను బయలుదేరి

మలమును విడిచియు మగిడి వచ్చుచునుండ
శబ్దంబు యేదియో చెవులబడియె

"ఎవరికోస మటుల ఏ కారణంబుచే
మలము విడిచితీవు మరుగులేక

గతమునందున అట్టికర్మ చేసియె కదా
పందియై పుట్టియు పాట్లు పడుట

అందుల కాజన్మ అది పొందినప్పుడు
కర్మకే నీవును కావె పంది?"

తే. అనెడి వింతైన మాటలు నాలకించ
ఝల్లుమనియెను గుండెలు చల్లబడియె
అన్నమును పెట్టవలసిన ఆకుయందు

మలము పెట్టుచునున్నట్లు మదికి తోచ
పూడ్చిపెట్టుట మొదలిడె పూర్ణమతిని.

తే. అన్ని జీవులకు సమాన మాకలిలను
కాని చేతయే గీత యనునది సత్య
మనుచు, తెలిసికొనియు కూడ మనదుమలము
విడచుచుండుట పందికి చెడగుగాదె.

కం. ఎవరైనను యనవచ్చును
"అవిచేసిన కర్మవల్ల అట్టుల పుట్టెన్"
అవునామరి కనుమిక, మన
జీవితమును అటులకాదె, చెపుమానీవే,

తే. వెండి బంగారమైనను విడువవచ్చు
దాచియుంచంగ లేనప్పు యెచ్చటయిన
అందువలనను పాపంబు రాదుమనకు
కాని మలమును మాత్రము కానకుండ
పూడ్చిపెట్టంగ వలయును భూమియందు.

## శాంతి ఆశ్రమములో

1928 సం॥ మేనెల. శాంతి ఆశ్రమములో యున్న తత్వానందస్వామిని జూచు సంకల్పము గలిగి అమ్మ అచటకు వెళ్ళిరి. స్నానాదులు జరిగిన తదుపరి అమ్మ ఒక చెట్టునీడను పరుండి యుండిరి. అపుడు శ్రీ ఓంకారస్వాములవారు అమ్మతో సంభాషించ నచటికి వచ్చిరి. సంభాషణలో పాల్గొనుచు, చేతితో ఆ యాకును ఈ యాకును యిటునటు పడవేయుచుండిరి. "అటుల చేయుట మంచిది కాదు. అవయవముల మీదికి మనసును విచ్చలవిడిగా పోనీయతగదని' అమ్మ అనిరి.

'అంత మాత్రముతో సేగిలేదు. మనస్సు చెదిరిపోదు.' అని స్వాములవారనిరి. 'ఉన్నమనసు ఒక్కటే. ఒకే కాలమందు అది రెండు మూడు పనులు చేయజాలదు. అది నీహద్దులోనుండి ఎప్పుడైనను ఒకేపనిలో నిలుపవలెను గాని, యిచ్ఛవచ్చినట్లు రెండు మూడు పనుల మీదికి పోరాదు. అటుల పోనీకుము. ఆ ఆకులను క్రింద పడవేయుమ'ని అమ్మ చెప్పిరి. స్వాములవారటులనే చేసిరి. తదుపరి మరికొంత సంభాషణ జరిగినది.

నాలుగైదు దినములయిన పిమ్మట నల్లూరుపాలెం, పోటుమెరక ప్రాంతముల వారు, తమ యెడబాటున కై విచార పడుచున్నట్లు మనసుకు తోచ, మరలిపోవలెనని అమ్మ చెప్పిరి. అప్పటికే అమ్మయెడ భక్త్యానురాగములు మెండగుట వలన ఓంకార స్వాముల వారికా యెడబాటు దుస్సహమై, అచటినుండి వెడలు సంకల్పము చేయవలదని అమ్మను బ్రతిమాలిరి. వారి కోరికపై అమ్మ ఆరుదినములు మాత్రముండి పోయిరి. ఏడవ దినమున ప్రయాణము

స్థిరమయినది. శ్రీ స్వాములవారు తమ కుటీరపు నేలకొట్టులో నుండి వెలుపలికి రాశైరి. ఎందరు పిలిచినను తలుపు తీయరు. వారికి తమపయనమును తెలిపి వెడల వలెనని అమ్మ సంకల్పము. తుదిని అమ్మయే స్వయముగ వెళ్ళి తలుపు తట్టగా స్వామి కుటీరపు తలుపు తెరచి నేలకొట్టు లోనికి తిరిగిపోయి విచారముతో కూర్చుండిరి. అమ్మపోయి చూచునప్పటికి శ్రీ స్వాములవారి కండ్లుబ్బి యున్నవి. వారి విచారము అమ్మ హృదయమును కలంచివేసినది. కాని పయన మాప వీలులేక పోయెను. చాలసేపు బ్రతిమాలి మార్గాంతరము లేక అమ్మ వచ్చి వేసిరి.

అమ్మ శ్రీ శాంతి ఆశ్రమమునందున్నప్పుడు జరిగిన ఒకటి రెండు ముఖ్య సంఘటనలు. ఒకనాడు ఉదయముననే అమ్మ తత్వా నందస్వామియున్న కుటీరము కడకు వెళ్ళి, 'బాబూ! నేడు దినచర్యను పాపకార్యముతో ప్రారంభించితివా?' అని యడిగిరి. అప్పుడే నవనవలాడు నేరేడుమండతో పండ్లుతోముకొనుచున్న స్వామి, యీ మాట అర్థము కాక, భీతిలి, ఏమి పాపమ'నిరి. 'నిన్ను గిల్లిన నీకు నొప్పి కదా! ఆ పుల్లను విరిచినప్పుడు చెట్టు నకు నొప్పిలేదా?' అని అమ్మ అనిరి. అంతట స్వామి, ఔనమ్మా! చెట్లకును రసనాళములు, నరజాలము యున్నదని చదివి యుంటిని. చెట్లకును సుఖఃదుఃఖములు న్నవట' అని చెప్పిరి. ఆమాట చదివి లాభమేమి? పుట్టెడు చదువుకన్న చిట్టెడు ఆచరణ మేలని" చెప్పిరి అమ్మ.

సవికల్ప నిర్వికల్ప సమాధులందు గలుగు అనుభూతు లను గురించి వ్రాయబడిన ఆంగ్ల గ్రంథము నొకదానిని ఓంకార స్వాముల వారనువదించిరి. 'నేనొక గ్రంథమును వ్రాసినాను. చదువుదును. వినుమ'ని అమ్మకడ చదువ నారంభించిరి. కొన్ని మాటలు చదువగనే, 'ఆ మాటలు నీవైనవా? అది నీ అనుభవమేనా? అని అమ్మ అడిగిరి. 'లేదు' అనిరి స్వామి. "ఆ పుస్తకమును బీరువాలో పెట్టి తాళము వేసియుంచు. నీవా మాటల రూపమైన పిదప బైటపెట్టు." అని చెప్పిరి అమ్మ.

## గాంధీజితో

గాంధీ ఆంధ్రదేశ సంచారము చేయుచు 1929 ఏప్రిల్ 19న రేపల్లె వచ్చిరి. కొందరు మిత్రులు అమ్మను గాంధికడకు తీసుకొని వచ్చిరి. అమ్మ వారికెదుట కూర్చుండిరి. అమ్మను మౌన మావహించియున్న కాలమది. సైగలతో ప్రసంగము నారంభించిరి. ఆ సైగ గ్రహింప గలవారు, ఇంగ్లీషుభాష తెలిసినవారు, ఉభయుల భాషణములను అనువదించు చుండిరి. 'సత్యము, శాంతము, అహింస, అపరిగ్రహము మొదలగు గుణములు మీ యందున్నవని చెప్పుకొందురు. ఆ మాటవిని చూడవచ్చినామ'ని అమ్మ అనిరి.

'లేవు, లేవు. అలాంటి గుణాలేవీ లేవు. ఈ తీరుగా రాట్నం వడకుచు, ఏ తొందరలు లేకుండ కూర్చుండినపుడు అటులనే తోచును. మీకు నిజము

తెలియవలయునంటే, మా ఆశ్రమమునకు వచ్చి చూచిన తెలియును. ఆశ్రమములో నాకు శాంతి యుండదు. ఇప్పుడును మిమ్ము చూస్తుంటే ముచ్చటేస్తున్నది. వలదనుకొలదిని ఆ కిటికీలనుండి తొంగిచూచుచు తొక్కిసలాడు ప్రజలను చూస్తుంటే రాళ్ళుపెట్టి కొట్ట బుద్ధి పుట్టుచున్నది." అనుచు రాట్నము వడుకుచునే యుండిరి గాంధీజీ.

"సరే, వడుకు వడుకు" అని అమ్మ అనిరి.

"ఓ! నేను దీనిని ఆపరేషను చేసినప్పుడు కూడ విడిచి పెట్టలేదు. వడుకుతూనే యుంటిని." అని గాంధీజీ పలికిరి.

"నువ్వు విడిచిపెట్టటం కాదు నాయనా! అదే నిన్ను విడిచిపెట్టాలి." అని అమ్మ చెప్పిరి.

"బస్, బస్." యనుచు గాంధీజీ చాల సంతసించి, 'అవును, అది నన్ను విడిచిపెట్టువరకు వడకెద'ననిరి.

తన భావము నర్థము చేసికొని నందులకు అమ్మకూడ ఎంతయో నానందించుచు, 'నాయనా! అర్థమయిందా?' అనుచు ప్రేమతో వారిగడ్డమును తాకబోయిరి.

గాంధీజీ వడకుట మాని అమ్మ హస్తములను తన చేతులతో పట్టుకొని, సంతోషముతో, 'మీరు తాకుటకును నేను అర్హుడనా?' అనెను. మరియు, 'మరొకసారి కనుపింతురా?' అనుచు వీడ్కొలిపినారు.

'సరేన'ని అమ్మ అటనుండి బయలుదేరి, కార్యక్రమము ప్రకారము ఆ సాయంకాలమే, గాంధీజీ నల్లూరుపాలెం వచ్చునప్పటికి ముందే అచటికి చేరిరి. గాంధీజీ నల్లూరుపాలెం వెళ్ళి, తమకన్న ముందుగనే అమ్మవచ్చి కనబడుట చూచి ఎంతయో సంతసించిరి. హరిజన నిధికి కానుక వసూలు చేయవచ్చిన మహాత్ముడు, కానుకను గ్రహించి ప్రజలనుద్దేశించి, 'ఇక్కడ యిద్దరు మహావ్యక్తులు (చిన్నమ్మ, పెద్దమ్మ) కలరు. వారు చెప్పినటుల ప్రవర్తించుడు, ఖద్దరు ధరించుడు. కల్లు మానుడు. బస్' అని సైగ చేయగా, వారి కారు బఱ్ఱున వెడలి పోయినది.

ఆ పిమ్మట నొకరితో గాంధీ, అమ్మ తనను తాకినప్పటి నుండి తనలో నొక పరివర్తనము ఘటిల్లెనని చెప్పినటుల విందుము.

తన ఆశ్రమమునకు వెళ్ళిన తదుపరి అప్పటి తన యంగ్ యిండియా పత్రికలో అమ్మను గురించి నుల్లేఖించుచు యిటుల వ్రాసిరట - 'నాకామె (చిన్నమ్మ) జ్ఞాపకము వస్తున్నపుడెల్లా ఎంతో ఆనందం కలుగుతూ వుంది.'

గాంధీజీతో మాట్లాడిన కొద్దికాలమునకే, 'గాంధీలో మంచిగుణాలుంటే గాంధీకే వుంటాయి. మాలపల్లిలోని కటిక వాడికి దుర్గుణాలుంటే, అవి వాడికే వుంటాయి. నీ కెందుకే పక్షపాతీ?' అని లోనుంచి హెచ్చరిక వచ్చుసరికి 1933లో మరల గాంధి ఆంధ్రదేశమునకు వచ్చినపుడు చూడవలెనని యున్నను అమ్మ వెళ్ళలేకపోయిరి. గాంధినే

కాదు. అప్పటిలో తన్నెక్కుడుగా ననుసరించుచున్న యలవర్తి వెంకయ్యగారికి జబ్బుచేయ, వారిని చూడవలెననెడి యభిలాష యున్నను, అచటికి కూడ వెళ్ళలేకపోయిరి.

1948 ఫిబ్రవరి 12వ తేది. దేశమంతయు గాంధీజీకి శ్రద్ధాంజలు లర్పించుచున్నది. అమ్మ యనుచరులు కూడ గాంధీ పేర కర్మకాండ జరిపి, అమ్మ కాహార మిడిరి. వారు ఆహారము తీసుకొనుచుండ గాంధిరూపు, వారికి తగిలిన గుండ్లగాయములు కనుపించి కంట తడిపెట్టిరి. తదుపరి అమ్మ యనుచరులు భోజనములకు కూర్చుని మామూలు ప్రకారము వంట పదార్థములను ప్రసాదముగా చూడమనిరి అమ్మను. అటుల వాటిని ప్రసాదముగ చూచునపుడు అమ్మ గాంధి రూపువలె కనుపించిరి.

'మీకందరకు ఉప్పు తెచ్చి పెట్టాడు. అందుకయినా వాడు చెప్పినట్లు ఖద్దరు కట్టుకోండ'ని తన యనుచరులకు చెప్పుచు వారు చివరవరకు ఖద్దరునే వాడిరి. వీలయినపుడు దాసులకు దాసియై రాట్నము వడకిరి.

## అహింస

గొరిగపూడి గ్రామమందలి చెరువు గట్టు పై అమ్మ బస చేసియుండగా, సూర్యునిలో నుండి ఒక వుత్తరము వచ్చినదట. దానిని ఒక కాకి యిటుల చదివినదట-

'మనుజుల పాపము బాపను
భూమిమీద పుట్టిన పువ్వారపు తులసీ!'
ఇది అమ్మకు కాన్పించి చెప్పిన విషయము.

ఆ మరునాడుదయము కొంతమంది హరిజనులా చెరువులో చేపలు పట్టుటకై వచ్చిరి. ఆ క్రితము రోజు వరకు ఎవరెక్కడ చేపలు పట్టినా వూరకున్న వ్యక్తి యీనాడు వారు రాగానే వెళ్ళి, అమాంతముగా మీదపడి, చేపలు పట్టకుండా యడ్డగించిరి. ఆనాటినుంచి అచట చేపలు పట్టుట ఆగిపోయినది. అమ్మ అచట వున్నంతవరకు, ఈ విధముగా వారు తిరిగిన చోట్లల్లా ఎచట హింస జరుగుతున్నా వారికి నచ్చజెప్పి, బ్రతిమ లాడి, వారి నా హింసా కాండనుంచి తప్పించిరి.

అమ్మ అచట వున్న కాలములో ఆ చెరువులోని చేపలు అమ్మనుచూచి ఎంతయో నానందముతో అన్నియు నీటిపైకి వచ్చెడివి. అమ్మ నీటిలో చేయిపెట్టిన ఆ చేతిని చుట్టుకొనెడివి. ఈ సంగతి తెలిసి కొందరు, 'అమ్మా! మీరు రాగానే చేపలన్నీ నీటిపైకి వచ్చునట. మాకు చూపిస్తారా?' అని యడిగిరి, 'ఆ, చూపిస్తాను.' అని పలికి చెరువు వద్దకు వెళ్ళిరి. కాని ఒకటికూడ బయటకు రాలేదు. తమ మాట అసత్యమయినందుకు అమ్మ ఎంతగనో యేడ్చిరి. "ఇక ఎప్పుడూ యిలాంటి మాటలు అనవు గదా!" అని లోపలిశక్తి హెచ్చరించినది. తదుపరి చేపలన్నియు బయటకు వచ్చి కనుపించినవి.

ఇట్లుండు కాలమున ఆ దారిని పోవు ఒక పల్లెమనిషికి ఒక నాడు ఆ చేపలు యేడ్చుట

కనుపించి, "ఎందుకమ్మా! చేపలలా ఏడుస్తున్నాయి?" అని అమ్మనడిగెను. "ఏమో!" అని అమ్మ జవాబిచ్చిరి. మరునాడు కొందరు ఆ చెరువుకట్టపై నున్న తాడి చెట్ల ఆకులు కొట్టుచుండగా, అందొక పాము కానుపించ, దానిని నిప్పుమంట వేసి చంపిరి. ఇక యిట్టి (హింస జరిగే) చోట నుండరాదని అమ్మ అచటినుండి వెళ్ళిపోయిరి.

అమ్మ అచటవున్న కాలములో అమ్మనుచూచి పైకి వచ్చెడి చేపలను చూచి 'నీటి పైననే యిన్ని చేపలు కానుపించు చున్నవి, లోపల ఎన్ని వున్నవో గదా' యని ఆ సమీపమువారు ఆ సంవత్సరము ఎక్కువగా పాటపాడి చివరకు మోసపోయిరి.

కృష్ణాజిల్లా విశ్వనాథపల్లి గ్రామమున అచటగల నాంచారమ్మ దేవతపేర ప్రతివత్సరము జాతర జరుగుచుండును. అచట కొన్ని వేల ప్రాణులు బలిగాబడుచుండెడివి. 1930 లో లోపలివాణి (శక్తి) ప్రేరణపై అచటి హింసాకాండను వారింప అమ్మయు, మరికొందరును విశ్వనాథపల్లికి బయలు దేరిరి. మార్గమధ్యమున అనేకులు మేకలను, గొఱ్ఱెలను, కోళ్ళను, యితర జీవులను తీసుకొని పోవుచుండుట వారికి గోచరించినది. నిరపరాధులగు ఆ దీనజంతువుల యరపులు చెవినిబడి అమ్మ హృదయము కారుణ్య పూరితమై కల్లోల పడసాగినది. గుడి యింక కొంతదూర మున్నదనగనే అచట నొక సత్రమునందు దుఃఖముతో నుండిపోయిరి. ఇది తెలిసినవారును, అమ్మననుసరించి వెళ్ళినవారును అమ్మను గురించియు, అహింసాధర్మమును గురించియు చెప్పి, హింస జరుగకుండ అందరిని పంపివేసిరి.

బొబ్బర్లంక కృష్ణానది ప్రక్క గ్రామము (రేపల్లె తాలూకా). వేసవి కాలము. అపుడు అమ్మ అచటనే యుండిరి. అచటి చెరువు ఎండిపోవు సమయమున అందులోని చేపలను కాగులు, కళాయిలోని కెత్తించి కృష్ణా నదిలో పడవేయించిరి. ఆ సందర్భములో చచ్చి పడి యున్న చేపలను గ్రద్దలు, కొంగలు వగైరా ఏవియు కూడ ముట్టలేదు. మానవులే గాక, మాంసాహారమును తిను యితర జీవులు (పక్షులు) ను అహింసాధర్మము నవలంబించుట చూచి ఆశ్చర్య చకితులైరి.

ఏజీవికి హింస జరుగబోవు చున్నను అమ్మప్రాణము గిలగిలా కొట్టుకొనెడిది. సుమారు మైలుదూరములో చేపలు పట్టుచున్నను, అమ్మభావమునకు కన్పించి, వెంటనే అచటికి పరుగెత్తుకొని వెళ్ళి, వారి నా కార్యమునుండి వారించి, ఆ జీవుల ప్రాణములను కాపాడిరి.

చేపలు పట్టువారి నడ్డగించుటయే గాక చివర చివరకు అమాంతముగా వెళ్ళి వారిమావులను తుత్తునియలు చేయుట, వలలను చించుట జరుగుచూ వచ్చినది. ఒకనాడిటులనే ఒక వలను చించి వేయుచుండగా, 'చీల్చవే దీని వీపు, చంపేదానిని (హింసా భావమును) చంపవలె గాని, వలలు చీల్చటం దేనికి?' అని లోని శక్తి ప్రశ్నించు సరికి, అటుల చేయుట మానివేసి, హింసాహారము వల్ల వచ్చెడి నష్టమును గురించి చెప్పెడివారు.

'చూడు నాయనా! మన కాలిలో ఏదైనా గుచ్చుకుంటే ఎంతో లబలబలాడ్తాం. అదికూడ మనలాంటిజీవే. రక్త మాంసాదులున్నాయి. కర్మను బట్టి ఆ శరీరము కట్టుకొచ్చిందది.

ఇపుడు మనం దానిని చంపితే మళ్ళీ ఆ కర్మ అనుభవించటానికి ఆ జన్మ ఎత్తవలసి వస్తుంది. మనం పట్టుకోబోతుంటే చూడు, అది ఎలా గిలగిల కొట్టు కుంటుందో!'

వినయాశ్రమములో నుండగా జరిగిన ఘటన.

తే. పుండు యొక్కటి లేచియు పోటుపెట్ట
మఱ్ఱిపాలను పట్టించ మంచిదనగ
ఆకులను త్రుంచజాలని అమ్మయపుడు
ప్రక్కనున్నట్టి వారితో పలికె నిటుల

తే. మఱ్ఱిపాలు కావలయును మాన్పపుండు
గాటు వేతురే మీరలు కత్తితోడ?"
అంతవారలు ఒకచెట్టు చెంతజేరి
గాట్లు మూడటువేయంగ గట్టిగాను
పలికె నావృక్షమిటు జాలి కలుగునట్లు.

ఆ.'ఒక్క పుండుబాధ నోర్చుకోలేకను
ఇన్నిగాట్లు నాకు నేలపెట్ట?'
అనుచు వృక్షమట్లు అనుటయే తడవుగా
'వలదు పాలటంచు' పలికెనమ్మ.

అమ్మ బొబ్బర్లంక గ్రామములో నున్నప్పుడొక కుక్క అమ్మ సాంగత్యమున నుండెడిది. అది యొకనాడు మాంసము తినబోవ అమ్మచూచి, 'బూసీ! అలా మాంసం తినవచ్చా? తప్పు కాదా?' అని యనుసరికి తన తప్పిదమును గుర్తించి, మాంసము తినుట మానివేసి వచ్చినది. కొంత కాలమయిన తదుపరి అమ్మ మరియొక యూరువెళ్ళి కొన్నిదినములుండి వచ్చుసరికి, యీ కుక్క తోడికుక్కలతో కలసి మాంసము తినుట అమ్మ చూచి, 'బూసీ! చెడిపోతివా?' అనిరి. అంతటది అమ్మ వద్దకు రాలేక, దూరముగా తిరుగుచు, సరిగా తిండితినక, శుష్కించ మొదలిడినది. ఈ పరిస్థితి నెరిగినవారు, 'అమ్మా! చూడండమ్మా, ఎలా చిక్కిపోతోందో! మీరన్నా పిలవండమ్మా! దగ్గరకు వచ్చి కాస్త అన్నము తింటుందేమో! అని యనిరి. అపుడు అమ్మ, 'ఊ! చాల్లే, రా. వచ్చి అన్నం తిను. ఇంకెప్పుడూ అలాంటి పనులు చేయకని' యనిరి. అప్పటినుండి దగ్గరకు వచ్చి అన్నము తినుచు బాగుగ నుండినది.

అమ్మ సాంగత్యములో యితర జీవులే మాంసాహారమును మానియుండ యింక మానవుల సంగతి చెప్పవలెనా! అమ్మ అహింసా ప్రబోధము వలన చాలమంది, ముఖ్యముగా కృష్ణా, గుంటూరు జిల్లాలలో, మాంసాహారులు శాఖాహారు లయినారన్న అతిశయోక్తి యే మాత్రమును లేదు.

అమ్మకు ఆహారము (భిక్ష) పెట్టుకునే సందర్భములో మాంసాహారులు వండిన పదార్థము పెట్టిన తిన వలను పడెడిది కాదు. (ఊదరపెట్టిన పండ్లను, బెల్లమును వంట పదార్థములే) వారేదైన పండు పెట్టవలసినదే. ఒక పర్యాయమొకరు (హింసాహారులు) వంట పదార్థము

తీసుకొని వచ్చి అమ్మకు పెట్టిరి. మామూలుగా దానిని నోటియందిదుకొనగా, లోనికి పోనివ్వ కుండ అంకిలి పట్టివేసినది. బయటకు వదలనూ లేదు. నోటిలోనే యుండుట వలన సరిగా అర్థము కాని ధ్వనితో, "మాంసము తింటావా?" యని అడిగిరి. వారు తిందుమని చెప్పిరి. వెంటనే ఆ పదార్థమును బయటకు వదిలివేసి, తదుపరి మిగతావారి భిక్ష తీసుకొనిరి. కొన్ని పర్యాయ మిటులనే జరిగినది. హింసా హారుల వద్ద వంట పదార్థమును పొరపాటున తీసుకొనుట జరిగి నను, లోపలిశక్తి యీ విధముగా అడ్డగించెడిది.

అమ్మవద్ద కెవరయిన హింసాపరులు వచ్చిన, అచట జరుగువంట పనులలో వీరు పాల్గొన వీలుపడెడిది కాదు. వారి నటుల దూరముగ నుంచి మిగతావారే వంటచేసి వారికిడు చుండెడివారు. హింసాహారమును విసర్జించి వత్సరము గడచిన తదుపరి వారిడిన పదార్థమును తీసుకొన గలిగెడివారు.

## వస్త్రదానము

తే. ఒక్క ఆశ్రమమందున ఒక్కసారి
అన్నదానంబు జరుగుచు నున్నయపుడు
సాధులందర జక్కగా సత్కరించి
దలచి వారలమ్మనుగూడ బిలిచినారు.

తే. నూత్న వస్త్రాలతోడను సత్కరించ
స్వీకరించిరి సాధువుల్ వేడ్కమీర
కాని యీ మాత మాత్రము గాక యటుల
వలదు, వలదంచు పలికెను వారితోడ.

తే. ఇట్టులనుటకు కారణంబేమి యగునొ
యంచువారలు ఎంతయు కించపడిరి
అసలు సంగతి అరయుట కదనుకాక
మిన్నకుండిరి అంతట తెన్నులేక.

తే. రెండు మూడు దినంబు లిట్లుండినంత
ముఖ్యులందరు కూడియు ముదము తోడ
అమ్మవద్దకు వచ్చియు అడిగిరిట్లు
"హేతువేమమ్మ మమ్మిట్లు హీనపరచ?"

తే. మీరు వస్త్రములిచ్చుట మేలొఏమొ
కాని మాకెట్లు తగిపోనో కానరాదు
ఇప్పుడున్నట్టి వస్త్రంబు ఏమిచేసి
స్వీకరించు మటందురో చెపుడు మీరు.

సీ. ఒంటిపై నొకబట్ట ఒనరంగ నుండగ
ఈ బట్టగైకొని ఏమిసేతు?
అట్టిపెట్టుదమన్న పెట్టేమియే లేదు
వట్టి చేతులతోడ ఎట్టుదాతు?
మోసి తెచ్చుటకును దాసియైనను లేదు
నా నెత్తిపై దీని నెట్లు మోతు?
ఆధారమేలేక అచ్చటచ్చట తిర్గు
నాకిట్టి దానంబు న్యాయమగునె?

తే., చెంతయున్నట్టి వస్త్రంబు చిరుగుదనుక
వేచియుండియు, దానిని దాచియుంచి
మీరలప్పుడు యిచ్చిన మేలెయగును
అవునొ, మరికాదొ, మీరలె అరయుడయ్య!'

కం. ఇది విని వారలు మిక్కిలి
మదిలోనను సిగ్గుజెంది మగిడిరి, తమలో
'పదుడిక పోదము మనకిట
నిదియే తగినట్టి శాస్తి ఎంతయు ననుచున్'

## పెద్దమ్మను పరమాత్మగా చూచుట

నాగాయితిప్ప దగ్గర మామిడితోటలో నుండగా జరిగిన సంఘటన. ఒకనాడు అమ్మకు తమలోనుండి ఒక శబ్దము వినిపించినది– 'ఇదివరకు నీలో ఏ భావమునకు పరమాత్మ కనుపించి నదో, ఆ భావముతో పెద్దమ్మను 12 రోజులు నామ రూపములు కనుపించకుండ పరమాత్మగా చూడుము.'– అని, అట్లే 3 రోజులు నామ రూపములు లేక పరమాత్మగా కనబడుచు నాల్గవ రోజున పెద్దమ్మ నామ రూపములు కన్పించినవి. అట్లు కాన్పించుట అసత్యమని అమ్మ యేడ్వగా, లోపలిశక్తి 'ఒక తప్పులే' అని మన్నించెను. మరల 3 రోజులు నామ రూపములు లేక నాల్గవ రోజు ఉదయము 8 గం.కు పెద్దమ్మ నామరూపములు కనుపించగా అమ్మ ఆ అసత్యమునకు చావుకు సిద్ధపడి తల బ్రద్దలుకొట్టు కొను సమయమున, అది చూచినవారు అట్లు కొట్టుకొననీయక పట్టుకొనిరి.

అప్పుడచ్చటికి చాలమంది జేరిరి. ఆ సమయమున ఆ తోటలో కాయలుండుట వలన, అమ్మలోని శక్తి ' ఈ కాయలు ఎవరైనను త్రుంచిన నీదే బాధ్యత' అని అమ్మకు తెలుప కావలి కాయలేక అచటినుండి బయలుదేరి కోసూరు సోమయ్య (కోసూరుపాలెం) గారి మామిడిచెట్టు నీడకు వెళ్ళిరి.

సాయంత్రం 3 గంటల వరకు అమ్మను పట్టుకొనియే యుండిరి. ఇట్లుండగా అమ్మలో 'కేసు విచారణ' అని వినిపించ గానే ఆ ఏడ్పు మానినది. అంతట 4 గం.లకు కంఠంనేని

శ్రీరామమ్మ యనునామె వచ్చి, 'అమ్మా!' అని పిలువగా, 'మీ అమ్మ అసత్యమైనదని' అమ్మ అనుటకు సిద్ధపడిరి. అంతలోనె, "అసత్యమైనదా? 12 రోజులు కావలి కాయమంటివి. కావలి కాయగలిగితే కాస్తాను. లేక పోతే లేదు. అంతే గాని కావలి కాస్తామని మేము ఒప్పుకుంటిమా?" అని అమ్మకు తనలో నుండి జవాబు వచ్చినది. అపుడు అమ్మ తాము అసత్యము కాలేదని సంతోష పడిరి.

మరల 3 రోజులు పెద్దమ్మ నామరూపములు కానుపించక నాల్గవరోజు ఉదయం 6గం॥లకు మనసులో నామరూపములు కనుపించినవి. మేము చెప్పినట్లు మా అదుపులో నుండక, కావలి కాయగలిగితే కాస్తానని అంటావా? పట్టుకొనవే సాయంకాలం 7 గం.ల వరకు, నామ రూపకమైన ప్రపంచము కనుపించకుండ పరమాత్మ భావముగానే' అని కట్టివేసినదొక శక్తి. 7 గంటల తదుపరి ఆ పట్టు విడిచిపెట్టినది. అపుడు అమ్మ శరీరము ఇటుక అవ గణ గణ కాలునట్లు కాలుచుండెను. నామ రూపములు చేయు ఎరుక పడలేని బాధ పడుచుండె.

ఇది యిట్లుండ, "అంతా పరమాత్మ" అనువారి మాట ఎంత సత్యమో యోచించి చూడుడు. సూర్యుని యెదుట చీకటిని ఎట్లు దర్శించలేమో, అంతా పరమాత్మ అన్న ఎరుక సత్యమైనచో నామరూప ప్రపంచము కనుపించనే కనుపించదు.

## ఐక్యమగుట

ఇల్లు వీడిన తదుపరి కొంత కాలమువరకు అమ్మ కాశ్రయ మిచ్చినవారిలో ముఖ్యులు శ్రీ సుఖవాసి నారయ్య (రేపల్లె తాలూకా నల్లూరుపాలెం గ్రామ మునసబు) గారు. కేవలము వీరే గాక వీరి కుటుంబము, వీరి మరదలు గారి కుటుంబము– పిల్లలతో సహా– చాలకాలము అమ్మసేవలో గడిపిరి. వీరిలో రంగమ్మ (మునసబు గారి భార్య) గారు అమ్మయెడ విశేష శ్రద్ధాభక్తులతో నుండెడిది.

1934లో రంగమ్మ గారికి పెద్ద జబ్బుచేసి తీవ్రరూపము దాల్చినది. అదే సమయములో అమ్మ చెరుకుపల్లి గ్రామములో నుండిరి. ఒకనాటి రాత్రి రంగమ్మగారు వచ్చి కౌగలించుకొని తనలో కలసిపోయినట్లును, ఆ మరుక్షణమే తామారూపయి నట్లును, తమ ముఖముపై స్ఫోటకము మచ్చలున్నట్లును కనుపించినది. (రంగమ్మగారికి లోగడ స్ఫోటకము వచ్చినది). "ఏమిటా, యిలావుంద'ని అనిపించినది అమ్మకు. ఆరాత్రి రంగమ్మగారు గతించినారని మరునాడు వార్త వచ్చినది.

భగవంతునిలో భక్తులు లీనమగుట యనయిట్టిదే యని అమ్మ అనెడివారు. ఆ జ్ఞానితోపాటు ఆ భక్తుల లోకవృత్తులు కూడ రహితమై వారుకూడ శాశ్వతానంద స్థితిని బడయగలరని చెప్పెడివారు. అటుల లీనమైపోయిన ఆ భక్తులెంతటి ధన్యులో కదా!

అమ్మ వ్యాసాశ్రమములోనుండగా జరిగిన కొన్ని ముఖ్య సంఘటనలు (1936).

చవక ప్రయాణపు రైలు టిక్కెట్ల యేర్పాటు మీద కొందరు ప్రయాణము చేయుచు వ్యాసాశ్రమము వెళ్ళిరి. అందులో నొకరు మిగతా దినములకు అమ్మనుగూడ తీసుకొని పోవుటకును, అమ్మకు భిక్షపెట్టుకొను చుండుటకును ఒడంబడి పదిరూపాయలు పెట్టి అమ్మకై టిక్కెట్టు కొనిరి. ఆ ప్రయాణీకులతో పాటు అమ్మయు వెళ్ళిరి. ప్రయాణపు దినములు ముగియక మునుపే అందరును తిరిగి వ్యాసాశ్రమమునకు వచ్చి అమ్మ నక్కడ విడచిరి. అప్పటికి లెక్క చూడగా అమ్మకై కొన్న టిక్కెట్టు మూల్యములో ఆరురూపాయలు నిలువ యున్నటుల లెక్క తేల్చిరి. ఆ విలువను టిక్కెటు కొన్నవారి కిచ్చివేయవలె ననియు, అందుకై తామిచ్చట నుండు దినములలో భిక్షపెట్ట నిచ్ఛగించు వారికి తానమ్ముడు పోదుననియు, ఎవరిష్టము వచ్చినంత వారు పావలాయో, అణాయో యిచ్చి కొనుక్కొన వచ్చుననియు చెప్పిరి. అటులనే అచటనున్న వారు వారి వారికి తోచినటుల డబ్బునిచ్చిరి. శ్రీ మళయాళ స్వాములవారిని కూడ అడుగగా “మీరెంతయో మేము నంతయే. మాకు డబ్బెక్కడిది?” అనిరి. అంతట, “ఇక్కడ మీకేమియు లేకుంటే బయలుదేరుడు. వెళ్ళిపోదాం” అని అమ్మ అనగా ఒక ఫావలా నిప్పించిరి.

ఎవరెంతెంత డబ్బిచ్చిరో అను లెక్కవేసి, ఆ లెక్కల ప్రకారము మూడు నెలల పూటలు పంచి ఆ లెక్క చొప్పున అమ్మ వారి వారి కడకు పోయి ఆహారము తీసుకొనిరి. సరిగ మూడు మాసములకు 24-3-37 న శ్రీ స్వాములవారును, సాధువులు కొందరును పోడూరు సభకు పోవుచు అమ్మకును వారే టిక్కెటు కొన, వారితో అమ్మ పోడూరు వెళ్ళిరి.

అమ్మ ఆశ్రమములో వున్న కాలములోనే ఒకనాడు భక్తులు కొందరు శ్రీ స్వాముల వారికి హారతిచ్చు చుండిరి. మామూలు చొప్పున ఒక రూపాయి పళ్ళెములో పెట్టి వారికిచ్చిరి. వారే అమ్మకు కూడ హారతిచ్చిరి. దాని భావమేమొ తెలియక అమ్మ తనకా విషయము పట్టనట్లూరుకొనిరి. పిమ్మట పళ్ళెములోని రూపాయిని అమ్మకీయబోయిరి. అమ్మ దానిని తాకలేక, ‘ఛీ! ఛీ! మాకెందుకు రూపాయి’ అనిరి. ఆ వచ్చినవారు, ‘ఇక్కడ అట్లా రూపాయినిచ్చుట ఆచారము. శ్రీ స్వాములవారు పుచ్చుకొనుట లేదా? మీరును పుచ్చుకోవలె’ ననిరి. అంతట అమ్మ, ‘స్వాములవారు దరిద్రుడు. ఆయన తీసుకొనిన తీసికొనుగాక! మాకక్కరలే’దనెను.

అచటనున్న వారిలో నొకరు యీ సంగతి స్వాముల వారికి తెలిపిరి. వారు, ‘అబ్బో! చిన్నమ్మ కాలాంతకురాలు’ అనిరి. ఆ మాట తెలిసిన చిన్నమ్మ, ‘మేమింకను కాలాంత మును పొందలేదు. ఆ మాట మంచిదే. కాని మేము కాలము లోనే యున్నాము.’ అనిరి.

## ప్రసాదము

అమ్మ నోటినుండి ‘ప్రసాదము’ అను శబ్దమునకు సరియగు యర్థము (వివరము 58వ పేజీలో చూడనగును.) వెలువడిన దాది అమ్మ వద్ద నుండెడివారు తాము భోజనము చేయుముందు ఆ పదార్థములను అమ్మకు ప్రసాదముగ చూపించుకొనుటయో, లేదా తాము

భుజించు ముందు మొదటి ముద్ద అమ్మకిడి మిగత యాహారము ప్రసాదముగా చూపించు కొని భుజించుటయో జరిగెడిది.

సాధారణముగ మనవారు భోజనములు చేయుముందు మొదటి ముద్దను దేవుని ముద్దని వేరుగా నుంచి, చివరకు దానిని ఏ కాకికో లేదా మరిదేనికయినా వేయుదురు. పండుగ వగయిరా దినములలో మొత్తము పదార్థములు ఏ బొమ్మకో చూపించి తదుపరి స్వీకరించుట జరుగును.

ఏ యాచారము అమ్మవద్ద జరిగెడిదో దానినే పూర్వ కాలమున కూడ అప్పటి జ్ఞానుల ననుసరించెడివారు ఆ విధముగ ఆచరించి యుండవచ్చు. అదియే క్రమముగ ఆ వ్యక్తులు పోయిన తదుపరి ఆ మమత పట్టలేక, ఆ వ్యక్తుల ఫోటోలు సేకరించి వాటికే చూపించుట, విషయము సరిగా తెలుసుకొనక ప్రథమ కబళమును వేరే జీవులకు పెట్టుట జరుగుచూ వచ్చుచున్నది. కాని కాకి వగైరా జీవుల కటుల యాహార మిడుట వలన తిరిగి ఆ జన్మలకు పోవలసి వచ్చునేమో!

## వినోబాతో

1942 లో వినోబాజీ వినయాశ్రమము వచ్చిరి. అపుడు అమ్మ అచటనే యుండిరి. 'రా' అను శబ్దమునకు లోబడి నడచెడి రోజులవి. అమ్మ నడకంతయు విని, వినోబాజీ, 'ఎవరు రమ్మనినను వెళ్ళెదరా?' అని అమ్మ నడిగిరి. అమ్మ, 'ఆ' యనిరి. దగ్గరనే యున్న సచ్చిదానందమూర్తి, వెంకట్రామయ్య (కుమారులు)లను చూపించి, "వీరు రమ్మనినను వెళ్ళెదరా?" అని యడిగిరి.

"అందరిలాగా వీళ్ళు కానివాళ్ళయినపుడు, వీరు రమ్మంటే వెళ్ళటానికి మాకేం" అనిరి అమ్మ.

'ఆ!' అని ఎంతో ఆశ్చర్యపడిరి వినోబా.

సాధారణముగా లోకములో సాధువులు కర్తృత్వము ద్వారా భార్యా పిల్లలను, యిల్లూ వాకిలి వదలి ఆశ్రమములో చేరుట కద్దు. అట్టివారు తమను వారి భార్యా పిల్లలు ఆహ్వానించినా తిరిగి వెళ్ళుట జరుగదు. అమ్మ యిటుల కర్తృత్వము ద్వారా సంసారమును వదలి వచ్చినవారు కారు. అందరు సమానమే అయినపుడు ఎవరు రమ్మనినను వెళ్ళెదరు.

## ప్రకృతి శక్తులు లొంగుట

ఒక పర్యాయము వీరు క్రొత్త పేట నుంచి రేపల్లె వచ్చు చుండిరి. వర్షాకాలము. ఆకాశము మేఘావృతమయినది. కొద్ది నిముషములలోనే వర్షము ముంచివేయునా యనునట్లున్నది. శరీరముపై చినుకు పడిన అమ్మ సహించలేరు. కాని రేపల్లెలో సుఖవాసి నారయ్యగారిల్లు (చేరవలసిన చోటు) చేరగనే కుంభ వృష్టి. ఈ విధముగా చాల పర్యాయములు జరిగినది.

## బట్టల దొంగతనం

వినయాశ్రమము వద్ద నున్నపుడు కొందరి బట్టలు దొంగిలింప బడినవి. ఆ సందర్భమున "నాయనా! మామూలాన నీవు దొంగవయ్యావా? మా దగ్గరున్న యీ బట్టలు నిన్ను దొంగను చేసినవా? మా మూలంగా చెడిపోయావా బాబూ! మేమున్న చోట ఈ దొంగతనం తలెత్తి నిన్నిటుల పాడుజేసిందా?" అని అమ్మ ఎంతగనో విలపించిరి.

ఈ సంగతి లోకానికేమి తెలుసు? ఇది విని కొందరు, "అమ్మ జ్ఞాని యగుటేమి? బట్టలు పోయినందుకు విలపించు టేమి? యని అనుకొనిరట.

## బ్రాహ్మణుల పూజ

ఒక పర్యాయము రేపల్లెలో బ్రాహ్మణులొకరు అమ్మను తమ గృహంబున కాహ్వానించి, సాక్షాత్ భగవంతుడే విచ్చేసిరని కుర్చీయందు కూర్చుండబెట్టి, కేశవాయనమః మాధవాయనమః యని మంత్రములు చదువుచు పూజచేయ మొదలిడిరి. విచిత్ర మేమన, వారే మంత్రము చదివిన అమ్మ ఆ రూపొందెడివారు. శివాయనమః యనగనే శివరూప మొందెడివారు. ఎదుటి వారికి అటుల కనుపించకపోయినా, తామా రూపొంది నటులగా అమ్మకే కనుపించెనట. అటులనే విష్ణాయనమః యనగనే విష్ణురూపము చెందెడివారు.

అన్ని రకముల ఎరుకలు మాలోయుండుటచే అటుల జరుగుట కలదని అమ్మ అనెడివారు.

## విశ్వరూపము

1945 ఫిబ్రవరి 12 నాటి సంగతి. అమ్మకు నీరసము వచ్చియున్నది. ఆ నీరసములో వారు లోకముల నన్నింటిని చూచుచు, 'యివిగో మణులు. మా శరీరమంతయును మణులే. చూడండి. ఇంద్రుడు మేమే. విష్ణువు మేమే. ఈశ్వరుడు, రుద్రుడు మేమే. యమధర్మరాజును కింకరులును మేమే. మృగము, పక్షి, పురుగు మున్నగు సర్వజీవులును మేమే." యనుచు వర్ణింప సాగిరి. మాయాశక్తి ప్రభావమును (విశ్వరూపమును) అచటనున్న వారందరు ఆశ్చర్యముతో వినుటయే గాని ఎవరును చూడజాలరైరి. 'స్వర్గలోక మెట్లున్నదమ్మా?' యని ఒకరు ప్రశ్నింప, కొంత తడవాగి, 'కోటానుకోట్ల సూర్యకాంతి స్వర్గములోని ఒకొక మణికాంతికి సరిపోవునేమో! అట్టి మణులు స్వర్గలోకములో లెక్కకు మించి వున్నవి. ఇక ఆ స్వర్గలోక మెంత దేదీప్యమానమైనదని చెప్పవలెను.' అని తమలో తామె మాట్లాడుకొనుచు ఆ మణికాంతుల వైభవమును చూచి ఆనంద మనుభవించు చుండిరి. అపుడు వారిలోని శక్తి, 'అనంతము, శాశ్వతము, దేదీప్యమానమునగు ప్రకాశ (పరమాత్మ) ముండగా అత్యల్పము, అనిత్యము, తుచ్ఛమునగు స్వర్గలోకానందమునకే మురియుచున్నావా?' అని యనుసరికి మాట్లాడజాలక, శరీరమును కదల్పలేకయుండిరి.

మూడు దినములనంతరము ఆ స్వర్గలోక భోగము లనుభవించిన సత్య శాంత దయాది శక్తులకు (గుణములకు) శ్రాద్ధము చేయించమని లోని శక్తి పలికినదని అమ్మ తెలుప, అచటనున్న వారు అట్టికర్మ చేసి అమ్మ కాహారమిడిరి. ఈ రోజు ఆహారము తీసుకొనుటలో యిదివరకున్న హద్దులన్నియు తొలగెను. విరోధులున్న వారిడు ఆహారమును తీసుకొనగూడ దనెడి నియమము కూడ సడలినది. మరునాడే తిరిగి హద్దులు వచ్చి విరోధులున్న వారిడిన ఆహారమును తీసికొన జాలకపోయిరి. విరోధులున్నవారు తమ విరోధులను ప్రేమతో పలుకరించి వచ్చి అమ్మ కాహారమిడ గలుగు చుండిరి. ఇటుల సుమారు 2 1/2 వత్సరములు గడచిన తదుపరి "విరోధులున్నవారు పెట్టిన ఫలితము లేదంటివి. విరోధులు లేని వారు పెట్టిన ఫలితము యొక్క భారము నీదేనా? ఎవరి విరోధ భావమును వారే పోగొట్టుకొన వలయును గాని, ఆ భారము నీది కాద"ని లోని శక్తి తెలుప, తదాది విరోధులున్న వారిడు ఆహారమును కూడ తీసుకొన మొదలిడిరి.

## తెలుసుకొనుట - తెలియుట

ఒక పర్యాయము అమ్మ తన అనుచరులతో పాటు బందరులో ఒక డాక్టరుగారింటికి వెళ్ళుట జరిగినది. ఆ డాక్టరు గారు అమ్మను, "అమ్మా! యీ బీడీలో యిన్ని దోషాలున్నాయని తెలుసు. కాని మానలేకుండా యున్నాను. కారణమేమ"ని అడిగిరి. "నాయనా! నువ్వు తెలుసుకున్నావు గాని, నీకు తెలియ లేద"ని అమ్మ చెప్పిరి. తెలియుటన తెలుసుకొనుట కాదు. తెలియుటన నడచుటే.

పై జవాబు వినగనే అంతవరకు నిలబడియున్న అమ్మకు వెంటనే నమస్కరించి, యింటిలోనికి తీసుకొనిపోయి భార్యా పిల్లలచే కూడ నమస్కరింపజేయించి యథోచిత రీతిని సత్కరించిరి.

## శాంతి కుటీరము

అమ్మ యిలువీడిన తదుపరి చాలమంది యథాశక్తిని వారి కాశ్రయమిచ్చిరి. అందుముఖ్యులు శ్రీ రేపల్లె బసవయ్య గారని చెప్పవచ్చు. వీరిది పోటుమెరక గ్రామము, రేపల్లె తాలూకా

వీరు 1922 నుండి అమ్మ సాంగత్యమునకు వచ్చుచు 1939 తరువాత అమ్మను యెడబాయక యుండిరి. వీరు, అమ్మ పోటుమెరకలో (1941) నున్నపుడు వారి సౌకర్యార్థము అచట ఒక పాకయును, అవనిగడ్డ సమీపమున గల క్రొత్తపేటలో (1946) నున్నపుడు అచట ఒక పాకయును ఏర్పాటు చేసి యుండిరి. 1951లో అమ్మ అవనిగడ్డనుండి రేపల్లె వద్దనున్న బావాజీ తోటకు వచ్చిరి. ఇంతకు పూర్వమిది పెద్దమ్మగారున్న నివాసస్థానము. అమ్మ యిచటనుండగా శ్రీ బసవయ్యగారు ఈ తోట సమీపముననే పేటేరు గ్రామమునకు సంబంధించిన కొంత భూమిని కొని అందులో

రెండు యిండ్లను, పాకలను వేసిరి. అమ్మ, అమ్మ అనుచరులును యిందుండెడివారు. ఇదియే శాంతి కుటీరముగ వ్యవహరింపబడు చున్నది. అనేకులిచటికి వచ్చి, తమకు వీలయినంత కాలముండి, అమ్మను సేవించుచు వారి బోధలు విని వెళ్ళుచుండెడి వారు.

అమ్మ 8 నెలలు శాంతి కుటీరము తూర్పు వసారాలో నుండి, తదుపరి అచటచట తిరిగి, 1953 నుండి శాంతి కుటీరపు పడమటి సరిహద్దున సర్కారు స్థలమునందు వేయబడిన పాకలో నుండిరి. అంత్యదశ వరకు అమ్మ యిచటనే కాలము గడపిరి.

## గొఱ్ఱె పెంటికలు

శాంతి కుటీరమున నుండు కాలమున ఒకనాటి సాయంకాలము అమ్మ అనుచరులతో కలసి మాటలాడుచు నొక డొంకవెంట వెళ్ళుచుండిరి. త్రోవలోనున్న గొఱ్ఱెలు (అమ్మ భాషలో అమాయక ప్రజ) మేత మేయుచు అమ్మనిటుల అర్థించినవట-

"అమ్మా! ఎన్నాళ్ళు చూచినా మా జీవితం కోతకు రాను, కోయటం - కోతకు రాను. కోయటం- యిలాగే గడచిపోతోంది. మీ విస్తరిలోకి వచ్చే కూరగాయల పాదుల్లో యీ పెంటికలు తీసుకు పోయి వేస్తే మేమేమైనా ఒకదారికి రాగలుగుతామేమో!"

వెంటనే అమ్మ, వారి యనుచరులు అచటగల పెంటికలన్నింటిని యేరి కూరగాయల పాదుల్లో, చెట్ల పాదులలో వేయించిరి.

## వస్తు జాగ్రత్త

వస్తు జాగ్రత్తలో వీరికి వీరే సాటి. ప్రతి వస్తువును చాల జాగ్రత్తగా వాడెడివారు. ప్రతివస్తువు ప్రాణిగా కనుపించెడిది అమ్మకు. ఏ వస్తువునయినా నిర్లక్ష్యము చేసిన తోటి ప్రాణిని హింసించి నట్లుండెడిది. భోజనము చేయునపుడు అన్నపు మెతుకు వృథా పోనిచ్చెడివారు కారు. సమృద్ధిగా దొరికెడి నీటిని కూడ వృథాగా వాడెడివారు కారు. అనవసరపు వాడుక వాడిన, "మమ్ము నిర్లక్ష్యము చేయుటేల?" యని ఆ నీటిశక్తి యడుగు నట. ఏ వస్తువునయినా నిర్లక్ష్యపరచిన, వచ్చు మాయ అనగా క్రొత్త కర్మ వచ్చి మనలను బాధించునని చెప్పుచుండెడివారు.

## కండ్ల కాటుక

తే. నేత్రవైద్యము చేయంగ నెలత యొకతె
వచ్చి అమ్మను చూచియు వడిగ తాను
కంటినిండను కాటుక జంటచేసి
రెండు బొటనవ్రేళ్ళతో రుద్దె మెండుగాను.

తే. కండ్లు రెండును అంతట కదలబారి
ఎఱ్ఱ దుత్తలట్లయ్యెను ఎంతగానొ
పాపమా వృద్ధ ఎంతయు భయము చెంది
ఉండిపోయెను అంతట గుండెజారి.

తే. 'అమ్మ భయమేమి వలదం'చు అమ్మ పలికె
'నీదు దోసంబదేమియు లేదుయిందు
ఏను చేసిన కర్మయే యిప్పుడిటుల
అనుభవింపంగ జేసెడు నమ్మ యిపుడు.'

తే. వృద్ధమాతకు నీరీతి వేడ్కగలుగ
శాంత వచనంబు పల్కియు సాగనంపె
అమ్మ చూపిన ఓర్పుకు అందఱచట
అబ్బురంబున మునిగిరి, 'ఔర' యనుచు.

## పండినతల్లి

అది 1956 వ సం॥ నవంబరు నెల. సచ్చిదానందమూర్తి గారికి అక్టోబరులో ప్రారంభమైన టైఫాయిడ్ జ్వరము తగ్గు ముఖము పట్టినది. కాని అదే సమయమున దగ్గు ప్రారంభమై తీవ్రరూపము దాల్చినది. రాత్రింబవళ్ళు మంచముపై కూర్చుండ వలసి వచ్చెడిది. ఏ మాత్రము తలవాల్చినను మనిషిని వూపిరాడ నీయకుండ గిలగిలా తన్నుకొనునట్లు చేసెడిదా దగ్గు. వారి పరిస్థితికి అమ్మ ఎంతయు తహతహలాడి, "ఆ దగ్గు నీకు పోయి మాకు వచ్చిన బాగుండునురా సత్యం!' అని యనిరి. ఆ దగ్గుకు డాక్టరుగారు మందివ్వగా తగ్గినది.

అదేమి చిత్రమో– అమ్మమాట యదార్థము చేయుటకో లేక యీ దగ్గుననుభవించుట అమ్మకు విధియో యనునట్లు–ఆదినము నుండి సచ్చిదానంద మూర్తిగార్కి దగ్గు తగ్గి అమ్మకు రా నారంభించినది. తదాది అమ్మ అస్వస్థతగా నుండసాగిరి. అటుల సుమారు వారము దినములు మాత్రము గడచినవి.

తదుపరి 4–12–1956 వ తేదీకి దగ్గు తీవ్రరూపము దాల్చినది. దానితోపాటు కడుపుబ్బరము, గుండెదడ కూడ ప్రారంభమయినది. సచ్చిదానందమూర్తి గారికి వలెనే వీరికి కూడ తల వాల్చగనే దగ్గు. ఇంక ఆ రాత్రి నిద్రపట్టు సూచనలు కన్పించుట లేదు. డాక్టరుగారి వద్దకు పోయి పరిస్థితులు చెప్ప ఆ రాత్రి నిద్రకు మాత్రము మందిచ్చిరి. దానితో నాడు సుఖ నిద్రపోయిరి. 5వ తేదీ డాక్టరుగారు వచ్చి పరీక్షించి గుండె నెమ్ముయని నిర్ణయించి మందిచ్చిరి. దగ్గు ప్రారంభించిన దాది అమ్మ కొంచెము నీరసముగా నుండిరి. అయినను వచ్చి పోయెడి వారికి యథాప్రకారము ఆధ్యాత్మిక విషయములు చెప్పుచునే యుండిరి. ఆరవతేదీ కూడ మందు తీసుకొనిరి.

ఇంక మరునాడు, 7-12-1956 శుక్రవారము, మార్గశిర శుద్ధ పంచమి. 'మా వూరు (పరమాత్మ) ఎపుడు చేరు కుంటామో' అని తహతహలాడు వ్యక్తికి ఆ దినము సమీపించినది గాన ఆనాడు అమ్మకు, వారి యనుచరులకు, పరిచితులకు పర్వదినము. అట్లని క్షణకాలము క్రితము వరకు గట్టిగా వూహించినవారు లేరు. కాని అమ్మకు మాత్రము అట్టి సూచనలు కనుపించు చున్నవా యనునటుల వారి మాటలను బట్టి తెలియుచున్నది

నిద్రలేచిన తదుపరి శ్రీరామమ్మతో, 'శ్రీరాం! మీ యింట్లోకి ఒక శవాన్ని చేతుల్తో పట్టి తీసుకు వచ్చినట్లు కల వచ్చిందే రాత్రి మాకు!' అని యనిరి. నిత్యము చెప్పుచుండెడి కలవంటిదే యిది. అని అనుకొనిరే గాని, భవిష్యత్ సూచనని ఎవరును వూహించరైరి.

ఉదయము ఏడుగంటలకు మందుకై ఒకరు బయలుదేరబోవ, 'మాకు మందూ వద్దు, ఏమీ వద్దు. మట్టిలో కలిసిపోయే యీ శరీరానికి మందు దేనికి?' అని యనుసరికి వారూరకొనిరి.

అమ్మ దగ్గరుంటున్న ఒకామె (పొలదుగు మంగమ్మ, మోపర్రు) ఆనాడు కార్యాంతరముపై స్వగ్రామము బయలు దేరనుండ, 'మంగమ్మా! అమ్మను ఏదో యొకటి చేసిపోక, అపుడే వెళ్తున్నావేమే?' అనిరి.

చాకలి వెంకాంతో, 'వెంకాం! స్వాములవారు (తత్వానంద స్వామి) పోతే నీకు చాలా గుడ్డలు దొరికాయి కామాను. ఈ అమ్మది ఒక పీలిక కూడ యివ్వరు.' అన్నారు అమ్మ.

దగ్గరలోనున్న సాధ్వి రత్తమ్మగారితో, 'రత్తమ్మా! పెద్దమ్మ ఆరాధన రాబోతుంది కాబోలు! మేముపోతే ఆ ఆరాధన కేమీ యిబ్బంది లేదు గదా!' అని అడిగిరి.

సుఖవాసి తురీయం (నారయ్యగారి కొమార్తె) అను నామె నూనె తెచ్చి, 'అమ్మా! కాళ్ళకు నూనె రాయనా?' అన 'ఊ! రాయి, ఇంకెన్నాళ్ళు రాస్తావులే! ఇవాళ ఒకరోజేగా!' అని చెప్పిరి.

ఈ మాటలలోని సూచన అచటివారికి కొంతవర కర్థమయినను, 'అమ్మ తమ నుండి దూరమగునా! అది యిప్పుడే సంభవమా!' అనునది పై సూచనను ధృఢ పరచ లేక పోయినది.

లోగడ అమ్మ చెప్పుచూ వుండెడి మాటలను (యీ వినేది, చూచేది, మాట్లాడేది పోవాలి. అపుడు దొంతులమ్మకు వలెనే సంగరహితావస్థ వస్తుంది. అది మీకు ఎంతో బాగుంటుంది. మీరు కూడ బాగుపడతారు.) బట్టి, యిప్పటి నీరసమును బట్టి, లోగడ నీరసములలో వలెనే యిప్పుడు కూడ (విను, కను, మాట్లాడు) వృత్తిరహితమై అమ్మ అతీతావస్థకు చేరునేమో, అట్టి మహత్తరదశను కనెడి భాగ్యము కల్గునేమో యని అందరు ఆశ పడిరి.

అదేరోజు (7-12-1956) మధ్యాహ్నం 2 గంటల వేళ కావూరు వినయాశ్రమము నుండి గొల్లపూడి సీతారామశాస్త్రి గారి కుమారులు సుబ్బయ్య శాస్త్రిగారు (ఆయుర్వేద

వైద్యులు) ఏదియో పనిపై రేపల్లె వెళ్ళుచు అమ్మను దర్శించుటకు వచ్చిరి. నీరసముగ నున్నను వారితో అమ్మ చాలసేపు ఆధ్యాత్మిక విషయములు ముచ్చటించిరి. వీరు అమ్మను లోగడ ఎరిగి యున్నవారే. మాటల సందర్భములో అమ్మ అనారోగ్య పరిస్థితులు వగైరా తెలుసుకొని 'అమ్మా! మీ వద్దకు వచ్చు వారందరు పండో ఫలము యిచ్చి మిమ్ములను పోషించుకొను చున్నారు. మేము కూడ మా శక్త్యానుసారము తగు (ఆయుర్వేద) మందులిచ్చి అమ్మను కాపాడుకుంటామ'ని పలికిరి.

అపుడు అమ్మ, 'నాయనా! నీవు చెప్పింది బాగానే వుంది. కాని అసలు మేము మందే వద్దన్నాము. అంతగా అవసరమైతే యిప్పటి వరకు మందిస్తున్న డాక్టరు గారిని కాదని, నీవద్ద తీసుకోవటం మంచిది కాదు గదా! వారి మందువల్ల కూడ ఫలితం లేకపోతే అపుడు నీవద్ద మందు తీసుకోవచ్చు. అవునా బాబూ!' అని చెప్పిరి.

అప్పటికి సాయంకాలము 5 గంటలయినది. ప్రొద్దు గుంకువేళ, ఇంటికి వెళ్ళవలెననెడి తలంపుతో, ' సరే మంచిదే.' యని సుబ్బయ్య శాస్త్రిగారు లేచి, అమ్మకు నమస్కరించి ప్రక్కనే రోడ్డుపైనున్న తమ టాక్సీ నెక్కుటకై బయలుదేరిరి. అమ్మకూడ ఒకటికి వెళ్ళవలసిన అవసరము కలిగియో లేక మరేలకో లేచిరి. కాని పూర్తిగా లేచి నిలబడక మునుపే, తూలి పడిపోయిన వానివలె, గభాలున తామప్పటివరకు కూర్చుని యున్న చాపపైననే కూర్చొనబడి ముందు కొరిగిరి. గత అయిదారు దినములుగా నీరసముగా నుండుటచే కళ్ళుతిరిగి పడిపోయి రేమో యని కొందరు, యిదేదియో నీరసము, యేదైనా మార్పు వచ్చునేమో యని కొందరు, ఉదయము నుంచి పరిస్థితులు చూచుచుండుటచే, 'యికేమున్నది, అమ్మ మనకు దూరమయి నదా!' యని కొందరు వివిధ రకముల తలపోసిరి. దగ్గరనే ఎదుట నున్న సచ్చిదానందమూర్తి వగైరాలు బోర్లపడియున్న ముఖమును ప్రక్కకు త్రిప్పి, వెంటనే నీళ్ళు తెప్పించి నోటిలో పోసిరి. కాని అవి లోపలికి పోయినటుల లేదు. అమ్మ కడనుండి కొద్ది అడుగులు మాత్రమే వేసిన ఆ ఆయుర్వేద వైద్యులు వెంటనే వెనుతిరిగి వచ్చి నాడి పరీక్షించి చప్పరించిరి.

ముఖవైఖరి మారినది. నోరు తెరచి యుండుటచే నాలుక రంగుకూడ మారుట స్పష్టముగా కానుపించినది. కండ్లచూపు కూడ అదొక విధముగా నుండెను. నేలకొరిగిన కొద్దిక్షణములకే అమ్మ నోటనుండి వెంట వెంటగా రెండు దఫాలు ఎగశ్వాస వచ్చెను. అంతటితో సరి.

ఇక అప్పుడు అందరిలోను యీ క్షణము నుండి అమ్మ మనకు భౌతికముగా దూరమయిన దనెడి అంతిమ నిర్ణయము జరిగినది.

తంతి సౌకర్యము కలిగి దూరప్రాంతములందున్న భక్తుల కప్పటి కప్పుడే యీ వార్త తంతులద్వారా అందజేయబడినది. మిగత వారికి, వెంటనే వార్తలు పంపుటకెట్టి సౌకర్యములు లేక పోవుటచే, మరుసటి ఉదయముననే వీలగు మార్గములద్వారా అమ్మ యనుచరులందరకు యీ వార్త అందజేయబడినది.

అమ్మ భౌతిక కాయమును భక్తులు రాత్రి సుమారు 7 గంటలవేళ యింటిలోనికి తీసుకొనిపోయి, తుది దర్శనముకై యేతెంచు ప్రజల సౌకర్యార్థము ఒక యెత్తగు స్థానమున కూర్చుండబెట్టి తగు యేర్పాట్లు గావించిరి.

భౌతికముగా దూరమైన అమ్మకై విలపించెడి వారిని గాంచి శ్రీ సచ్చిదానందమూర్తిగారు, 'లోకములో వారివలె యిట్లు అమ్మకై విలపించుట మంచిదికాదు. అమ్మ సామాన్యపు వ్యక్తి కాదుగదా! మహత్తర స్థితి నొందిన అమ్మనుగురించి మనము సంతోషముగ నుండవలె గాని, దుఃఖించగూడదని అందరిని యూరడించిరి. ఆ రాత్రి వారందరికి ధైర్యము చెప్పి అందరు ఆహారము తీసుకొనునట్లు జేసిరి.

ఆరోజు (7-12-1956) ఉదయమున, 'మాకు మట్టిగడ్డ, కానీ ఒకటిగానే కన్పిస్తోంది. మేమిప్పుడు కానీ తాకగలం' అనెడి అమ్మ మాటనుబట్టి అంత్యకాలములో అమ్మ అతీతావస్థకు చేరుకొనుననియే చెప్పవచ్చు.

8-12-1956 తెల్లవారిన దాది వందలాది ప్రజలు అమ్మ తుది దర్శనమునకై పరువిడి రాసాగిరి. 1, 2 దినముల వరకు శాంతి కుటీరము తీర్థస్థానమయినది.

దవ్వులనుంచి వచ్చువారికవకాశము కలిగించు నిమిత్తము వుండగలిగినంత కాలము ఆ కాయము నటులనే భక్తులు యుంచదలచిరి. 8వ తేదీ పగలు కూడ గడచినది. ఇక ఆ రాత్రి అమ్మ భౌతిక కాయము నిలువ యుండునటుల కాన్పించలేదు. ఏమి చేయదలచినను ఆ రాత్రియే. ఏమి చేయవలె ననునది పెద్ద సమస్య కాలేదు. ఏలనన, అంతకుముందే అమ్మ 'మేము పోతే మమ్మల్ని ఏ గోతిలోనన్నా పెట్టండి.' అని చెప్పి యుండిరి. వారి మాటలను కాదనుటెట్లు? ఆ రెండుయిండ్ల మధ్యభాగము ననే పెద్ద గోయి తీసిరి. అది రాత్రి 2 గంటలవేళ. అందరును తుది దర్శనము చేసుకొని అమ్మ భౌతిక శరీరమును నగ్నముగా ఆ గోతియందు పూడ్చిపెట్టుటతో తదుపరి దర్శింప వచ్చిన భక్తుల కా యవకాశము కూడ లేకపోయెను.

## ఇక మార్గమేది?

'అయ్యో! అమ్మను కడసారియైనను చూడలేక పోతిమే!' యని కొందరు, 'అమ్మ వుండగా, అమ్మవద్దకు రాలేకపోతిమే!' యని కొందరు, "అసలు అమ్మను ఒకసారియైనను చూచు భాగ్యము లభించలేదే" యని కొందరు, "యిక మార్గమేది?" యని కొందరు, యిట్లు పలువురు పరిపరి విధముల పరితపించ సాగిరి. కాని, "మేము పోయినాక మాశక్తి ఎచ్చటో ఒక చోట వుంటుంది. లేదా ప్రయత్నించి వెదకితే మాలాంటివారు లోకంలో వుండకపోరు. వారిని వెదకి సంపాదించుకొనండి లేదా యీ సంఘాన్నైనా అంటిపెట్టుకొని యుండండి." అనెడి అమ్మ వాక్యములను గుర్తుంచుకొని నడచిన పై విధముగ పరితపించ పనిలేదేమో!

'అమ్మ లేదుగదా! ఇకనేమిటి కర్తవ్యం?' అనుప్రశ్న చాలమంది యందుదయించక పోలేదు. కాని, "అమ్మ ఎచటికి పోలేదు. ఇచ్చటే వున్నారు. ఈ సంఘాన్ని అనుసరించండి." అని శ్రీ సచ్చిదానందమూర్తిగారు ధైర్యము చెప్పుచుండిరి.

వీరు చిన్నతనము నుండియు ఋజువర్తనము గలవారని మొదటనే పేర్కొంటిమి. అమ్మకూడ అపుడపుడు "వాడి నడకే వేరు, ఎప్పుడు కూడ తప్పుకు దొరికినట్లు కనుపించడ"ని అనుచుండెడివారు. వీరుకూడ తమకు 1944లోనే పరమాత్మ దర్శనమయినదని చెప్పుచుండిరి. వీరినడక చూచిన అటులనే కర్తృత్వ రహితులై వ్యవహరించుచున్నటుల కనుపించుచున్నది. అమ్మ వున్న కాలములోనే వీరుకూడ ఆత్మశక్తి గలవారనెడి విశ్వాసముతో కొంతమంది వీరిననుసరించెడివారు. అమ్మకూడ "సత్యాన్ని వదలిపెట్టకండి" అని అపుడపుడు చెప్పెడివారు. ఇపుడు అమ్మ అనుచరులు వీరిని అనుసరించుచుండిరి. సచ్చిదానందమూర్తి ది 4-10-2000న కాలం చేసినారు. వీరి అనుచరులు అటువంటి వారి కోసం అన్వేషణ చేయు చున్నారు.



# శ్రీ చిన్నమ్మ జీవితమందలి వృత్తి మార్పులు

1. దేవుని గూర్చి వుపదేశమునకు వెళ్ళు సమయమున అవన్నియు అసత్యములనియు, ★ విధియైన సత్యము, శాంతము, దయ, ధర్మము, ఓర్పు, జ్ఞానము, అపరిగ్రహము, అహింస అను గుణములతో నడచుటే తనను తెలుపు మార్గమనియు అమ్మకు తెలిసెను. తనను తెలుపు మార్గమే పరమాత్మను తెలుపు మార్గమని దృఢపడెను. తన దోషము తనకు తెలియనిచో పరమాత్మ తెలియబడదని తెలిసెను. (1911).

2. చింతకాయ మొదట గుల్ల, గుజ్జు, గింజ అంతయు ఒకటై యుండునట్లు చరాచర ప్రపంచములో అన్నియు తానై యుండును. చింతకాయ పండిన పిదప గుల్ల, గుజ్జు, గింజ వేరై నట్లు, సచ్చిదానందమూర్తి (ప్రథమ పుత్రుడు) పుట్టిన 21వ దినమున ఒక్కటియు నేను కాదను తెలివి తానై, తానువేరు, శరీరము వేరని తెలిసెను. తాను వేరైనపుడు శరీరముతో పనులుచేయు శక్తి లేకపోయెను. అన్నియు నేనను నపుడు యథాప్రకారం శరీరముతో పనులు చేసెను. (జూన్ 1911).

3. వెంకట్రామయ్య (ద్వితీయ పుత్రుడు) కు 8 మాసముల ప్రాయమున, అమ్మకు హఠాత్తుగా పరమాత్మ దర్శన మయ్యెను. ఆ సమయమున నామ రూపాత్మకమైన ప్రపంచము కనుపించక, మెఱపు చందమున పరమాత్మ దర్శన మయినది. పరమాత్మను దర్శించినది భావమనియు, భావాతీతము పరమాత్మయనియు దృఢపడెను. (1914).

4. శ్రీ రామమ్మ (పుత్రిక) జన్మించినపుడు అమ్మకు తండ్రి భావము వచ్చినది. ఆరు మాసముల తదుపరి వారిని తాక వచ్చిన భర్తకు తల్లిగా కనపడ, భర్త తాకలేకపోయెను. (1916)

5. శ్రీ రామమ్మకు 1సం॥ 6 నెలల వయసులో అందరికి తల్లిని కానట్లే యీ పిల్లలకు కూడ తల్లిని కానని తెలిసెను. ధనేషణ పోయి పనులు చేయుటకు చేయి రాక పోయెను. గడ్డి పోచ కూడ త్రుంచ లేకపోయెను. (1918)

6. నీళ్ళమీద నడచుటన ఎంత భయమో, భూమిమీద నడుచటన అంత భయము కలిగెను. కాళ్ళకు శక్తిలేక నడువ లేకపోయెను.

7. మాటకు పోటీగా మౌనము వచ్చెను. (1918 సెప్టెంబరు నుండి 1930 డిశంబరు వరకు). ఈ మౌనము సుమారు 12 సం॥లు. కాళ్ళకు నడచు శక్తి వచ్చెను.

8. అన్ని యిండ్లు తనవి కానట్లు ఒక యిల్లు సయితము తనది కాదని తెలిసెను. ఇంటినుండి వెడల గొట్టబడెను. (1918)

★ విధియన అహంకార కర్తృత్వములు లేనిది. ఇది ఆత్మ స్వరూపు లనబడు వారియందే యుండును.

9. ధనము తాక ప్రాణము గిల గిల కొట్టుకొనెను. (నల్లూరు పాలెం 1920)

10. అన్నము తిన జాలక ఫలహారములు చేసెను. (1923 మే నుండి 1930 డిశంబరు వరకు)

11. అభిమానము తానై శరీరమును స్త్రీ, పురుషులు చూడ వలను గాక పగటివేళ కూడ చీకటిలో నుండెను. పగలు దీపపు వెలుగున కనబడుట ; రాత్రులందు బయటకు రాగలుగుట (1924 నుండి 1927 వరకు ; తుదకు 13 దినములు నీరసము వచ్చి అభిమానము పోయెను. (23-11-1927).

12. నల్లూరు పాలెంలో 8 దినములు నీరసము వచ్చి వెంట్రుకలు అలంకారమని తెలిసెను. కొప్పుముడి విడిచి తిరుగుటకు వీలులేక వెంట్రుకలు తీయించెను. (డిశంబరు 1927).

13. మల విసర్జనమునకై బయటకు వెళ్ళినపు డొక సారి, "యీ అశుద్ధమును ఎవరికి పెట్టుదువని లోని ఆత్మ ప్రశ్నింపగా గుండె ఝల్లుమని అశుద్ధమును పూడ్చి పెట్టనారంభించెను.

14. భక్తులు, మిత్రులు, శత్రువులు సమానమని తెలిసి అనగా చూచుటకు, మాట్లాడుటకు వెళ్ళుట పక్షపాతమని తెలిసెను. వెళ్ళుటకు వీలుగాక మానెను. (1929).

15. అహింస తానై, అన్ని ప్రాణుల యొక్క హింసయు తానను భవించెను. హింసపడు ప్రాణులను తన ప్రాణముతో సమానముగా కాపాడెను. (1929 నుండి)

16. మూడు మాసముల నీరసము వచ్చి 12 సం॥ మౌనము విడచెను. అన్నము తినగలుగుట ; రుచికి తినవల్ల గాక ఆకలికి తినుట, (1930 సెప్టెంబరు నుండి డిశంబరు వరకు)

17. ఎచట నుందుమనినను మొదటి యిల్లు తనది కాదని వెడలగొట్టిన శక్తియే "అది నీది కానిది, యిది నీదా?" అని అచటి నుండి లేపుట ; ఈ విధముగా కొన్ని దినములు గడచిన తదుపరి, "ఇది కాకపోతే, అది నీదా? ఏది నీ స్థలము" ని ప్రశ్నించ, స్థలము కాన్పించక రెండడుగులలో నిలిపెను. (24-10-34 నుండి 28-2-35 వరకు). ఈ రోజులలో అమ్మను చేయిపట్టి లాగుకొని వెళ్ళెడివారు. లాగుట విడచినచో ఆ అడుగులోనే యుండెడివారు. ఇటువంటిదే చాతుర్మాస మన బడుచున్నది.

బంగారము మొదలగు లోహములను తాకినచో ప్రాణము గిల గిల కొట్టుకొనెడివారు. (కొంత కాలము)

18. పాపము పుణ్యములు లేనివాడు పరమాత్మయని తెలిసి, పాపము, పుణ్యము, నామము, రూపము, నిరూపించ కుండ నోరు మూయించెను. తనలో తాను మాట్లాడుకొనెను.

(1-3-1935 నుండి 14-1-1937 వరకు). రెండడుగులలో నిలచు నిర్బంధము పోయెను.

19. ఆకలి దప్పులు లేనివాడు పరమాత్మయని తెలిసెను. "ఆకలి దప్పులు లోకానివి, అన్నము, నీరు అడుగుటకు నీవెవరివి?" అని ప్రశ్నించగా అన్నము, నీరు అడుగుటకు హక్కులేక పోయెను. (4-9-1935 నుండి 14-1-1937 వరకు దగ్గరనున్నవారే వారి స్థితిని గుర్తించి ఆహారమును, మంచి నీటిని యిచ్చెడివారు.)

20. తప్పు, ఒప్పు తెలియును గాన కాళ్ళు తాకనీయ గూడదని తెలిసెను. (1937)

21. ఎవరిని గాని రమ్మనుటకు హక్కులేక పోయెను. భక్తుల హృదయములే నాధారమయ్యెను. వినెడి దోషముండుటచే రా అనేవారికి లోబడి, వారు రమ్మను చోటుకెల్ల వెళ్ళిరి. అనగా కార్య కారణములను స్వయముగా వివరించుకొని స్వశక్తితో యెచ్చటికిని పోవుటకు హక్కు లేకపోయెను. ఇది శబ్దమునకు గృహస్థ ధర్మము (1937).

22. మరల మౌనము వచ్చెను. లోపల నుండి వచ్చు జన్మ తరింపు మాటలను సంజ్ఞతో తెలిపి వ్రాయించిరి. (14-1-37 నుండి 5 సం॥లు).

23. ఎవరేని నమస్కారము చేసినపుడెల్ల, ఆ నమస్కారమును రూపించు యెరుకకది బాణమై, యిదివరకు యే భావము పరమాత్మను దర్శించినదో ఆ భావము పరమాత్మను దర్శించు చుండెడిది.

24. ఆకలికి గృహస్థ ధర్మము వచ్చినది. అనగా రోజు కొకసారి మాత్రమే భక్తులకు లోబడి తినెడివారు. తిని చేయి కడిగిన తదుపరి తినవలెనను తలంపు రాక ఆ రోజున మరల తినెడివారు కారు. (1937 వ్యాసాశ్రమం).

25. స్నానము చేయుటకు యిచ్ఛ లేక పోయినది. కార్య కారణము కనుపించక, స్నానము భోగమై కాన్పించి, అభిమానము వచ్చి స్నానము మానుకొనిరి. కడనున్న స్త్రీ తాను తాకక, తనను తాకనీయక యొదిగి యుండునట్లు, యిచ్ఛ అంటు వస్తువను భావము కలిగి, ఎవరిని అంటుకొనక, తనను అంటుకొననీయ కుండిరి. (11-1-1939 గోవాడ).

26. "గుడ్డ మాపు నీదియు, ఆ గుడ్డను వుతుకుటకు మరి యొకరునా? యన, ఆ గుడ్డను స్వయముగా వుతుకు కొనిరి (30-4-1939).

27. రూపమునకు గృహస్థ ధర్మము వచ్చెను. అనగా యింటి వెలుపల ఎవరిని గాని రూపించుటకు అభిమానము వచ్చి పగలు యింటిలోని వారిని మాత్రమే రూపించెడి వారు. ఎట్లన, భార్యా భర్తలు అభిమానము కలిగి రహస్య స్థలమున ఎట్లు అభిమానము

లేక వర్తింతురో, అటులనే పగటివేళ యింటి వెలుపల యెవరితోడను మాట్లాడక, యింటిలోపల మాత్రమే మాట్లాడేవారు. రాత్రులందు లోపల, వెలుపల అను భేదము లేక మాట్లాడెడి వారు. కొన్ని పనులు చేయుటకు చేతులు వచ్చెడివి. చేయగలుగు పనులను చేయుటయే గాని, యితరులతో చెప్పి చేయించరైరి. (17-9-1939).

28. నడచుటకు కాళ్లుండగా రైళ్ళు, కార్లు ఎక్కుట భోగమని తెలిసి కాలినడకను మాత్రమే యెక్కడికేని వెళ్ళెడి వారు. నదులు, కాలువలు దాటవలసి వచ్చినపుడు మాత్రము విధిలేక పడవనో, బల్లకట్టునో ఎక్కెడివారు. (6-4-1940).

29. ఆకారము, అందము యిచ్చుయని తెలిసి, పోయిన అలంకారములు పోగా మిగిలిన గుడ్డను వుతుకు కొనుటకు అభిమానము వచ్చెను. భర్త చనిపోయిన స్త్రీ, త్రెంచిపోయు సమయమున, తన అలంకారములు పోవుట తెలిసియు నగలు పెట్టుకొనుట యెట్లుండునో, గుడ్డ వుతుకు కొనుట అట్లుండునని తెలిసి వుతక లేకపోయిరి. (26-10-1940).

30. తన హీనస్థితి తెలిసి వాకిలి గల యిండ్లలోనికి వాకిలి ద్వారా వెళ్ళలేక పోయిరి.

31. చలికి యింకొక గుడ్డను అడుగలేకయు, యితరులు కప్పిన ఊరుకొనుటయు, ఆ కప్పిన గుడ్డను చెమట పట్టినను తీసి వేయజాలక పోవుటయు, చలి, ఉక్క యితరులే కనిపెట్టి బట్ట కప్పుటయో తీసివేయుటయో జరిగెడిది. రాత్రులం దధికముగా కప్పిన వస్త్రములను ఉదయమున తీసివేయ గలిగెడివారు. (16-10-1943) కోసూరు అంజయ్యగారి పాక, కోసూరుపాలెం).

32. ఎవరైన నమస్కారము చేసినచో విషయ రూపముగా నున్న తన స్థితి హీనమని తెలియుట చేత, ఆ మహా పూజ్యతను భరింపలేక పడిపోయి, చేతులు కాళ్ళు వంకరలు తిరిగిపోయి బాధపడెడివారు. (1943).

33. నమస్కారము కనబడకుండ నుండుటకై యితరులను నమస్కారములు చేయ వలదనుటకు మారుగా, తానే వారివంక చూడకొన్న మంచిదని తలవంచుకొని యుండిరి. నమస్కారము చేయువారిని ముఖాముఖిని చూడ మానుకొనిరి (26-2-1944 నుండి 16-10-1945 వరకు).

34. విరోధభావము లున్నవారి హృదయము నందాత్మ శక్తికి స్థానము లేదు గాన, అట్టి వారిడు ఆహారము నిష్ప్రయోజనముగ కాన్పించి, వారి యాహారమును తీసుకొనలేక పోయిరి (9-2-1945 బొబ్బర్లంక).

35. అన్ని లోకములు కనబడి వర్ణించిరి. 12-2-1945న నీరసములోనుండగా లోకములన్నియు కనబడుట. ప్రతిలోకమును చూచుచు వర్ణించుట; స్వర్గలోకమును

వర్ణించుచూ, ఆ మణికాంతుల యొక్క వైభవమును చూచి భరింపలేని ఆనందమనుభవించుట; తదుపరి కొంతసేపటికి ఆ భోగములనుభవించిన శక్తిపోవుట; శరీరము కదల్చలేక లేవలేకపోవుట.

36. సత్య శాంత దయాది గుణములకు శ్రాద్ధము చేయవలెనని మాలోని శక్తి పలికినదని అమ్మ తెలుప, అచట నున్నవారు అట్టి కర్మచేసి అమ్మ కాహార మిడిరి. (15-2-45).

37. తిరిగి హద్దులు వచ్చెను. విరోధులున్న వారిడు ఆహారము తీసుకొనక పోయిరి (16-2-1945).

38. శరీరమునకు గృహస్థధర్మము, పగలు బయట మనుష్యులు చూచుదురను భయముతో యింటిలో నుండెడి వారు. రాత్రివేళ బయట తిరిగెడివారు (9-10-1945 రేపల్లె).

39. తలవంచి మాట్లాడెడివారు. అనగా యితరుల దృష్టి తమ దృష్టి కలియుట కభిమానము వచ్చి మనుష్యుల ముఖములను చూడలేక క్రింది భాగమును చూడగలిగెడివారు (ప్రారంభం 20-2-1947 రేపల్లె బసవయ్యగారు వేయించిన పాక, క్రొత్తపేట ఆఖరు 23-1-1949 పులిగడ్డ).

40. స్వతంత్రించి మంచినీరు త్రాగుటకు కూడ హక్కు లేకపోయినది. దాహమును కనిపెట్టి మంచినీరు కూడ యితరులే యిచ్చెడివారు (1-8-1947).

41. అన్నము తినుటకు యిదివరకున్న 12 గం॥లు అను హద్దు లేకపోయెను (6-8-1947 దోనేపూడి). విరోధులున్న వారిడు ఆహారము కూడ తీసుకొనిరి.

42. రెండు దినముల కొకసారి భోజనము (3-1-1948 క్రొత్తపేట పాకలు).

43. గాంధీజీ కర్మనాడు భోజనములు చేయు సమయమున ప్రసాదముగ చూచునపుడు క్షణకాలము గాంధీ రూపయిరి. (12-2-1948 మోపర్రు).

44. పంచేంద్రియముల గృహస్థధర్మము పోయెను. "ఎవరి ధర్మానికి వాళ్ళు కర్తలా? బిచ్చగాళ్ళు కర్తలా? యని లోకేషణ యయిరి. పగలు బయటకు వచ్చి మాట్లాడిరి. ఆహార విషయములో ఇదివరకున్న హద్దులన్నియు తొలగిపోయెను. శివతాండవమును చూపించిరి. (6-9-1948) అవనిగడ్డ సమీపమున క్రొత్తపేట వద్ద పాకలు).

45. కన్నులు యోనులుగా కనబడెను. " మన ముఖము వుంటేనేగదా అద్దములో ప్రతిబింబము కనబడేది. అట్లే మన అసత్యముకే గదా యీ అసత్యపు లోకమంతయూ కనబడేది" అని యేడ్చి యేడ్చి, " యీ అసత్యపు ముఖమును మీరు చూడగూడదని ముఖముతోసహా ముసుగు వేసుకొని మాటలాడక యితరులను చూడలేదు (7-2-1948 పు గడ్డ ప్రాజెక్టు). మరల మరు రోజున కన్నులను యోనులుగా చూపిన భావము తగ్గి ముసుగును తీసివేసి అందరిని చూచిరి.

46. వినువారికి తెలియదని తెలిసి, ప్రజలతో మాటలాడేదానికి, మాటలాడని యెరుకతగిలి మాటలాడలేక పోయిరి (26-12-1948 నుండి 20-1-1949 వరకు).

47. " భక్తుల పాలిటి భాగ్యలక్ష్మి రావే!" యను శబ్దము అమ్మలో వినబడి, భక్తులకు లోబడేది వారిలోనున్నదని తెలిసి పులిగడ్డనుండి క్రొత్తపేట చావడివద్దకు వెళ్ళిరి (30-1-1949),

48. స్నానముచేసిన ఎట్లుండునోయని వేడినీళ్ళ స్నానము చేసిరి. కాని సుఖము కనుపించలేదు (8-4-1949 భీమవరం ప్రకృతి ఆశ్రమం).

49. నీరసం, ఎక్కడకు వెళ్ళేది కనబడలేదు (25-5-1949 పాలకోడేరు).

50. భిక్షుకత్వం వచ్చి తినవలెనని యుండినను ఎవరైనను తినుమనిన పదార్థమునే తినగలిగిరి. కాని అడుగ వీలు లేక బాధపడిరి ( 1952 ఫిబ్రవరి నెల, శాంతికుటీరం, పేటేరు).

51. " అచ్చటచ్చటా తిరిగేదానవు యిచటే వుండరాదా?" యన, శాంతికుటీరం తూర్పు వసారలో నుండిరి (17-4-1952 నుండి).

52. ఇచట వుండేదానవు అచటచట ఎందుకుండగూడద"న, తూర్పువసారానుండి వెళ్ళగొట్టబడిరి (23-2-1953 నుండి).

53. రంగాగారితో మాట్లాడిన యనంతరము మాట్లాడుటకు పెదవి లేవలేకపోయెను. (ఏప్రియల్ 1953 నుండి ఆగస్టు 1953 వరకు).

54. శాంతికుటీరం పడమటి సరిహద్దున ఉండిరి (సెప్టెంబరు 1953 నుండి 7-12-1956 వరకు).



# ఈ వ్రాతకు హేతువు

చదువు వారికి గాని, వినువారికి గాని తెలియుననుకొని ఈ మాటలు వ్రాయించినాము. వారికి తెలియవని మాకు తెలిసినచో మా మాటలు లేకపోవును. వారికి తెలియవని ఇప్పటికీ మాకు తెలియలేదు.

ఒకప్పుడు వ్రాయించక పోవుటయు, యిపుడు వ్రాయించుటయు ఏల యను శంకలు కలుగవచ్చును, ఇదివరకు మేము మాటలాడు చున్నపుడు, ఎవరైనను మా మాటలు వ్రాయదలచినచో, సంసార మెరుగని చిన్న బాలికకు వివాహము చేసి సంసారమునకు పంపుట ఎంత తప్పో, అంత తప్పుగా కనుపించెడిది.

1937లో మాకు నీరసము వచ్చి శబ్దము పైకి వినబడక, సౌంజ్ఞతో నామరూపమై జన్మ తరించు మాటలు మాలోపల అధికముగా కలుగు చుండెను. మాలోపలనుండి వచ్చు మాటలను ఎవరైనను వినినప్పటికిని, ఆ మాటలు విన్నవారి లోపలికి పోజాలవని మాకు తెలిసియు, వాటి ప్రేరణబాధ పడలేక, అవియు కూడ ఋణమేనని, మాది నిరాధారమైన త్రోవ గనుక, మాలోపల ఏది ధర్మమని తెలియునో అది నడచుటకు మాత్రమే హక్కు వున్నదేగాని, యితరులను రమ్మనుటకు హక్కు లేనందుచే, అపుడపుడు ఎవరైనా రావడము సంభవించినయెడల, వారిని బ్రతిమాలి, చదువులేకున్నను, శబ్దము రాకున్నను, సౌంజ్ఞతో, ముక్కు మాత్రము రూపించినట్లు వ్రాయించినాము. ఈ ముక్కు రూపమునుబట్టి ముఖమంతటి యాకారమును చదువు వారే రూపించుకొనవలసియున్నది.



# చేతార్థ సారమె (పాట)

1. చేతార్థ సారమె గీతా,

దాని ననుభవించుటె నవనీతా ।

చేతా గీతా మర్మమెరిగీ,

దేనిది దానికిడుడీ గుర్తెరిగీ॥

2. నే యిచ్చు మాయనని తెలియండీ,

యిక వచ్చు మాయ నంటకండీ

మాయ మర్మము నడత నెరిగీ,

యిక మాయ కందకుడీ గుర్తెరిగీ॥

3. మాది యనునది మీది గనుకా,

మీది మీ కివ్వడమే సరినడకా।

మీది మీ కిచ్చిన వెనుకా,

మాది యను మమతే లేదు గనుకా॥

4. మమత మాయమైన వెనుకా,

మనమనే మనసే లేదు గనుకా।

మనసు మాయమైన వెనుకా,

మన ఆత్మయే పరమాత్మ గనుకా॥

5. భక్తియనే ఎరుక పుట్టీ

ఖండ ఎరుకను కనిపెట్టీ।

చేత చేసిన గీత యౌను,

ఆ చేత గీతయే త్యాగమౌను।



# నేను అనేదే మాయ

**నేను** అనునది ఇచ్చు మాయ. అందన్నియు పొరలే. పలుకొక్కటియు లేదు. **నీవు** అనునది వచ్చుమాయ. అదిలోపలనే యుండి వెలుపల ప్రతిబింబించి గోచరించును. జన్మకర్మది గనుక, నీవు అనేది యున్నంతవరకు నేను; నాది యనునది నీదె గాన నీకు లోబడేదేనని వేరు చెప్పనేల? నాది, నేను అనబడేది యిచ్చుమాయ. నీది, నీవు అనబడేది వచ్చుమాయ. నీది, నీవు అనబడేది వెలుపల. నాది, నేను అనబడేది లోపల. జన్మ ఋణము తీర్చుటకు వచ్చినది గనుక, నీది, నీవు వస్తే పాపము. నాది, నేను యివ్వకపోతే పాపము. నేను అనబడేది లేకపోతే, నీవు అనబడేది లేకపోవును. నీవు అనబడేది లేకపోతే, నేను అనబడేది లేకపోవును. ఇవి ఎపుడు లేకపోవునో అపుడు లోకము లేకపోవును, మాయ మాయమగును. ఉండునది పరమాత్మ. అతడు నీవు, నేను లేనివాడు. సూర్యుడుండిన చీకటి ఎటుల లేకపోవునో, అట్లే పరమాత్మ యుండిన లోకమే లేకపోవును.

# సన్యాసి లక్షణము

అందరు స్త్రీలు తల్లులై ఒక స్త్రీయు భార్యగా కనబడనివాడును, నాదియను శబ్దము లేనివాడును, అన్నియిండ్లు తనవి కాకపోయినట్లే ఒక యిల్లూ తనది కాదని తెలిసిన వాడును, ఆయింటి నుండి వెడల గొట్టబడిన వాడగుటచే, యింకెచ్చటను తలదాచుకొనుటకైన తావులేనివాడును, ఆకలి దప్పులు తీర్చుకొన యిసుక రేణువంత ఆధారము లేనివాడును, అడుగు దీసి అడుగుబెట్ట హక్కులేనివాడును, శబ్దమే సంసారమై, ఎవ్వరు రమ్మనిన వారికి (రా అనే అక్షరమునకు) లోబడి వెళ్ళువాడును, విధికి లోబడి ప్రవర్తించువాడును, భక్తుల హృదయములో దాగినవాడును సన్యాసి యనబడును.

సన్యాసి ధనమును ముట్టజాలడు. ధర్మము చేయుటకు అచ్చుకొనడు. అతడు సర్వసంగ పరిత్యాగి గనుక శక్తిలేనివారికి ధర్మము చేయవలెననిన, తానశక్తుడుగా కనిపించును. చెట్టు విడచిన పక్షికి తలదాచుకొన తావు దొరకనైనా దొరక వచ్చును గాని విషయ రహితమయ్యేవరకు సన్యాసికి యెందును తల దాచుకొనుటకు ఆధారము దొరకదు.

సన్యాసి యన స్వయమాత్మ తెలిపిన మార్గదర్శి . సృష్టించు మాయను ఖండించువాడు. తన చేతిని తన నెత్తిమీద పెట్టుకొనుటే సన్యాసి లక్షణము. క్రయమును పొందినవారికి ఆ భూమి మీద యెంత హక్కు కలుగునో, అట్లే మాట సత్యమైన సన్యాసికి సత్యమైన నడత మీద అంత హక్కు కలుగును. సన్యాసి యన సత్యమైన నడత గలవాడు. కోరిక లేనివాడు, తృప్తుడు, సమర్థుడు. పాప పుణ్యములు రహితమయే వరకు విధివశముచే భక్తులకు దాసుడై సన్యాసి వర్తించును. కాని కర్తృత్వముండదు. ఏరు దాటుటకు తెప్పయెట్టిదో, సన్యాసికి జన్మరాహిత్యమునకు నిరాధారమైన త్రోవ అట్టిది.

సన్యాసి ఎత్తివేయదలచిన బేరగాని వంటివాడు. వ్యాపారమును ఎత్తి వేయదలచినవాడు ఉన్న సరుకును ఖర్చు పెట్టుచు క్రొత్త సరుకును ఎట్లుకొనడో, అట్లే సన్యాసి, లోకమును లోబరచుకొనునది లోకమేనని తెలిసి, దానిని లోబరచుకొనక, తనలోని లోకమును లోకమునకు లోబరచి, తాను లోకమునకు లోబడక వర్తించును.

సర్వ ప్రపంచమైన ప్రకృతి సన్యాసి నెప్పుడు విడచునో అప్పుడతడు సన్యాసియు కాడు. సంసారియు కాడు. అతడు సంగ రహితుడు. సంసారము, సన్యాసము లేనివాడు. లోకాతీతుడు. ఆకలిదప్పులను లక్ష్యపెట్టనివాడును, ప్రాణము మీద ఆశలేనివాడును, నిర్భయుడును, బాలోన్మత్త పిశాచ గుణములు గలిగినవాడును, సంగరహితుడును, వివేకమున సర్వమును మరచిన వాడును, పండైన సన్యాసి యగుటచే మోక్షార్హుడు.

# సన్యాసిశక్తి

సన్యాసి శక్తియన పరమాత్మను దర్శించిన ఆత్మశక్తి. సన్యాసిశక్తి చాల ప్రియమైనది. ధర్మమివ్వ వలను పడదు. సన్యాసి శక్తిని తీసుకొన నెవ్వరర్హులో వారికి సన్యాసి తన శక్తిని విడచి తాను శక్తి కతీతుడై బూతక్కిబొమ్మ యగును. లోకాతీతమునకు పోవు త్రోవ నిరాధారమైనది. అట్టి త్రోవను పోవుటకు సన్యాసిశక్తి యవసరముగాన, గృహస్థుడు భూమిని దున్ని విత్తనము పెట్టుతీరున భక్తుడు తన హృదయ భూమిలో సన్యాసిశక్తిని విత్తనముగా పెట్టుకొనును. భూమియందు పెట్టు విత్తనము తక్షణమే అనుభవించుటకు యెట్లు రాదో అట్లే సన్యాసికి చేసిన సేవాఫలము చేయగానే కనుపించదు. సన్యాసి శక్తి సత్య బీజములు . అవి మొలకలెత్తక మానవు. పరిపక్వమయిన పండును చెట్టు యెట్లు విడచునో, అట్లే సన్యాసిశక్తి పరిపక్వమయినదగుటచే సర్వప్రపంచ స్వరూపమయిన ప్రకృతి సన్యాసిని విడుచును. ప్రకృతి రూపమైన మాయ విడిచిన, సన్యాసి పండె. సన్యాసికి శరీరముపైన అశ లేకపోవుటే పండిపోవుట.

సన్యాసి యను పేరునకే విలువ కలదు. సన్యాసిశక్తి సామాన్యమైనది కాదు. నిప్పునకు కాల్చెడి గుణ మెటులుండునో, సన్యాసి శక్తికి ఖండించు గుణమటులుండును. క్రియకు ఎవరికైనను జన్మరాహిత్యము కావలయుననిన వారికి సన్యాసిశక్తి సంభవింప వలయును. సన్యాసి శక్తి ఎవరికి సంభవించునో, వారు సంసారమున వుండుమని యేడ్చినను వుండదు. ఏనుగు భుజించిన వెలగపండు గుజ్జు ఎట్లుమాయమగునో, అట్లే సన్యాసిశక్తి సంభవించిన యెడల సంసారము మాయమగును ( మాయ మాయమగును). సన్యాసిశక్తి ద్వంద్వ రహితమైనది. అట్టి శక్తి సంభవించుట కష్టము. ప్రేమ, మర్యాద, గౌరవము, యిచ్ఛకము మున్నగువానికి అది దొరకదు. ఇచ్ఛకు బంధింపబడని హేతువుచేత అది లోక ప్రజలకు హితవుగా కాన్పించదు.

కాని సన్యాసి సహవాసము మానవులకు కావలసి యుండునని మా కు ధృఢ నిశ్చయము. ఎందుచేత ననగా మేము అహింసయైనపుడు బొబ్బర్లంక చెరువులోని నీళ్ళు

ఎండిపోవు సమయమున చేపలను ఎత్తి కృష్ణానది నీటిలో పోయించునపుడు గ్రద్దలు, కొంగలు, కుక్కలు మొదలగు జీవులును అహింసయై వాటి సహజబుద్ధిని సయితము మాని చచ్చిన చేపలను గూడ ముట్టుకొనలేదు. ఈ ఫలము మాలోవున్న సన్యాసిశక్తిదని మాకు దృఢ నిశ్చయము. సన్యాసికి ఆహారము పెట్టిన ఫలము, సన్యాసికి సేవజేసిన ఫలము, నమస్కారము జేసిన ఫలము, తాను తిను ఆహారమును సన్యాసికి చూపించిన ప్రసాద ఫలము, సన్యాసి సాంగత్యఫలము అని యిపుడు మాకు స్వతస్సిద్ధముగానే కనబడుచున్నది.

# సన్యాసి సేవా మహిమ

దొంగకు మనసుండినను కర్మచేయనిచో ధనమెట్లు దొరకదో, అట్లే సన్యాసిమీద మనసుండినను, సేవ చేయక పోయిన భక్తులు కాజాలరు. " నీ హృదయముతో సహా నాకిచ్చి వేయుము." అని శ్రీకృష్ణుడర్జునునితో పలికినట్లు వింటుము. శ్రీకృష్ణుడట్లు చెప్పిన మాట సత్యమో, యసత్యమోగాని, సన్యాసికి మొదట హృదయముతో సహా యివ్వక పోయినను, కాయకసేవను, అన్నము నీరును యిచ్చుచుండిన క్రమముగా భక్తులు కాగలరు. ఈ రెండును యిచ్చినవారి హృదయములో సన్యాసికి దాగ స్థలముండును.

భిక్షగాడు ధనవంతుని ఆశ్రయించి తినురీతిగా, మనసు, మాట, చేత ఒకటిగా నడువలేనివారి జన్మరాహిత్యమునకు మార్గము సన్యాసి సేవాభక్తియే. హృదయభూమి క్షేత్రమని ఒప్పుకొనక తప్పదు. హృదయభూమి క్షేత్రమయినపుడు యింద్రియ విషయములనెడి విత్తనములను జల్లి సన్యాసికి సేవ చేయక ఎవరేని సన్యాసికి భక్తుడననుట ఎంత అధర్మమో యోచించి చూడుడు.

సన్యాసి యని అనుట భక్తికాదు. వినుట భక్తికాదు. అనుకొనుటయు భక్తికాదు. సన్యాసిశక్తి పరిశద్ధమైన దగుటచే అట్టివారికి భక్తితోచేసిన చేత భక్తియోగమనబడె. అట్టి భక్తినుండి వచ్చిన ఫలితము కర్మయై ఫలించుటచేత భక్తుడు మనసు, మాట, చేత ఒకటిగా నడచుటకు హేతువయ్యెను. అట్టి నడతనుబట్టి అది కర్మయోగ మనుటగలిగెను. అట్టి కర్మఋణము తీరి, " ఇదికాదు, ఇదికాదు," అనుచు జీవవృత్తుల నన్నిటిని క్రమ క్రమముగ ఖండించును గాన, అది జ్ఞానయోగమనబడెను. రాజు భిక్షమెత్తని రీతిగా, ఇంద్రియ విషయములు రహితమై, వృత్తి కనుపించక పోవుటచే దానికి రాజయోగమను పేరువచ్చెను. ఒక భక్తియోగమునకు వచ్చిన ఫలితమునే భక్తియోగముతోసహా నాలుగు యోగములనుటకు హేతువయ్యెను.

భిక్షమెత్తుకొని తినువాడెట్లు రాజనబడడో అట్లే ఇంద్రియ వృత్తులకు లోబడు నడత రాజయోగ మనబడదు. సన్యాస భావము గలవారికి సేవచేయుటం బట్టి దానిని భక్తియోగమన వచ్చును. కాని సన్యాసము యిచ్చి పుచ్చుకొనువస్తువు కాకపోవుటచే పుచ్చుకొను సన్యాసము సన్యాసము కాదు. భక్తియును కాదు.

భక్తియనగా ఎంత గొప్పదోగాని శ్రీకృష్ణుని తూచుటకు రుక్మిణి చేతి తులసి దళము చాలెనట. అది భక్తి నుండి వచ్చిన ఫలమే. భక్తియనగా అనుటకాదు, వినుటకాదు. అనుకొనుటయు కాదు. తెలిసికొనుట కాదు, తెలియుట. తెలియుటే అగుట. అగుటే నడచుట.

# ఇచ్చిపుచ్చుకొను సన్యాసము

పెద్దలందరు కూడి తమ అబ్బాయికి బంగారయ్య అను పేరు పెట్టినను బంగారమెట్లురాదో పుచ్చుకొనిన సన్యాసమునకు సన్యాసిఫలమట్లురాదు. సన్యాసమట్లు ఇచ్చిపుచ్చుకొను వస్తువుకాదు. ఇచ్చిపుచ్చుకొను సన్యాసము మనలను తినివేయునని స్వతస్సిద్ధముగానే చెప్పవచ్చును. కర్మతో రావలసిన సన్యాసమును ఎవరి వలననో పుచ్చుకొంటి ననుట వట్టి తంత్రమే. అట్టి తంత్రమెట్లు పుట్టినదో, భక్తులిచ్చు దానిని దాచుకొని తిను మాయయు అట్లే సంభవించినది. సన్యాసిననుచు భక్తులకు లోబడి, వారిచ్చుదానిని దాచుకొని తిను వృత్తియంతయు పొట్టనింపుకొను తంత్రమేగాని సత్యముకాదు. జిహ్వా పతివ్రత కానందున దాచుకొని తినుట తటస్థించుచున్నది. అట్లు దాచుకొని తినుచో, బ్రహ్మాండ స్వరూపియగు మాయ, అణు స్వరూపియగు నరుని విడువదు. నరుడే మాయను విడుతు ననినను మాయ వానిని విడువదు. నిరాధారమైన త్రోవలో ఆధారముంచుకొనుట ఎంత యధర్మమో యోచించి చూడుడు.

సన్యాసి ధనమును ముట్టజాలడు. ధర్మము చేయజాలడు. ధనము విడిచిన సన్యాసి మరల ధనమునుపట్టి ధర్మము చేసిన యెడల, అందువలన వచ్చు లాభ నష్టములు ఎందునను సన్యాసిని బంధింపక మానవు. అప్పుతెచ్చి బేరమాడిన బేరగాడు లాభము వచ్చిన ధనవంతుడైనట్లును, లేక దండుగ వచ్చిన దివాలా పాలైనట్లును, సన్యాసి ఎటులైనను పడిపోవును.

# నిష్కామకర్మ

చెట్టునకు వేరు పురుగెట్టిదో, కామమునకు నిష్కామభావ మట్టిది. నిష్కామ భావమున్న కామ్య భావము లేకపోవును. కామము లేకపోవుటే నిష్కామము యొక్క స్వభావము.

కర్మ తీర్చుకొన వచ్చిన నిష్కామికి శరీర రూపేణాలోక ఋణము తీర్చుటయేగాని, యాచించి ధర్మము చేయుటకు ఏ విధమైన హక్కునులేదు.

ఏ వృత్తిని కాదనునో ఆ వృత్తి లేనివాడే నిష్కామి. కామమును ఖండించునది నిష్కామమగుటచే సర్వప్రపంచము నిష్కామికి అసత్యముగా కనుపడి ప్రపంచములో వాని కాధారము లేక పోవును. నిష్కాముడు నాది అని యనుకొనుటకు అధారము లేనివాడగుటచే, నేను అనునది నీది, అనగా ప్రకృతిది యని, నేను అనే ప్రకృతి యున్నంతవరకు తన జన్మ

కర్మదేనని తెలిసినవాడగుటచే, స్థానము లేనివాడై, పంచేంద్రియములలో దేనికి ఎప్పటికేది విధియో ఆ వృత్తి చేయుచు, మరల ఆ కర్మకు తాను కర్తగాక వర్తించును. ఋణము తీర్చువాడు ఎవరి ఋణమును వారికి తీర్చుచు, " నేను లోకోపకారిని" అని ఎట్లనడో, అట్లే నిష్కాముడు దేని ఋణము దానికి తీర్చి, " నేను నిష్కామకర్మ చేయు చున్నాను" అని యనడు.

నిష్కామ భావము పరమాత్మను దర్శించిన ఆత్మ స్వరూపు లనబడువారి యందే యున్నది. అట్టి నిష్కామభావము రాని హేతువు చేత, " సన్యాసము పుచ్చుకొంటిని" అని యనుటకు కారణము కనుపించుచున్నది. అటుల సన్యాసము పుచ్చుకొనునది యిచ్ఛయగుటచే ఆ సన్యాసము పుచ్చుకొనిన వానిని యిచ్ఛ విడువదు. ఇచ్ఛాశక్తి విడువని కారణముచేత, నిష్కామకర్మ చేయుచున్నా ననుకొని చేసిన కర్మయు నిష్కామ కర్మ కాజాలదు. ఎట్లన గృహస్థుడు కట్టుకొనిన గృహము ఆ గృహస్థునెట్లు పిలుచునో, అట్లే సన్యాసము పుచ్చుకొనినవాడు ఆశ్రయించి తెచ్చి, ఒక ఆశ్రమమును కట్టి, అక్కడ కర్మచేసినచో ఆకర్మయే కర్తయై వానిని పిలుచునో, పిలువదో యోచించి చూడుడు. తాను అచ్చుకునే కర్తృత్వము వాని కెపుడుండునో, అనుభవించే కర్మ అపుడే యుండును. ఏ స్థానములేని నిష్కామికి ఒకరిని ఆశ్రయించుట, ధనమును యాచించుట, దానితో నొకచోట ఆశ్రమమును నిర్మించుట, అచట ధర్మము చేయుట ఆధారము లేని నిష్కామికి ఎటుల ధర్మమో యోచించి చూడుడు. కర్మతీర్చుకొనుటకు వచ్చిన నిష్కామి, జన్మ రహితపరచు కొనునేగాని దేనిని అచ్చుకొనడు. ఇచ్ఛ విషయము గనుక వానిలోనున్న విషయమును నిష్కామ భావము ముట్టుకున్నచో, వాని ఇచ్ఛ విలపించి దానంతటదియే విడచి పోవును. ఒకే వస్తువునకు రెండు పేర్లు ఎట్లుండునో, అటులే యిచ్ఛారహితునకు నిష్కామి యనియు, సన్యాసి యనియు పేర్లుండును.

## లక్షణ భక్తుడు

జీవుడు, తన కర్మయే తన జనన మరణములకు కారణ మనుమాట మరచి, విధి నెరుగక, యిచ్ఛకు లోబడి కర్మలు చేయును. జీవుడు చేసిన కర్మలకు అనుగుణ్యమైన జన్మలకు ఆ జీవుని తీసుకొనిపోయి, ఆ కర్మ ఫలితమును ఆ జీవునిచే అనుభవింప జేయువాడు జీవేశ్వరుడు. జీవుడు బంధింపబడు వాడనియు, ఏ ఆత్మ పరమాత్మను దర్శించినదో ఆ ఆత్మయే జీవుని ఖండించునదనియు, లక్షణ భక్తుడు తెలుసుకుని తన జీవవృత్తులను క్రమక్రమముగా మానుకొని అట్టి యాత్మను సంపాదించుకొనును.

ఏ ఆత్మ పరమాత్మను దర్శించినదో, ఆ ఆత్మయే, "ఇది కాదు, ఇదికాదు" అనుచు క్రమక్రమముగా జీవ గుణములన్నింటిని ఖండించును గాన ఖండ పరిపూర్ణమనియు అజ్ఞానమును త్యజించును గాన జ్ఞానమనియు, అసత్య ప్రపంచమును త్యజించునుగాన సత్యమనియు మరియు వైరాగ్యమనియు, త్యాగమనియు, సన్యాస మనియు ఆ ఒక్క యాత్మకే

లక్షణ భక్తుడు ఆత్మను కనిపెట్టిన వాడగుటంబట్టి, ఆ యాత్మశక్తిని సంపాదించు నిమిత్తమే అట్టి ఆత్మగల శరీరమును పోషించును గాని, ఆ శరీరమందలి ఆకలి దప్పులుగల ఎరుక కొరకైగాదు. ఆత్మ వాక్కుల కతీతమైన పరమాత్మను దర్శించునది గాన, ఆ యాత్మ కొరకే ఆత్మశక్తిగల వ్యక్తిని సేవించును. కాని వాని వాక్కులకొరకు కాదు. ఆత్మ జనన మరణములను పొందు జీవ భ్రాంతి (జీవత్వము) లేనిదిగాన అట్టి యాత్మకొరకే లక్షణ భక్తుడు ఆత్మశక్తిగల వ్యక్తిని సేవించును.

"నన్ను ఎరుగని వాడు నన్ను ఎరుగనే ఎరుగడు. నన్ను ఎరిగినవాడు ఎన్నడును నన్ను విడువనే విడువడు." అని శ్రీకృష్ణుడర్జునునితో అన్నమాట సత్యమో యసత్యమోగాని, ఆత్మను ఎరిగిన లక్షణ భక్తుడు తన ప్రాణమునైనను విడువ వచ్చును గాని, తాను కనిపెట్టిన ఆత్మశక్తిగల వ్యక్తిని విడువడు.

తనకు పిత్రార్జిత ముండిన యెడల దుర్వినియోగముచేయక, దానిని కూడ తాను కనిపెట్టిన ఆత్మగల శరీరపోషణకే విధిగా వినియోగపరచును. ఆత్మశక్తియొక్క పాత్రత నెరిగిన వాడు అపాత్రదానము చేయడు.

తనకు పిత్రార్జితము లేనియెడల అపరిగ్రహమును కాపాడుకొను నిమిత్తము ఆస్థిని సంపాదించుట కొరకు ఆత్మశక్తి గల వ్యక్తిని విడిచి వెళ్ళడు. అవసరమైనంతవరకు పరిగ్రహించి వానిని పోషించుచూ తానును జీవించును. కాని దాచుకొని తినడు. చేతయే గీత గనుక తాను ధృఢభక్తిచే వానికి సేవ చేయు వాడగుటంబట్టి తాను కూడ ఆత్మశక్తి గలవాడనబడ గలడు.

తనలో ప్రకృతిని కావలెనను యెరుకను కాదనువాడును, ప్రకృతిని కాదను యెరుకను కావలెననువాడును లక్షణ భక్తుడు.

## జపతపములు

ఆకలి తీర్చుటకు ధాన్యాదులెట్టివో జన్మ రహితపరచుటకు ఆత్మ అట్టిది. మల్లి, మందార, సంపెంగ, గులాబి, మొదలగు పూవులు కంటికింపుగా నుండునేగాని ఆకలిని దీర్చజాలవు. అట్లే పూజలు, ధ్యానములు, జపములు, తపములు, భజనలు, పారాయణలు మొదలగునవి వినోదముగనుండి యిచ్ఛను పెంచి, జీవుని బంధించునేగాని జన్మరహిత పరుపజాలవు. ఖండింపబడవలసిన భ్రాంతి యిట్లు కోరికలను పెంచునపుడు ఆ భ్రాంతిరహిత పడుట యెట్లో యోచించి చూడుడు. ఆకలి తీర్చజాలని పుష్పజాతులు లోకములో యెట్లున్నవో, జన్మరహిత పరుపజాలని జపములు, తపములు, భజనలు, పూజలు మొదలగు వానిని చేయు భ్రాంతులును అట్లే యున్నవి. తెచ్చు కొనవలెనను భ్రాంతి ఎపుడు లేక పోవునో (రహితమగునో) విధికి లోబడి నడచు యెరుక అపుడు సంభవించును. విధికి లోబడి

నడచుటే లోక ఋణము తీర్చుట. లోక ఋణము ఎపుడు తీరునో అపుడే వృత్తి రహిత మగును. అన్ని వృత్తుల రహితమే జన్మ రాహిత్యము.

## కర్తవ్యము

మానవ జన్మ మంచి జన్మ. నీలో ఆత్మ యున్న అదియే నీ రక్షణకును కారణమగును. అది సత్యము, శాంతము, దయ, ధర్మము, ఓర్పు, జ్ఞానము, అపరిగ్రహము, అహింస అను గుణములతో విధిగా నిన్ను నడుపును. అట్లు నడువగా స్త్రీకి భర్తయొక్క ఋణముతీరి తన భర్తయే తండ్రిగా కనబడును. తనకట్టి తండ్రి భావము యెపుడు వచ్చునో అపుడే తాను కూడా తన భర్తకు తల్లిగా కనబడును. తన పిల్లల ఋణము తీరు నెడల తన మమత పోయి, అందరి పిల్లలకు తాను తల్లి కానట్లు తన పిల్లలకు కూడ తాను తల్లిని కానని తెలియును. ఇట్లే పురుషుని విషయములో కూడ.

పై హద్దులలో నడచిన ధనమును తాకు హక్కు లేక పోవును. ధనమును తాకిన గిలగిల కొట్టుకొందువు. ధర్ముడు వైరాగ్యుడగును. కాబట్టి పుణ్యఫలము కూడ పాప ఫలముతో సమానమే నని తెలిసి ధర్మకార్యములకును అచ్చుకొనవు. ఇట్లే అన్ని యింద్రియ విషయములు వాటి విధులలో నడచి, ఋణము తీరి అన్ని విషయములు లేకపోవును. అన్ని వృత్తులను రహిత పరచి చివరకు ఆ శక్తి కూడ నిన్ను విడచి పోవును. శక్తి కతీతుడు పరమాత్మ.

నీలో ఆత్మశక్తి లేనియెడ "ఇది కాదు ఇది కాదు" అనుచు జీవ వృత్తులన్నింటిని క్రమక్రమముగా ఖండించు ఆత్మశక్తి యెవరిలో వున్నదో వెదకుము. వెదకిన దొరకును, భక్తితో దానిని సంపాదించుము. ఆ చేతయే గీతయై నిన్ను నడుపును. అంతేగాని, బుద్ధిహీనుడవై. " దేవుడా! నన్ను రక్షింపుము" అని ప్రార్థించిన ఏమి ఫలము? అవి యన్నియు భ్రాంతి చేష్టలేగదా! నిన్ను రక్షించుటకు పరమాత్మ లంచగొండియు, పక్షపాతియు కాడు. పరమాత్మకు నీవు లేవు. నిన్ను ఎరుగడు. "అమ్మా!" అన్ననోట, నోటికి రాగూడని "నీయమ్మా!" యని కఠినముగా మాట్లాడుట యెట్లుండునో, గుణరహితుడు పరమాత్మయని అంటూనే " నన్ను రక్షింపుమని," రక్షించే గుణమును, గుణరహితుడైన పరమాత్మకు ఆపాదించుట అటులే యుండును. పరమాత్మను లంచగొండిగాను, పక్షపాతిగాను యెంచితివా, ఆ నీ యజ్ఞానమే నిన్ను బంధించును. పై వన్నియు కాల హరణమునకు మూలమై నీ ఆయువును హరించును సుమా !

కర్త పెద్దవాడైన మానవ జన్మలో, కర్త చెప్పినట్లు నడువలేక పోయియూ, నడుపు శక్తిని (ఎరుకను) సంపాందించుకొనలేక పోయియూ, ముందు రాబోవు దుస్థితిని మరచిపోయినచో ఏమి కాబోదువో యోచించు కొనుము. చేతయే గీత యనుమాట సత్యము. చేతను విమర్శించి నడువుము.

# విగ్రహ పూజ

కర్మకు కారణము జన్మ. మరియు జన్మకు కారణము కర్మ. ఈరెంటికిని హేతువైనది మాయాశక్తి. మాయను ఖండించునది ఆత్మ.

విత్తనము లేనిదే చెట్టును సృష్టించ జాలము. ఏ రకము విత్తనము ఆ రకము చెట్టునుండియే సంపాదించవలయును గాని చెట్టు బొమ్మలనుండి మనమా విత్తనమును సంపాదించలేము. లేదా స్వయముగా సృష్టించలేము. అట్లే ఆత్మశక్తిని కూడ పరమాత్మను దర్శించిన ఆత్మశక్తిగల వారినుండియే సంపాదించవలయును. చెట్టు బొమ్మలనుండి విత్తనము, ఆవు బొమ్మలనుండి పాలు, మనుష్యుల బొమ్మలనుండి శక్తిని సంపాదించ జాలము. ఆవు బొమ్మ మనము వేసిన మేత తినజాలదు. పోసిన నీరు త్రాగలేదు. మనకు పాలు యివ్వనూలేదు. అట్లే విగ్రహముల ముందు మనము పెట్టిన ఫలహారములు అవి తినలేవు. వాటినుండి మనము ఆత్మశక్తిని సంపాదించలేము. శ్రీకృష్ణుడు, బుద్ధుడు, క్రీస్తు మున్నగు వారు కూడ వారు శరీర ధారులై యున్నపుడు "మమ్ములనే సేవించండి. మమ్ములనే అనుసరించండి." అని వారి దగ్గరనున్న వారితో చెప్పినట్లు విందుముగాని, తమకు ముందు అవతార పురుషులనబడే రాముడు మున్నగువారి విగ్రహములనుగాని, వారి ఫోటోలను గాని, లేదా తమ విగ్రహములను గాని తమ ఫోటోలను గాని పూజించమని చెప్పినట్లు విని యుండలేదు. అట్లే యిపుడు ఎవరిలో పరమాత్మను దర్శించిన ఆత్మ యున్నదో వారినుండియే అట్టి ఆత్మను సంపాదించవలయును.

పాపపుణ్యములు రెండును శరీరము ధరించియున్న జీవులను హింసపెట్టియో లేక సుఖ పెట్టియో సంపాదించుకొందుము. ప్రాణముగల మనుష్యులను గాని, యితర జీవులను గాని హింస పెట్టినచో పాపము వచ్చును అనగా కష్టము వచ్చును. సుఖపెట్టినచో పుణ్యము అనగా సుఖము వచ్చును. కాని వారి పటములను చింపి వేసినను, విగ్రహములను చెడగొట్టినను పాపము రాదు. అటులే వాటిని పూజించినను పుణ్యము రాదు. ఏ జీవినైన మనము హింసపెట్టినను, సుఖపెట్టినను, ఆయా కర్మఫలములనే అనుభవించెదము.

భర్త భావము వచ్చిన స్త్రీ, పురుషుని బొమ్మతో తృప్తి పడక ఒక పురుషుని తన భర్తగా చేసుకొని, తన తల్లిదండ్రులను, అన్నదమ్ములను విడచి ఆ భర్త నెట్లు అనుసరించునో, అట్లే నిజమైన భక్తి ఎవరి యందుండునో, వారు విగ్రహ పూజలతోను, భజనలు, పారాయణలు మొదలగు వానిని చేయక, పరమాత్మను దర్శించిన ఆత్మ ఎవరి యందున్నదో వారిని వెదకి, కాలము వ్యర్థము చేయక, వారిని సేవాభక్తితో అనుసరించి వారియందున్న ఆత్మశక్తి నార్జించెదరు. అదియే పరమాత్మను దర్శించును.

కుక్కకు తాను కక్కిన వస్తువు హితమైన రీతిగా తాను చేసిన విగ్రహము తనకు దేవుడాయె. తాను చేసిన విగ్రహము తనకు దేవుడు కాదు. చేసేది మాయ యైనపుడు చేసిన విగ్రహము మాయగాక దేవుడెట్లగును? కాని తాను చేసిన సత్యాచరణయే తనకు దేవుడైనపుడు, తాను చేయుచున్న అసత్యపు నడతలు తనకు యముడుగాక మానవు. మానవునకు కక్కిన వస్తువు ఎట్లు హితవు కాదో అట్లే విషయ రహితునకు విషయము హితవు కాదు. మరియు పరమాత్మను దర్శించిన ఆత్మశక్తి గలవారికి గాని, అట్టి యాత్మశక్తి గలవారి నెరిగిన భక్తునికి గాని విగ్రహ పూజ హితవు కాదు.

"పరమాత్మ పంచభూత రహితుడు. సూదిమొన మోప సందులేని వాడు," అని ఒప్పుకొనియు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులతో ఆనందపడే పని వాని కారోపించి, జప, తప పూజాదులు చేయుట కాలము వ్యర్థము చేసుకొనుటే గాని పరమాత్మను దర్శించు మార్గము కాదు.

# మనసును బట్టుట

పిల్లల రొట్టె తగవునందు కోతి తూచి తినునట్లుగా; మాయ, జప, తప, నిష్ఠలనెడి ఆశలను పెట్టి మన ఆచరణను తినివేయును. తాబేలుయొక్క అవయవములు లోపలికి వెలుపలికి తిరుగుచున్నవే గాని అవి తరుగవు. అటులనే ఇంద్రియ వృత్తులు లోపలికి వెలుపలకు తిరుగుచున్నవే గాని తరుగుట లేదు. అవి తరుగు నెడల మాయ లేకపోవును.

మాయ మన ఆయువును తినివేయు చున్నదని తెలియ లేకున్నాము. మాయ, సృష్టి, అసత్యము అను మూడును ఒకటియే. ఇవి అర్థము లేనివి గనుక నరుడు తానెవ్వరో తెలియవలయును. తాను ఆడే మాటలు యేమిటి? ఎచట నుండి వచ్చుచున్నవి? తాను అనగా యెవరు? తనను తెలుపు వస్తువు యేది? అనుచూ విమర్శించి చూచుచూ తన లోపల నుండి మాటలాడునదియే ఆ తానని గ్రహించి నడువగా, తనను తెలుపు వస్తువు తన నడతయే యగును.

రంగు చీరెకు రంగు పోవలెనని దానిని పెట్టెలో పెట్టినను, దాని రంగు యెట్లు పోదో, అట్లే అసత్యమను మాయ తానే జన్మకు వచ్చినది గనుక, తానెంత నిష్ఠతో నుండినను స్థానపు మార్పుల వలన తరుగదు. ఆ చీరె వుతికిన కొలది రంగు నిలువలేక తరిగి పోవునట్లు, సత్యముగా నడచినచో, అసత్యమగు మాయ నిలువలేక మాయమగును. ఎప్పటికెంత మాయయుండునో, అప్పటికంత మాయనే నీతి సత్యములు హద్దులో పెట్టును. ఇట్లు మాయయంతయు మాయమై పోవునపుడు నీతి సత్యములు పనిలేనివై అంతరించును.

మన సాధనలన్నియును మాయలోనివే. మనసును పట్టవలయుననుసాధనయు యిన్ని పేర్లతో లక్షణ భక్తుడు వ్యవహరించును.

మాయయే. మనసును పట్టుట యెపుడుండునో, విడచి పెట్టుటయు అపుడే యుండును. మనసును పట్ట వలయునంటే మనము మాటను బట్టి నడువ వలయును. మాటను బట్టి నడుపునవి నీతి, సత్యములు. అవి ఆత్మయున్న వారి యందే యుండును. అట్టి ఆత్మ నార్జించినచో నీతి సత్యములు గలవారై మాటను బట్టి నడువ గలరు. మనసు, మాట, చేత ఒకటియైనచో అది మాయను, మనను కూడ పట్టును. అపుడు మనసు (మాయ) మాయమగును. ఉండునది పరమాత్మ.

భక్తి, జ్ఞాన, వైరాగ్యములు మనను పట్టనంత వరకు మనము మనసును పట్టుకొన్నామనుట తప్పు. ఎందుచేతననగా ఏ చెట్టులోని పూవు వాసన ఆ చెట్టునెట్లు పట్టుకొనునో, అట్లే మాయలో భక్తి, జ్ఞాన, వైరాగ్యములున్నచో, అవి ఆ మాయను పట్టుకొనును.

# గీతాపారాయణ

గీతా పారాయణము చేయుట మనకు గీత (ముక్తికి హేతువైన కర్మ) కాదు. ఇచ్ఛకము, మర్యాద, గౌరవము అనెడి భిన్న భిన్న ప్రేమలకు లోబడని చేతయే సరియైన గీత. నేను, నాది అనుదానిని "ఇది కాదు, ఇది కాదు" అని తేట తెల్లముగా జూపి లేనిది లేకుండా చేయునదే భగవద్గీత. సూర్యునకు చీకటి ఎట్లు లేదో, భగవద్గీతకు ప్రకృతి అట్లు లేదు. ప్రకృతి సంగమును ఖండించునదే భగవద్గీత. మనకు విరోధి యగు యిచ్ఛను ఖండించునదే భగవద్గీత. అదియే పరమాత్మను దర్శించిన ఆత్మ.

# దేవుడు బాధ్యత లేనివాడు

మనము తెలియక వ్రాయు పొరపాటునకు వెలుతురున కెట్లు బాధ్యతలేదో, అట్లే రక్షింపుమని ఎన్నిపూజలు చేసినను దేవునకు బాధ్యతలేదు. మన వ్రాత పొరపాటులను దిద్దుటకు జాగ్రత్త యెట్లవసరమో, మన మనో దోషములను తొలగించుటకు సత్యమైన నడత (ఆత్మ) అట్లవసరము.

దేవుడు నిష్క్రియుడు. పుణ్య పాపములకు, సృష్టి లయములకు కర్తగాడు. ఇది తెలిసిన వారు పుణ్య పాపములకు, సృష్టి లయములకు దూరులై పరమాత్మను దర్శించెదరు. పుణ్య పాపములకు, సృష్టి లయములకు దేవుడు కర్తయని భావించు వారి మాయ మాయము కాదు. వారు మరల మరల జన్మకు రావలసియే యుందురు. శుద్ధ హృదయమే రాముడు లేక ఖండయెరుక. ఆ యెరుక కల్మషములను ఖండించునే గాని కలుపు కొనదు. అట్టి యెరుకను సంపాదించు కొనిన చాలును. అదియే జాగ్రత్తగా నడుపును. దేవుడు కావలెననుచు మనము కర్తృత్వము పూని క్రొత్త అప్పు తెచ్చుకొంటిమా, లాభము లేకపోగా దండుగ పాలగుదుము.

# అర్థమెరుగని భజనలు

"ఇతర మెరుగనయ్యా! నాగతి నీవే రామయ్యా!" అని పాడుదురు గదా! ఇతర మెరుగ నన్నమాట ఎంత యసత్యమో చూడుడు. ఇతర మెరుగ నన్నమాట సత్యమైనచో యే రాముడో గతికాడు. రాముడవు నీవే. మన మనునది మాయ. మాయ తాను పనులు చేయు సమయమున ఆనందపడును. ఆనందపడు సమయములో రామా, రామా యనదు.

మాయ యిచ్ఛ గనుక, ఆ మాయ యిచ్ఛ యొక్క ఆనందములో రామా, రామా యనినను అది సత్యమై రామా, రామా యనుట కానేరదు. మాయ తన నడకకు భిన్నము కలిగినపుడే రామా, రామా యనును. ఎట్లన రోగి కషాయము త్రాగవలసి వచ్చినపుడు యిష్టము లేకపోవుటచే "రామ! రామ! ఈ మందు నేను త్రాగలేను" అనును. కాని రుచికి తీపి పదార్థము తినునపుడు మాత్రము అట్లనుట జరుగదు. మనము యిచ్ఛకు లోబడి ఆనందపడు పనియంతయు అనర్థకరమే. మన మనునదే మాయ యైనపుడు మనమా మాయను పట్టుకొనవలె ననుటయు మాయయే కదా! ఇది యెట్లున్నదన చీకటిని చీకటి పట్టుకొనుననుట. అది సత్యము కాదు.

లోకములో ఎన్నిరకముల చెట్లున్నవో, మనలో అన్ని రకముల శ క్తులే గుణములుగా వున్నవి. వెలుపలి ప్రకృతిని <u>రా</u> అని కలుపుకొన్న అది రామశక్తి కాజాలదు. రామశక్తి యెవరిలో నుండునో, అది వెలుపలి ప్రకృతిని తీసుకొనక, వారి లోపలి ప్రకృతిని వెలుపలికి విడచును. దిన దినము ఆ విడచుపని కనపడదు కాని, వృత్తులు రహితమగు చున్నపుడు ఆ పని కనపడును. కాబట్టి రామశక్తి యెవరిలో నుండునో ఆ శక్తిని మనము యేరుకొని తీసుకొనవలయును. భక్తియే ఆ శక్తిని గుర్తించ గలదు. శక్తిలేని బొమ్మలకు పూజ చేసినచో ఆ శక్తి మనకు రాదని తెలియవలెను.

సృష్టిశక్తికి పోటీగా సృష్టిని ఖండించుశక్తి యున్నది. సృష్టి శక్తి సీత యనియు, సృష్టిని ఖండించుశక్తి రామశక్తి యనియు పూర్వమే వక్కాణింపబడి యున్నది. శరీరమునకు జ్వరము తగిలినచో, రుచి చూచే దానికి తీపి చేదుగా కనుపించునట్లు మన గుణమును బట్టియే మనకేదేని కనిపించును గాని వాస్తవము కనుపించదు. సముద్రపు వుప్పు నీటిలో కలియునట్లుగా, మన గుణములను బట్టియే దేనినేని మనము కలుపు కొనుచుందుమని తెలిసిన యెడల, ఆ తెలిసినంత వరకు మాయ మనను బాధించక అంతరించి పోవును. అంతా పరమాత్మ యని తెలిసినచో, ప్రపంచ రూపమైన ప్రకృతి అంతరించి పోవును.

# తక్కువేమి మనకు? (పాట)

అన్న ధర్మరాజు అంగిటనున్న,
తక్కువేమి మనకు మన మెక్కడున్న నేమి?

న్యాయము తప్పని భీమసేను బిరుదున్న,
తక్కువేమి మనకు మన మెక్కడున్న నేమి?

ఆచరణంబను అర్జునుండాదు కొన్న.
తక్కువేమి మనకు మన మెక్కడున్న నేమి?

సత్సంగంబను నకుల సహదేవులు సహాయమైన,
తక్కువేమి మనకు మన మెక్కడున్న నేమి?

కృష్ణ భక్తిగల ద్రౌపది యున్న
తక్కువేమి మనకు మన మెక్కడున్న నేమి?

సన్యాసి శక్తిని సంపాదించిన,
తక్కువేమి మనకు మన మెక్కడున్న నేమి?

తాను అనిన మాటయే ధర్మరాజు. ఆచరణాదులే తమ్ములు. నవ్వుల కైనను అసత్యమాడక చూడుడు. ఆచరణ తనను విడిచేవరకు, తాను దానిని విడువ కుండుటే భీమునిపట్టు.

# మహావాక్యము

మాయ యొక్క అణు స్వరూపులమైన మనము మన మనసుతో, మాటలతో, మంత్రములతో మాయను పట్టవలయు ననుట కల్ల. ఆత్మశక్తి గలవారి వాక్కులే సత్యవాక్కులు. దానినే సత్యమందురు. సత్యమొక్కటియే మాయను మనలను కూడ పట్టగలదు. మన వాక్యము సత్యమైనచో అదియే మహావాక్యమగును. అహంయనెడు బ్రహ్మ (భ్రమ) నాశనమగును. నిప్పు కట్టెను కాల్చి తానును నిలువలేక పోయినట్లుగా, అన్నిటిని ఖండించిన ప్రజ్ఞ నిలువలేక పోవును. ఉన్నది పరమాత్మ.

# గురు లక్షణము

లోకములో గురువుల మను కొనువారు గురువులు కానే కారు. నేను గురువును అనే శబ్దము యెవరికిని లేనే లేదు. వెలుపల గురువుండు ననుటయు, తానితరులకు గురువు ననుటయు ఎంత యధర్మమో యోచించి చూడుడు. వెలుపల

గురువుండుననుకొనునంత వరకు అతడును శిష్యుడే. వెలుపల గురువు ఎపుడు లేకపోవునో, అపుడు లోపల గురువుండును. ఆ లోపలి గురువునకు (ఖండ శక్తికి), మనము శిష్యులమగుదుము. లోపల తెలుపునదే గురువు. తెలిసినట్లు నడచునదే శిష్యుడు. కర్తృత్వమే శిష్యుడు. కర్తృత్వమును ఖండించుటే గురువు. ఈ గురుశిష్యులు మన లోపలనే కలరు. ఎపుడు గురువు లేకపోవునో అపుడు శిష్యుడు లేకపోవును.

శుద్ధమగు మనసే (ఆత్మశక్తియే) గురువు. సత్యమగు (ఆత్మశక్తి గలవారి) మాటయే వుపదేశము. సత్య (ఆత్మ) శక్తికి లోబడి నడచు నడతయే శిష్యుడు.

## తెచ్చుకొనగోరు గురువులు

గురువుల మనుకొనువారు శిష్యులతో సహా యిచ్చి వేయవచ్చిన కర్మను మరచి తాము తెచ్చుకొన వలెనను యాశచే జప, తప, ముద్రలు, నిష్ఠలు, తీర్థయాత్రలు ఎన్నెన్నియో చేయుదురు. ఇవి యన్నియు హెచ్చువేతలే గాని, తీసివేతలు గావు. జన్మ రహితమునకు తీసివేతయే మార్గము. ఎట్లన సత్యముగా (మనో వాక్కాయముల ఒకటిగా) నడచుట అను తీసివేతయే ఆచరణ.

కాని నేను విడిచినాననే భావమున్నంత వరకు విడిచిన వాడే కాడు. నేను గురువును అనునది మాయ. నేను అనునది అహమే. అందన్నియు పొరలే. పలు కొక్కటియు లేదు. నేను నడిపించినానను వాడును, నడిచినానను వాడును వీరిరువురును వాస్తవ మెరిగిన వారు కారు. వారిది పరిశుద్ధాత్మ కాదని తెలియవలెను. తమకు తామే తమ కర్మను ఎరిగిన వారును, కర్తృత్వము లేనివారును నిరహంకారు లనబడుదురు.

## ఆశ్రమ భారము

"అమ్మా! మీరుండుడు. మేము ఆశ్రమము కట్టుకొనెదము." అని కొందరు మమ్ము కోరగా దానికి మేము మొదట అచ్చుకొంటిమి, "ఆశ్రమము మాది కాదు, మీదే నని చెప్పి అచ్చుకొన్నను దోషమేయై ఆ భారము మా మీదకు వచ్చునట్లు తదుపరి తోచినది. "ఆశ్రమము మీదియగు నెడల మేము అచ్చుకొనుటయే యుండదు గదా!" అని పొరపాటు తెలిసి, బుద్ధివచ్చి, ఎవరి డబ్బు వారి కిప్పించినాము. మేము అచ్చుకొనుట లేకపోగానే ఆశ్రమమే లేకపోవును.

రాజ్య దోషము రాజుదైనపుడు, గ్రామ దోషము పంచాయితీ దైనపుడు, భార్య దోషము భర్త దైనపుడు, పిల్లల దోషము తల్లిదండ్రుల దైనపుడు, ఆశ్రమ దోషము అచ్చుకున్న వారిదే యగునని కనుపించినది. ఆచరణయే ఆశ్రమ మైనపుడు, ఆశ్రమమును అచ్చుకొన్న దోషము లేక పోవునా? అచ్చుకొనుట యెపు డుండునో, అంటు కొనుట అపుడే యుండును.

దాసుల హృదయములో దాగవలసిన సన్యాసి ఆశ్రమమును అచ్చుకొనదు. రాముడు దాసుల హృదయములో దాగెనని వింటిమి. రాముడు దాగుట సత్యమో, యసత్యమోగాని, సన్యాసి దాసుల హృదయములో దాగవలసిన వాడే.

మాయ తల్లీ ! భ్రమను బ్రోగుచేసి జన్మించిన అమ్మా! భ్రమ నివారణము కాగా మాయ మాయమయ్యె నమ్మా! త్రోవ యిట్లుండ ఆచరణ నాశనమునకు హేతువు ఆశ్రమమని కనుపించినది.

**(ఇసుకపల్లి తాటి త్రోపులో నుండగా 1931లో జరిగిన విషయము)**

# శక్తి హీనులెవరు?

మే మొక సారి బీదవారు గదా యని కొందరికి కొత్త గుడ్డలు ధర్మ మిప్పించుటకు అచ్చుకొంటిమి. ఆ గుడ్డ లిప్పించ బోగా, ఆ బీదలనుకొను వారి లోపలి శక్తి "నీవేనా వీరిని రక్షించునది? నేనున్నాను." అని మమ్మదుగగా, శక్తిలేని వారు కాన్పించక, అచ్చుకొన్న దోషమునకు విధిలేక శక్తిగల వారికే వాటినిప్పించి సిగ్గుపడితిమి.

# సార్థకమగు మంత్రము

తన రకము తెలియుటే తారకము. తన విషయములందలి యిష్టము అయిష్టమై గురువే యిష్టమై, మనోవాక్కాయము లేకమై నడచునపుడు -

శ్లో॥ గురు బ్రహ్మ గురుర్విష్ణుః గురుదేవో మహేశ్వరః
గురు సాక్షాత్ పరబ్రహ్మ, తస్మై శ్రీ గురవేనమః ॥

అను మంత్రము సార్థకమగును. అట్లు కాని నడత, మాటపోగా తంత్రమై అసత్యమగును. ఎట్లన "అంగడిలోని బెల్లము దేవునికి సమర్పయామి" అనుటయే గాని సత్యము కాదు. ఒక తావున పారవైచిన వస్తువు మరియొక తావున దేవులాడినచో దొరకదు గదా! విత్తనము లేనిదే చెట్టును సృష్టించ నెవరితరము? మాయ తరమే గాని మన తరము గాదు.

# మౌనము

మనము మౌనమును పట్టవలయునా? లేక మౌనము మనలను పట్టవలయునా? మనలనే మౌనము పట్టవలయును గాని మనము మౌనమును పట్టగూడదు. మనది ఋణముండి వచ్చిన జన్మ గనుక, లోక ఋణము తీర్చుట కర్తవ్యము. కర్తృత్వము పూని మౌనము పట్టుట తప్పు. సత్యముగా నడచు నట్టి ఆత్మశక్తి సంపన్నులను మాత్రమే మౌనము పట్టును.

# నమస్కారము

పరమాత్మను చూడని వారు పరమాత్మను చూచినవారికి నమస్కారము చేయగా, ఆ నమస్కారము బాణమై, పరమాత్మను చూచినవారికి పరమాత్మను చూపును. అట్టి నమస్కారము, చేసిన వారికి ఫలమును కూర్చునేమో గాని పరమాత్మను చూచినవారికి ఫలమును కూర్చదు.

లోకాతీతమును దర్శించే యెరుకకు, లోకమును రూపించే ఎరుక పరిగ్రహమై లోకమును మ్రింగుచుండగా దానినే లోకాతీతమని భ్రమించి, దానికే నమస్కరించినచో యీ లోకమును మ్రింగుచున్న ఆ యెరుక దొంగదగుచున్నది. ఆ దొంగ యెరుకను లోకాతీతమైన యెరుక తాకినచో అది విలపించకుండ మానదు.

# ప్రసాదము

ఒకసారి ఎవరో అన్నము తినుచుండగా మా లోపల ఒక శబ్దము వినబడినది. "నీలో యిదివరకు యే భావమునకు పరమాత్మ కనుపించినదో, ఆ భావముతో వారు తినుచున్న అన్నమును, అన్నము లేని పరమాత్మగా చూడుము." అని,

అట్లు చూడగా మరల యిట్లు తెలిసినది – "పూర్వము యెవరిలో పరమాత్మను చూచు భావమున్నదో, వారికి వారి నడతను బట్టి పెద్దలనియు, సాధువులనియు పేర్లు పెట్టిరి. వారిని గూర్చియే "సాధునాం దర్శనం పుణ్యం" అని చెప్పుదురు. అట్టివారు పదార్థమును, పదార్థము లేని పరమాత్మ భావముతో చూచుటచే, ఆ పదార్థమునకు ప్రసాదమని పేరు పెట్టిరి. అట్టి పదార్థమును ప్రసాద మనవచ్చునేమో గాని, శక్తిలేని బొమ్మల వద్ద పెట్టిన పదార్థములకు ప్రసాదమని పేరుపెట్టుట వలన ప్రసాదము కాజాలదు. పరమాత్మను చూడనివారు పదార్థమును చూచినచో అది ప్రసాదము కాకపోగా, దానికి దృష్టి దోషము తగులునేమో గాని అది ప్రసాదము కాజాలదు.

# వృత్తి రాహిత్య క్రమము

మనలో ఒక వృత్తి తెలియుట, ఆ తెలిసిన రీతి నడచుట, దాని నడక సొంతమగుట, ఆ వృత్తి లేకపోవుట, తదుపరి మరి యొక వృత్తి తెలియుట, ఆ తెలిసిన రీతి నడచుట, దాని నడక సొంతమగుట, ఆ వృత్తియు లేకపోవుట. ఇట్లు ఎంత వరకు నడతుమో అంత వృత్తియు లేకపోవును. వృత్తి లేక పోయినచో తెలియుటయు సొంతమై నడచుటయు లేకపోవును, అపుడు వుండునది పరమాత్మ.

ఇట్లు ఒక్కొక్క ఇంద్రియ వృత్తి యొక్క ఋణము తీరగా, దాని ధర్మము అధర్మముగా కనుపించుచుండును. అంతట ఒక్కొక్క వృత్తియు నివృత్తియగును.

# భావ పరివర్తన

ఒక నగ యొక్క రూపు అట్లుగానే నిలిచి యుండగా, మరియొక నగ రూపము ఎట్లు తాల్చజాలదో, విషయ భావము, నిర్విషయ భావమును తాల్చలేదు. నగ కరిగి వేరొక రూపము యెట్లు తాల్చగలదో, అట్లే విషయభావము పోయి నిర్విషయ భావము ఏర్పడవలసియుండును. విషయభావము గల మానవుడు నిర్విషయ భావమును తెలుసుకొనగలననుట సంగీతమునకు చింతకాయలు రాలుననుటవంటిది.

# పరితాపము

కామ క్రోధములకు, లోభ మోహములకు, రాగ ద్వేషములకు లోబడితిమిగదా యని యేడ్వ వలయును. పరులు మనలో దోషము లెంచునపుడు, "మనలను అనినారే" అని యనుకొను వెర్రితనమునకు యేడ్వవలయును. ఈ దోషములను గూర్చి యేడ్వగా యేడ్వగా జాగ్రత్త వచ్చును. అపుడు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములకు లోబడితిమిగదా యని యేడ్పు వచ్చును. అపుడు తెలిసినంత వరకును ఆ దోషములకు లోబడక, నీతి సత్యములకు లోబడి వర్తింతుము.

# ఈషణ త్రయము

మనుజుడు తెలివిలేని స్థితియందు సిగ్గు, అభిమానములు లేకపోవుట వలన వానిని పిచ్చి వాడందురు. మనుజుడు తెలివిగల దశయందు కూడ, అనగా విషయ రహితుడై సిగ్గు, అభిమానముల కతీతుడై పోయిన పూర్ణ దశ యందును వానిని పిచ్చి వాడందురు. అప్పుడతడు భావమున కతీతు డగుట వలన పిచ్చి వానివలె కాన్పించు చున్నాడని గ్రహించ వలెను.

అట్టి దశవచ్చి పిచ్చి వాడగు వరకు కర్తృత్వము (విధి రూపమైన కర్తృత్వము) తో, జాగ్రత్తగా కూడియుండి విషయ వాసనలు కలిగి యుండును గాన, వాని కెంత సిగ్గు, అభిమానములు పట్టుకొని యుండునో చూడుడు.

ఒక్క యీషణ మైనను రహితమై వైరాగ్య శీలుడైననే తప్ప, ఎవరికిని పెద్దవాడను పేరు కలుగ జాలదు. అటుల ఒక్కొక్క యీషణము రహిత మైనపుడు, ఆ యీషణమును రహిత పరచిన నీతి, సిగ్గు, అభిమానములు యింకొక యీషణము కడకు వచ్చి దానిని హద్దులో పెట్టవలసి యుండును గదా!

మొదట భ్రాంతి దట్టముగా నుండి మనుజుడు రజోగుణ ప్రేరితుడై యున్నపుడు వానిలోని బ్రహ్మ (భ్రమ) ను నీతి, సిగ్గు, అభిమానములు హద్దులో పెట్టగా వాని దారేషణ క్రమముగా తగ్గి తుదకు రహిత మగును. అపుడు దారేషణను రహితపరచిన నీతి, సిగ్గు,

అభిమానములు సత్వగుణ ప్రేరితుడై సృష్టిని పెంచునట్టి విష్ణుని చేత పెంచి, పోషింపబడు ధనేషణకు హద్దులు పెట్టును. శరీరములోని బలము గాని, పిల్లలు మొదలగు వారిని పోషించు శక్తిగాని, స్త్రీలు బిడ్డలకు పాలిచ్చి. నీళ్ళు పోసి, వారిని సాకు సమర్థత గాని ధనముతో సమానమే. ఇవన్నియు ధనేషణ యనిపించు కొనును. వీనిని హద్దులలో పెట్టిన నీతి, సిగ్గు, అభిమానములు వీటిని క్రమేణ తగ్గించి రహిత పరచును. ఆ పిమ్మట వారికి పిల్లలను పోషించుటకు గాని, ఏవేని సాంసారిక కార్యములు నిర్వహించుటకు గాని, డబ్బు తాకుటకు గాని శక్తి యిసుమంతయు నుండదు. అపుడు వైరాగ్యుడు ధర్మునితో చేరి సంసారమును దూరము చేయును. తదుపరి ఆ ధనేషణను రహిత పరచిన నీతి, సిగ్గు, అభిమానములు పుత్రేషణ దగ్గరకు వచ్చును. తమోగుణ ప్రేరితుడగు రుద్రుని సంహార కార్యమును హద్దులో పెట్టి, పంచేంద్రియ వృత్తులను క్రమేణ క్షీణింపజేసి, ఆ ఋణము తీరగనే ఆ పుత్రేషణను రహిత పరచును. అంత వరకు ఋణము తీర్చుటకై లోకమున పుత్రుడైన మనుజుడు నిరాధారియై, పరిగ్రహము లేనివాడై, భక్తుల హృదయములే ఆధారము గలవాడై తన లోని శక్తి నంతను (లోకమును) లోకమునకు లోబరచు కర్మలను మాత్రము చేయుటలో వినియోగించును.

పరమాత్మ శక్తి కతీతుడు గాన, యీషణ రహితుడైన పురుషుడు (సన్యాసి) తనశక్తిని భక్తులకు లోబరచి వర్తించును. అట్టివానిని గుణాతీతుడు, ముక్తుడు అందుము.

ఒకని యింట ధనము దోచిన దొంగ అట్టి ధనమున్న మరొక చోట దొంగిలించుటకు పోయి అచట దోచును. అట్లే ఒక విషయమును రహిత పరచిన నీతి, సిగ్గు, అభిమానములు తక్కిన విషయముల కడకు పోయి వానిని హరించును. ఆ నీతి, సిగ్గు, అభిమానములు తక్కిన విషయములను హద్దులో పెట్టక, అచట కాన్పించక, మొదటి విషయము రహిత పడక యున్న యెడల అవి మొదటి విషయము చెంతనే పడియుండె నని వేరుగా చెప్ప వలయునా? ఎట్లన ఒకని యింట నున్న ధనమును దొంగలు వచ్చి ఎత్తుకొని పోయినట్లు కలగని, కలవరపడి, అరచి, గోలచేసినను వాని ధనము వున్నచోటనే యున్నటుల, విషయములు రహితము కాని మనుజుడు యీషణ త్రయముల కతీతుడనని లోకములో చాటుకొనుట అటులుండును. వాని గుణము లెచటి వచటనే యుండును.

పగటి వేళ దీపము యొక్క ప్రభావము వ్యర్థమగునట్లు అన్ని విషయములను రహిత పరచిన పిమ్మట వైరాగ్యము భక్తుల భాగ్యమగును. అపుడు వాని కర్తృత్వము పిచ్చి వాని చేష్టయై కాన్పించును. అతడు విషయముల కతీతు డయిన ముక్త పురుషు డనబడును.

## ధర్మములు

**సత్యము** - అసత్యమునకు లోడక నడచుటయే దాని ధర్మము. అది యెన్నడును అబద్ధమాడదు.

**శాంతము** - క్రోధమునకు లోబడక నడచుటయే దాని ధర్మము. అది యెన్నడును కోపింప జాలదు.

**దయ** - అన్ని ప్రాణులను తన ప్రాణముతో సమానముగ కాపాడుటయే దాని ధర్మము. అది యెన్నడును నిర్దయ చూపజాలదు.

**ధర్మము** - లోభమునకు లోబడక నడచుటయే దాని ధర్మము. అది యెన్నడును లోభము చూపజాలదు.

**ఓర్పు** - ఎన్ని కష్టములు వచ్చినను ఓర్చుకొనుటయే దాని ధర్మము. అది యెన్నడును సహనమును వీడజాలదు.

**జ్ఞానము** - అజ్ఞానమునకు లోబడక నడచుటయే దాని ధర్మము. అది యెన్నడును అజ్ఞానముగా ప్రవర్తించదు.

**అహింస** - మనసుతో, మాటతో, క్రియతో ఏ ప్రాణిని హింస పెట్టకుండుటయే దాని ధర్మము. అది యెన్నడును హింస చేయుటకు పాల్పడదు. తమ మాంసమును కాపాడు కొనువారు మాంస భక్షణము చేయక పోవుటయే వారి ధర్మము. అట్టి వారెన్నడును మాంస భక్షణకు లోబడరు.

**అపరిగ్రహము** - పరులనుండి యేలాటి వస్తువులను, సేవలను వుచితముగా తీసికొనకుండుట. అపరిగ్రహము గలవారు యితరులను రా అని పిలువనైనను పిలువరు. అట్లు **రా** అని పిలుచుటయు పరిగ్రహమే.

ఆత్మశక్తి గలవారే ఈ ధర్మములు విధిగా నడచెదరు. అపుడు వాటి ఋణము తీరి, వాటికి హక్కులేక, విషయముల బలము పోవును. అనగా లేనివగును. ఉండునది పరమాత్మ.

# ద్వంద్వములు

సత్యముగా మేముంటి మనుకొను వరకు అసత్య లోక ముండుటం బట్టి సత్యమునకు హక్కు కలిగెనే గాని, సత్యమే మేమనుటకు హక్కులేదు. సచ్చిదానంద స్వరూపుడు పరమాత్మ.

శాంతముగా మేముంటి మనుకొను వరకు క్రోధ ముండుటం బట్టి శాంతమునకు హక్కు కలిగెనే గాని, శాంతమే మేమనుటకు హక్కులేదు. సచ్చిదానంద స్వరూపుడు పరమాత్మ.

దయగా మేముంటి మనుకొనువరకు నిర్దయ యుండుటం బట్టి (అన్ని ప్రాణుల బాధ మా భారమై యుండెను గాన) దయకు హక్కు కలిగెనే గాని, దయయే మేమనుటకు హక్కు లేదు. సచ్చిదానంద స్వరూపుడు పరమాత్మ.

ధర్మముగా మేముంటి మనుకొను వరకు లోభముండుటం బట్టి (అందరకు లేని ధనము మనకెందు కుండెనని తెలియు నంతవరకు) ధర్మమునకు హక్కు కలిగెనే గాని,

ధర్మమే మేమనుకొనుటకు హక్కు లేదు. సచ్చిదానంద స్వరూపుడు పరమాత్మ.

ఓర్పుగా మేముంటి మనుకొను వరకు దేహమునకే బాధ వచ్చినను నొచ్చుచుండె. కాన ఓర్పే మేమనుటకు హక్కు లేదు. సచ్చిదానంద స్వరూపుడు పరమాత్మ.

జ్ఞానముగా మేముంటి మనుకొను వరకు అజ్ఞానముండుటం బట్టి జ్ఞానమునకు హక్కు కలిగెనే గాని, జ్ఞానమే మేమమనుటకు హక్కు లేదు.

"అహింసగా మేముంటిమి, మా కంతేచాలు" అని యనుకొను నంతవరకు హింస యుండుటం బట్టి (అహింసయే హింసయై కన్నుల నీరు కారుచుండె గాన) అహింసకు హక్కు కలిగెనే గాని, అహింసయే మేమనుటకు హక్కు లేదు.

అపరిగ్రహముగా మేముంటి మనుకొను వరకు కోరిక (పరిగ్రహము) యుండుటం బట్టి అపరిగ్రహమునకు హక్కు కలిగెనే గాని, అపరిగ్రహమే మేమనుటకు హక్కు లేదు.

సమప్రేమగా మేముంటి మనుకొను వరకు భేద భావము లుండుటం బట్టి సమ ప్రేమకు హక్కు కలిగెనే గాని, సమ ప్రేమయే మేమనుటకు హక్కు లేదు. మేము సమ ప్రేమగా నుండు కాలమున వారు వీరని భేదము చేయ వీలు పడని కారణముచే నోరు తెరచి పలుక హక్కు లేదయ్యె.

కొంచెమైనను ద్వంద్వములకు చలింపక అన్నిటిని తీసి వేయుద మనుకొనిన, వెలుపల కాన్పించు లోకమే లోపలనుండె. అంతటా పరిపూర్ణు డమరి యుండె ననుకొనిన లోపల నున్న లోకమును యిచ్చి వేయమని శక్తి యాడ్చు చుండె. మర పన్నినట్లు మాయ యీ ద్వంద్వముల నన్నిటిని పన్నినది గాన దేనిని దాని కిచ్చివేసిన యెక్కడి దక్కడ లేకపోవును.

## స్వశక్తి

వెలుతురు యొక్క స్నేహముండి మేము చూచుచున్నాము గాని, స్వయముగా లోకమును చూడ కన్నులు లేవు.

శబ్ద స్నేహముండి మేము విను చున్నాము గాని, స్వయముగా లోకమును విన చెవులు లేవు.

రస స్నేహముండి మేము రుచి చూచు చున్నాము గాని, స్వయముగా లోకమున రుచిని వర్ణింప జిహ్వలేదు.

గంధ స్నేహముండి మేము వాసనను గ్రహించుచున్నాము గాని, స్వయముగా లోకమున వాసన భేద మెంచ ముక్కు లేదు.

వాయువు యొక్క స్నేహముండి మేము స్పర్శను గ్రహించు చున్నాము గాని, స్వయముగా లోకమున స్పర్శ భేదము నెంచత్వక్కు లేదు.

ఇట్లు పరాధీనమైన పనికిమాలిన జన్మయే గాని స్వశక్తిగా జన్మించ మైతిమి. స్వశక్తికి మనో నేత్రమే గాని మరియొక నేత్రము లేదు. స్వశక్తి యన పరమాత్మను చూచుశక్తి. వృత్తిలేనిది స్వశక్తి.

పంచ భూతముల సహాయము స్వశక్తి సంపాదనను పడగొట్టు బాణము వంటిది. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు స్వశక్తిని పొందనీయక పడగొట్టు బాణములని యెపుడు తెలియునో, అపుడు పంచ భూతముల సహాయము లేక పోవును.

శబ్దమునకు లోబడు శక్తి మాలో నున్నది గాని, పామును కుబుసము విడిచిన రీతిగా ఆ శక్తి మమ్ము విడిచినచో మా భ్రాంతి వీడును.

స్పర్శకు లోబడుశక్తి మాలో నున్నది గాని, ఆ శక్తి మమ్ము విడిచినచో మా భ్రాంతి వీడును.

రూపమునకు లోబడు శక్తి మాలోనున్నది గాని, ఆ శక్తి మమ్ము విడిచినచో మా భ్రాంతి వీడును.

రసమునకు లోబడుశక్తి మాలో నున్నది గాని, ఆ శక్తి మమ్ము విడిచినచో మా భ్రాంతి వీడును.

గంధమునకు లోబడుశక్తి మాలోనున్నది గాని, ఆ శక్తి మమ్ము విడిచినచో మా భ్రాంతి వీడును.

ఈ అయిదింటికి మించినది ఆత్మశక్తి. ఆ శక్తి మేమయినచో పై పంచశక్తులు వీడును. పంచశక్తులు లేనివాడు పరమాత్మ.

# పరమాత్మ యననేమి?

శబ్ద రహితుడు పరమాత్మ. శబ్దము వ్యభిచారమని తెలిసినచో చెవులతో శబ్దమును వినగలమా!

స్పర్శ రహితుడు పరమాత్మ. స్పర్శ వ్యభిచారమని తెలిసినచో వాయువుతో స్నేహము కోర గలమా!

రూప రహితుడు పరమాత్మ. రూపము వ్యభిచారమని తెలిసినచో కన్నెత్తి రూపము కాంచగలమా!

రుచి రహితుడు పరమాత్మ. రుచి వ్యభిచారమని తెలిసినచో జిహ్వతో రుచులను చూడగలమా!

గంధ రహితుడు పరమాత్మ. గంధము వ్యభిచారమని తెలిసినచో ముక్కుతో వాసన చూడగలమా!

లోక రహితుడు పరమాత్మ. లోకమునకు లోబడుట వ్యభిచారమని తెలిసినచో లోకమునకు ఏ వ్యక్తియు లోబడడు. పరమాత్మను దర్శించిన ఆత్మకు పరమాత్మయే గాని లోక ముండదు.

లోక శబ్దమును విను యెరుకను లోకమును వినని యెరుక చూచిన *యెడల శబ్దమును వినే యెరుక లేకపోవును.

*యెరుక చూచిన = ఆ యెరుకయే తానైన

లోకమున స్పర్శను వర్ణించే యెరుకను స్పర్శను వర్ణించని యెరుక చూచిన యెడల, స్పర్శను వర్ణించే యెరుక లేక పోవును.

లోకమును రూపించే యెరుకను రూపించని యెరుక చూచిన యెడల, రూపించే యెరుక లేకపోవును.

లోకమున రుచి చూచే యెరుకను రుచి చూడని యెరుక చూచిన యెడల, రుచి చూచే యెరుక లేకపోవును.

లోక గంధమును గుర్తించే యెరుకను గంధమును గుర్తించని యెరుక చూచిన యెడల, గంధమును గుర్తించే యెరుక లేకపోవును.

లోకములో మాటలాడే యెరుకను మాటలాడని యెరుక చూచిన యెడల, మాటలాడే యెరుక లేకపోవును.

లోకములో ఆకలి అనే యెరుకను ఆకలి అనని యెరుక చూచిన యెడల, ఆకలి అనే యెరుక లేకపోవును.

లోకములో పోయే ప్రాణమును పోని ప్రాణము చూచిన యెడల, పోయే ప్రాణము లేకపోవును.

ఇట్టి ఆకలి దప్పులు మొదలగునవి యేవియును లేనివాడు పరమాత్మ. పరి పూర్ణమే పరమాత్మ. పరమాత్మను గురించి మనము క్రొత్తగా తెలిసికొన వలసినది లేనే లేదు.

లోకాతీతమే పరమాత్మ. లోక మర్యాదల కొరకు మనము జన్మించి యుండలేదు. జన్మ రాహిత్యము పొందుటకై జన్మించి యున్నాము. పుణ్యమను మాట లోకములో లేనే లేదు. పుణ్యమనగా పరిపూర్ణమే. పరిపూర్ణ మనగా పరమాత్మయే. పరమాత్మను జూచు భావమునకు సూది మొన మోప సందులేని పరమాత్మయే యుండును. గాని లోకము లేదు. పరమాత్మను గురించి మనము కష్టపడవలసిన పనిలేదు. పరమాత్మను దర్శించు ఆత్మ ఎవరి యందున్నదో వెదకి, కష్టపడి, దానిని సంపాదించుటే పరమాత్మను గురించిన పాటు.

సూర్యునకు చీకటి యెట్లు లేదో, అట్లే పరమాత్మకు లోకము లేదు. పరమాత్మ గుణరహితుడు. గుణ రహితములో సద్గుణమును యుండదు. సద్గుణములో దుర్గుణ ముండదు కదా! ఇక ఏ గుణముండి పరమాత్మ మనను రక్షించుట లేక శిక్షించుట? పరమాత్మకు మనము లేనే లేము.

అగ్ని ముట్టుకున్న కట్టె ఎట్లు దగ్ధమగునో, ఆత్మయున్న జీవాత్మ అట్లు దగ్ధమగును. అట్టి ఆత్మ యుండి ఎవరికి తెలుపునో వారే ధన్యులు. ఆత్మ, "ఇదికాదు, ఇదికాదు" అని

తెలుపును. ఆత్మ కాదన్న వృత్తి లేకపోవును. పచ్చి యాకు అగ్నిలో వేసిన ఎట్లు మలమల లాడునో, అట్లే ఎల్ల వృత్తుల కతీతమై పోవునంత వరకు దీర్ఘ శ్రమకు లోబడు (సహించు) వారే లోకాతీతులు. భిన్న భిన్న భావము లుండుటే లోకము. భావ రహితమే లోకాతీతము. అదియే పరమాత్మ.

# పరమాత్మ దర్శనము

**(పరమాత్మను దర్శించిన ఆత్మ (శక్తి) గల వారి ననుసరించి భక్తితో వారియందున్న ఆత్మను సంపాదించిన వారే విధిగా నడచెదరు. ఆ విధియే సత్యమైన నడక. వారే మనసు, మాట, చేత ఒకటిగా నడచి సరియైన త్రోవను పోవువారు. అట్లు నడువగా, నడువగా వారి యందున్న ఆత్మకు పరమాత్మ దర్శన మగును. అపుడు క్రోధ ద్వేషాది గుణము లంతరించుచు, నీతి సత్యములు విధిగా నడచును.**

**ఆత్మశక్తి నార్జింపని వారట్లు నడువలేరు. వారు పరమాత్మను గాని, పరమాత్మను దర్శించు ఆత్మనుగాని, అట్టి ఆత్మ శక్తి గలవారిని గాని ఎరుగలేరు. వారా భగవత్సాంప్రదాయమునం దడుగిడిన వారును కారు.**

**ఈ క్రింది విషయము పైనుదహరించిన వారిని గూర్చియే చెప్పబడినది.)**

లోతుగా త్రవ్వగా, త్రవ్వగా నీరెట్లు కాన్పించునో, అట్లే సత్యమైన నడత నడువగా, నడువగా పరమాత్మ కనబడును. దాహమగువారు దాహము, దాహము అనిన నీరెట్లు దొరకదో, అట్లే రామా, రామా యనియు, కృష్ణా, కృష్ణా యనియు పూజలెన్ని చేసినను పరమాత్మ కనుపించదు. పొరుగూరు పోవువారు దారి తెలియక తప్పు త్రోవయందే యెంత తిరుగు లాడినను ఆ యూరెట్లు చేరరో, అట్లే ఎన్ని పూజలు, యోగములు చేసినను పరమాత్మను చేరజాలరు. సరియైన త్రోవను పోవుచో వారికా యూరెట్లు కాన్పించునో, అట్లే మనసు, మాట, చేత ఒకటిగా నడచినచో, మాయ నశించి, ఆత్మకు పరమాత్మ దర్శన మగును. అట్టి పరమాత్మ దర్శనము కాగా సర్వ ప్రపంచము తానుగా నున్న జీవుడు తామరాకు మీది నీటివలె తల్లడిల్లును. మరియు పామును తోక పట్టుకొని విసరి వేసినచో అది కదల లేకపోయినట్లుగా "ఇది నాది, నేను లోకోపకారిని" అనెడి కర్తృత్వము జీవుని యందు లేకపోవును. పరమాత్మను దర్శించిన తదుపరి మాయా రూపుడైన జీవుడు తల్లడిల్లును. అట్లు తల్లడిల్లు జీవుడు ఆనంద పడుట కల్ల. జీవుని బంధించుటన మాయ కానందము. మాయను ఖండించుట ఆత్మకు విధి.

మెఱుపు తళుక్కు మనిన లోకము కనుపించక వెలుగే ఎట్లు కాన్పించునో, అట్లే శమదమాది గుణములు గలవారికి పరమాత్మ కాన్పించును. మనము అద్దమును చూచినచో, అద్దము కనబడక మన ముఖమే కనబడు రీతిగా, పరమాత్మ భావమునకు లోకము కనబడక పరమాత్మయే కనబడును. పగలు చీకటిని ఎట్లు వాడుకొనజాలదో, పరమాత్మ భావము లోకమునట్లు వాడుకొనదు. విధిగా నడచుచుండు వారి ఆత్మకు అపుడపుడు పరమాత్మయే కాన్పించుచుండును.

కామము దోషమని తెలిసినచో కామ ముండదు. ఇట్లే యిచ్ఛా శక్తి తాల్చు గుణములు (క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు) అన్నియు దోషములని తెలిసినచో మనను విడచును. ఈ దోషములనిన ప్రతివారికి అసహ్యము. కాని వీటిని తెలుసుకొన లేకున్నాము. ఇవి తెలియ రానపుడు గుణ రహితుడగు పరమాత్మను తెలుసుకొన గలననుట వెర్రి మాటయే గాని సత్యము కాదు.

"మన మనగా నెవరు? ఎచట నుండి వచ్చినారము? ఎచటికి పోయెదము? ఇదంతయు యేమిటి?" అను విచారణ కలిగిన మనంబు తల్లడిల్లి మరువని జాగ్రత్త వచ్చును. తెల్లవారు ఝామున ప్రయాణమై వెళ్ళువారికి ఎంత ధైర్య ముండునో, శమదమాదుల నడత గలవారికి అంత ధైర్యశక్తి యుండును. ఆ శమ దమాదులే క్రమేణా లోక ఋణము తీర్చి అవియును లేకపోవును. అపుడు పరమాత్మ స్వతస్సిద్ధముగా కనుపించును. భావ రహితమైనది పరమాత్మయని తెలియును. భావాతీతమైనది కేవలము నిర్గుణము. దాని కావల యేమియు వుండదు.

## లోకాతీతులు

భూమి నీటిచే ముంచ బడును. ఇల్లు అగ్నిచే కాల్చబడును. ధనము దొంగిలింప బడును. శరీరమన్న మరణించునదే. పుట్టినవారు చచ్చెదరు. ఈ మాటలు స్మరణకు వచ్చి మనసు తల్లడిల్లును. నిద్దురయే పట్టదు. గడియారపు అలారము ఎట్లు గణ గణ కొట్టునో, అట్లే అశాశ్వతమగు శరీరము యెటు చూచినను ఆధారము లేక మరణించుటను చూచి గుండె కొట్టు కొనును. అపుడు జాగ్రత్త వచ్చును. అంత కామ క్రోధాదులు తలయెత్తజాలక అంతరించును. సత్యము, శాంతము, దయ, ధర్మము, ఓర్పు, జ్ఞానము, అపరిగ్రహము, అహింస అను గుణములు విధిగా నడచును. పరమాత్మను దర్శించు ఆత్మశక్తి గలవారికే పైవన్నియు సంభవించును. ఇట్లు పరమాత్మను జూచినను చాలదు. ఏ భావము పరమాత్మను జూచునో ఆ భావము తాను కావలయును. అపుడు మనసు భయము వీడి నిర్భయమగును. ఇక తల్లడిల్లదు. పసిబిడ్డల కెంత నిర్భయమో, అంతటి నిర్భయ స్థితి వచ్చును. అట్టి స్థితి బడసినవారే లోకాతీతులు.

## ఏది పగలు?

ఈ పగలు పగలు కాదు. ఈ పగలు <u>**నేను**</u> అనుదానిని తెలుసుకొన లేక <u>**నాది**</u> యను దానికి త్రోవ చూపినది. ఇది పంచభూతములకు హితవయిన పగలు. ఇదే మానవుని పద్మ వ్యూహములో పడగొట్టిన పగలు. త్రోవ లేని తావునకు త్రోవ చూపిన పగలు. ఇది భక్తిని నాశనము చేసి జ్ఞాన రత్నమును అపహరించిన పగలు. ఈ పగలు పగలు కాదు.

నామ రూపము చేత చెప్పనలవి కానిదేదో అదియే స్వయం ప్రకాశమైన పగలు. స్వయమాత్మ చూచినదే పగలు. మనుజుని మనసు పోవ ఖాళీ లేనిదేదో అదియే పగలు.

మనుజుడు అష్టకష్టములు పడి విషయానందమును, యిచ్ఛాశక్తిని ఖండింప వలయును. అట్లు ఖండించ గలది ఆత్మ ఒక్కటియే. దానిని సంపాదించునదే భక్తి. **నీవు** అను భావము **నేను** అని మాట్లాడును గాని, **నీవు** లేని భావము సత్యమైనచో, **నేను** అను భావము లేకపోవును. **మీరు** అను వృత్తి రహితమైనచో వున్నది పరమాత్మ యనుటకు సందియము లేదు. సత్యమైన సన్యాసి యీ పగలును చూడగలడు. ఈ వెలుతురు సహవాసము లేక పోయినందున యిపుడు అంధులమై యున్నాము. ఈ పగలు ఆత్మకే తెలియును. ఆత్మ తానైన వాడు ప్రకృతి పగలును వాడు కొనడు. ఈ ప్రకృతి వెలుతురు ఆధారము చేత చూచు నేత్రములు యేమి నేత్రములు? ప్రకృతి సహాయము కోరని స్వయమైన నేత్రముతో చూడమైతిమి గదా యని చింతింపక తప్పదు.

# పరమాత్మలో మాయకు తావులేదు*

మన మాటలు మన కర్థము కాకుండగనే మాట్లాడు చున్నాము. కాని మన మాటలు మన కర్థము కావలయును. మన మాట మన కర్థమయిన మాయ మాయమగును. పరమాత్మ సూది మొన మోప సందులేని వాడందుము గదా! అట్టి పరమాత్మలో మాయా రూప జీవుడు ఐక్యమగు టెట్లు? మాయ మాయమే కావలసి యుండును. మాయ మాయమై పోవునపుడు ఏమి మిగిలి పరమాత్మలో ఐక్యమగుట? అట్లనుట వలన పరమాత్మ సూది మొన మోప సందులేని వాడను మాట భిన్నమగుటయే గాక ఎంత యధర్మమో యోచించి చూడుడు. పరమాత్మలో మాయ ఐక్యమగుట కల్ల. మాయ మాయమైపోగా సదా యుండునది పరమాత్మ. నివురు నిప్పు నెట్లు కలుపుకొన లేదో, అట్లే పరమాత్మ మాయను కలుపుకొన లేదు.

*** ఇది సాయం వరదాసుగారు మరణించినపుడు శ్రీ మళయాళ స్వాములవారు శ్రీ చిన్నమ్మగారిని "వరదాసుగారు పరమాత్మలో ఐక్యమయినారా?" అని యడిగిరి. శ్రీ చిన్నమ్మగారు పై విధముగా చెప్పిరి.**

# లోపలిదే వెలుపల గోచరించును

మన లోపలి అసత్యమే మాయ. ఈ మాయయే వెలుపల గోచరించు లోకము. మన అసత్యమునకే చలి, ఎండ, రాత్రి, పగలు, ఆకలి దప్పికలు. అట్టి అసత్యమున కెంత యేడ్వవలయునో చూడుడు. సత్యము కొరకై చావ వలయును. చావక మిగులునదే సత్యము. సత్యమును కాల్చేది లేదు. సత్యమున కాకలి దప్పులు లేవు. సత్యమే పరమాత్మ. "లోకము లేదు" అనే యెరుక లేనిచో "లోకము లేదు" అనుమాట కూడ లేకపోవును.

ఆ మాటను అనేది లోకమే కదా! భ్రమను చంపే బ్రహ్మరాక్షసి యెవరిలో నుండునో, వారికి యీ వ్రాయించిన మాటలన్నియు అనుభవముగా తెలియును.

నీలో కోపమున్న వెలుపలి కోపము నిన్ను బాధించును. అట్లే లోక భావము లెన్ని యున్నవో, అవి నీలో వున్నపుడే వెలుపల నీకు కాన్పించును. నిన్ను బాధించును. పరమాత్మను చూచు భావము (ఆత్మ) నీలో వున్నపుడే నీకు పరమాత్మ కాన్పించును.

పరమాత్మ కాన్పించి నపుడు లోకముండదు. గోడ లోనికి శరీర మెటుల పోలేదో, అటులనే పరమాత్మను చూచు భావము పరమాత్మ లోనికి పోజాలదు. భావ రహితమే పరమాత్మ. "భావన చేయుదును" అనేది లోకమే. లోక మనెడి యిచ్ఛకు పరమాత్మ చిక్కదు. ఆశ పిశాచి యని తెలియనిచో పరమాత్మ మీకు తెలియరాదని గ్రహించ వలయును.

# నిజము

ఉపదేశము, మంత్రము, జపము, తపము, వేదశాస్త్ర పురాణములు అన్నియు ఒక్కటే యెరుక. కనుక యిది మహాగాథ. ఉపదేశము ఎంత వరకు సత్యమోనని చూడగా మాకు వేలము వెర్రిగా కనుపించెను. ఇవన్నియు జ్ఞానమునకు దారి కాదు. ఎట్లన, ఆకలిగొయైన మనుజుడు "అన్నము, అన్నము" అనిన ఆకలి తీరని యట్లు, 'నిప్పు, నిప్పు' యనిన కాలని యట్లు, కనకములేని మనుజుడు 'కనకము, కనకము' యనిన కనకము రాని యట్లు, ఆకు మీద బెల్లమని వ్రాసి ఆకును నాకిన తీపి కలుగని యట్లు, ఎన్ని చదివినా కాలము వృధాగా జరిగి పోవుట మాత్రమే గాని మహా పుణ్యము లభించదు.

ఇదియునుం గాక పదియారు గుణంబులు పదియారు రూపులై విషయేచ్ఛగల శిష్యుడు నిజము (పరమాత్మ) ను చూపుమని కోరుటయు, వాడిగల సూది మొన మోప సందులేని పరమాత్మను చూపెదనన్న గురువు, వీరిరువురును వాస్తవ మెరిగిన వారు కారు. అదియును గాక గురువుల మని శిష్యులకు జనన మరణ ప్రవాహ రూపమైన మాయను ఆత్మ యనియు, ప్రత్యగాత్మ యనియు, చైతన్యమనియు, శాశ్వతమనియు, పరబ్రహ్మమనియు చెప్పుదురు. ఈ చెప్పుట స్వానుభవముచే చూడగా, "అన్నీ నేనే, ఒకటీ నేను కాదు" అను అంతరాత్మయై కనుపించెను.

కల్పించేది, కలుపుకునేది అంతరాత్మ. ఇదే మాయ. మఱ్ఱిగింజ యంతటి సంకల్పము కూడ మాయయే. ఇట్టి సంకల్ప బీజము నశించుటకు భక్తి యనెడి మహా పుణ్యము లభించవలయును. అట్టి భక్తియే ఆత్మను సంపాదించ గలది.

షడ్రుచులు భుజించిన మనుజుడు అశుద్ధమును కోరని రీతిగా, సందు లేక నిండియున్న పరమాత్మను చూచిన వాడు ధనమును ఉపయోగించుకొనలేడు.

పరమానందమును గురించి పాటు బడవలయు నన్న పాత్ర నెరిగి ధర్మము చేయవలెను. అట్టి ధర్మము మహా పుణ్యము. అది యెట్టి దన, "సూర్యప్రభకు చీకటి లేనియట్లు, నిప్పు

ముట్టుకుంటే కాలిన యట్లు, పండి రాలిన యాకులు తిరిగి చెట్టును అంటుకొన నట్లు, అన్నము తింటే ఆకలి తీరినట్లు, బెల్లము తింటే తీపి కలిగి నట్లు, పది యారు గుణములను అట్టి మహా పుణ్యము పోగొట్ట గలదు. మహా పుణ్యమున్న శమదమాది గుణములు నడచును. ఏ గుణము లుండి బిగియ బట్టినను మరల పుట్టి ఆ ఋణము తీర్చక తప్పదు. గుణము లేక వ్యాపారము యెవరును చేయలేరు. ఇది స్వానుభవము.

రజ సత్వ తమో గుణములు మూడున్నూ, కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యము లారున్నూ, రాగ ద్వేష ఈర్ష్య డంబ దర్ప అసూయ అభిమానములు యేడున్నూ అనేక రూపులై సూది మొన మోప సందులేని పరమాత్మను లేనట్లు చూపును. ఈ పదియారు గుణములు మీ వద్ద లేనట్లయిన యెటు చూచినను పరమాత్మయే కనపడును. అట్టి పరమాత్మను చూచినప్పటికి యింకా కించిత్తు లోకముండును. కించిత్తు లోకమే జీవనము. జీవనముండు పర్యంతము బాల, ఉన్మత్త, పిశాచ రూపులుగా వృత్తులుండును.

ఏ విద్యలు లేనిది నిజము. నిజము ఒకరినోట చిక్కదు. నిజమునకు ఖాళీలేదు. నిజములో మాయ పుట్టలేదు. తలిదండ్రులు లేరు. పుట్టేది మాయ. పుట్టించేది మాయ. అనేకము కల్పించినది మాయ. గుణమే లోకము. లోకమే మాయ. మాయ మాయమగును. నిజమే వుండును. నిజములో అబద్ధము లేదు. అబద్ధములో నిజము లేదు. ఈ రెంటికిని యెన్నడును సంబంధము లేదు. నిజమునకు రాత్రి పగలు లేవు. పంచ భూతములు అయిదును లేవు. నిజమే స్వతస్సిద్ధముగా నున్నది. నిజము తానయితే చెప్పలేరు. చెప్పిరా నిజము కాలేరు. "నిజము (పరమాత్మ)" అని ఏది యనునో అది మాయ.

**(మౌనమునకు పూర్వము, పని చేయు శక్తి పోయిన తదుపరి, (1918) యింటి వద్ద నుండగా చెప్పిన విషయము.)**

# అమూల్యోపదేశము

అసత్యమగు మాయ జన్మకు వచ్చినది గనుక, మాయా స్వరూపులగు మనను ఎవరు అసత్య మనెదరో, ఆ అసత్యమును వారినే తీసికొన నివ్వవలెను. మనయందు సత్వ రజస్తమములు రాగ ద్వేష కామ క్రోధాదులు అను పదియారు గుణములు అనేక రూపులై మన జన్మకు కారణము లైనవి. ఎవరైనను మనయందు దోషము లెంచి యేమే మందురో, ఆ మాటలను మనము తీసుకొనక, ఎవరి మాటలను వారికి విడిచి వేయుటే మార్గము.

ద్రౌపది మయ సభలో దుర్యోధనుని చూచి విచార పడక నవ్వినందులకు గదా అవమానము పడవలసి వచ్చినది. ఆ మాట సత్యమో యసత్యమో గాని, ఎవరేమందురో దాని పూర్వ సంబంధము ప్రారబ్ధ రూపమున మనలోనే యుండును. దానిని బట్టి మనము అవమానము పడవలసి వచ్చును. లోపల నున్నదే వెలుపల సంభవించును. మరియు మంచి చెడ్డలు కలసి మానవ జన్మకు వచ్చు చుండును.

తమలో చెడుగున్న వారికి మనలోను చెడుగు కాన్పించును. అందుకు మన తప్పేముండును? తమలో మంచి యున్న మనలోను మంచియే కాన్పించును. అందుకు మన ఒప్పేముండును? ఎవరి తప్పొప్పులు వారివే కదా! వినినది వినిన వారిదే. చూచినది చూచిన వారిదే. తినినది తినిన వారిదే. ఇట్లు ఎవరివి వారివే అయినపుడు వారు అనిన మాటలు వారివి గాక మనవి యెట్లగును? అట్లను కొనక **<u>ఎవరో మనలను అని నారని చెడుట ఒకటి, తిరిగి అని చెడుట యింకొకటి.</u>** ఈ రెండు విధముల చెడుదుము. ఈ మాట మరువక సదా జ్ఞప్తి నుంచు కొనవలయును. ఇదే నిష్ఠ, ఇదే మంత్రము. ఇదే నామము. ఇదే వుపాసన. ఇదే పూజ. ఇదే అమూల్యోపదేశము.

# క్రోధాగ్ని

క్రోధ మనగా నెంత విషమో గాని, అగ్ని వలె రగులుటకు దానికి రవంత కారణము చాలును. ఎవరినైన పాము ముట్టుకున్నదని వినిన యెడల మనము విచార పడుదుము గదా! అట్లే క్రోధమనే పాము ఎవరినైనను ముట్టుకొనిన యెడల, వారిని చూచి విచార పడవలయును. మనను క్రోధము తాకినచో మన మనసు, శరీరము రెండును విష మయము లగును. కాబట్టి మనను పాము ముట్టుకున్నట్లేనని వేరు చెప్ప వలయునా? క్రోధ స్వభావము నెరిగిన వారు, తమ పైన ఎవరైన క్రోధము పూనినచో, "అది క్రోధమని ఆ కోపించు వారికి తెలియదు. పాపము వారిలో క్రోధము ప్రవేశించినది." అని జాలి పడుచు, మరల కోపించక, వారిపై ప్రేమను చూపుదురు. పామును విడిచిన కుబుసము తిరిగి ఆ పాముున కెట్లు రాదో, అట్లే తెలిసిన వానిని విడిచిన క్రోధాది గుణములు తిరిగి వానికి రా జాలవు. తన నడతలో వాని నతడు అనుసరించలేడు.

# నిందా సహనము

ఎవరేని నిందించుచో, మాట మోయలేని మానవునకు ముఖమున తెలివియే యున్న ఆ ముఖము చెడునా? వాని ముఖమున తెలివి యున్న, ఆ ముఖ వికారముతో చేయు పనుల గూర్చి దానికి మరి సిగ్గు వచ్చును. "తాను ఎవరు?" అను విచారణ వానిలో నుండినచో **<u>తాను</u>** అనుమాట తప్పు అని తెలిసి, తనకు సిగ్గు వచ్చును. ముఖమున తెలివి యున్న వారే వివేకులు. వారు వివేకమున సర్వము మరతురు. పరమాత్మ భావము గలవారి ముఖము పెడతిరుగదు. ముఖము వాడుకొను యెరుక యిచ్ఛ యనియు, విధి యనియు రెండు విధములు. ఇచ్ఛ వాడుకొను ముఖము తన యిచ్ఛకు భిన్నము వచ్చినపుడు చెడును. విధి వాడుకొను ముఖము చెడదు.

# మిత్రభావము

తప్పులు దిద్దుకొను కొరకు, పరస్పరము తప్పులు దిద్దుకొనుచు, సవరణ చేసుకొనుటలో సహాయ పడు వారే మిత్రులు. అట్టి వారు పడిపోవు వారికి వూత కర్రగా నుపకరింతురు. ఇట్టి వర్తనమే పరమునకు భూషణము.

# ఆశ

అందరిలోను అన్ని యింద్రియముల ద్వారా పనులు చేసే శక్తి ఆశయే. అది పాత అప్పు వంటిది. అది పిశాచి వలె మన చేత పనులు చేయించుచున్నది. పనులు చేసే శక్తి యేనాడు మనలను విడచిపెట్టునో, ఆనాడే ధనము తాకు హక్కు లేకపోవును. అట్లు పనులు చేయు హక్కు పోయినవారు ఋణము తీర్చుటయేగాని క్రొత్త ఋణమును చేయరు. జీవుడు ఆశకు లోబడి తనను తాను మరచి, అసత్యమునకు పాల్పడు చున్నాడు. వానికి నిరాశ యను జాగ్రత్త వచ్చి తనను తాను తెలియ వలయు ననిన యెడల, సత్యమనే నీటిలో మునగవలయును. అట్లే ఒక్కొక్క విషయమును దాటి పోవలసి నపుడు నీటిలో మునిగిన వాడెట్లు కొట్టుకొనునో, తానట్లు కొట్టుకొనును. ఆ తీరున ఒక్కొక్క పాత అప్పు తీరగా, అది అధర్మమై కనుపించును. చెడుగుడు ఆట ఆడువాడు తాను ఎదిరిని తాకి, తాను దొరకక, ఎట్లు తప్పించు కొనునో, అట్లే బుద్ధిమంతులు పాత అప్పును తీర్చుచూ క్రొత్త అప్పులో చిక్కు కొనరు.

ఒక్కొక్క పాత అప్పు అనగా ఒక్కొక్క విషయము అనే మలినము పోగా పోగా ఎప్పటికప్పుడు మిగిలినది, ఆ మలినమునకు మాత్రమే శుద్ధమైన దగును. అపుడు మిగిలి నదియు మరల గిజ గిజ కొట్టు కొని పోగా మరల మిగిలినది అప్పటికి శుద్ధమైనదగు చుండును. ఇట్లు అన్ని విషయములు గిజగిజ కొట్టుకొని వెడలి పోవును.

ఆశ పిశాచి యని తెలిసినచో ఆ పిశాచికి అశ పడరు. పిశాచి అంటే ఎంత భయమో ఆశ అంటే అంత భయముండును. ఆశా పిశాచికి లోబడి తేరగా వచ్చు తిండి తిందురే గాని, అది తెచ్చు ఋణ బంధము నెరుగరు. ఎద్దుపుండు కాకికి ముద్దు కాదు. అట్లే ఋణము మనను పీకుకొని తినక మానదు. కష్టపడి గంజి త్రాగుట మేలు.

మనసు దయ్యమై మరి యొకరి పేరును నేనే యను నట్లుగా, మాయయే జీవుడై దేవుడనియో, ధర్మమనియో పేర్లు పెట్టు కొని ఎన్నెన్నియో కోరికలను సృష్టించును. ఆ సృష్టి మరల క్రొత్త సృష్టిని గురించిన కర్తృత్వమునకు హేతువగును. కనుక జీవుడు కోరికలను కోరక నిర్జీవుడుగా నుండ వలెను. కోరిక లన్నియు జీవునికి జన్మ బంధములే యగునని వేరుగా చెప్పవలయునా?

ముక్తికి విరోధి కోరికలే. కోరికలను కోరి, తాను తప్పులను చేయుచు దైవమును రక్షింపుమని కోరు కొనుట ఎంత యధర్మమో చూడుడు. తాను సత్యముగా నడచుచో దైవము లేని చోటు లేదని తెలియును.

# తప్పు తెలుపుట

తాను చెడిన కోతి వనమెల్ల చెరచు రీతిగా, నిందించెడి వానికి తప్పు చెప్పినచో విన్న చెవియు, కన్న కన్నును, వూరుకొను నట్లుగా, మధ్యనున్న నోరు కూడ వూరుకొనక, అతడు క్రోధము పూని, తాను చెడి, తన ద్వారా లోకులను కూడ చెరచును. నిందించని వానికి తప్పు చెప్పినచో అతని కది భూషణముగా కాన్పించును.

# ఋణము

ఆర్డరు వేసిన అప్పు కాగితము వలె, అప్పు వాని అనుమతిని బొంది మనము లోకానికి ఋణము తీర్చుకొన వలెను. వాని యనుమతి, లేదా అమ్ముడు వోయిన చంద్రమతి వలె, సత్యము తప్పక వాని హద్దులో నుండవలయును. ఋణముండగా మాయ మాయము కాదు. ఋణము తీరిన, శరీర బంధమగు విషయము క్షణమైనను నిలువ జాలదు. ప్రాణము పోయిన శరీరము నిలువనట్లు, ఋణము తీరిన, శరీర సంబంధమగు గుణములుండజాలవు. పని చేసే గుణము ఋణ ముండుటచే వచ్చినది. ఆ ఋణము తల్లిదో, తండ్రిదో, భార్యదో, భర్తదో, మరెవరిదో, యెవరి దైనను సత్యములో మునిగి ఋణము తీర్చవలెను.

ఋణము తీర్చ వచ్చిన మానవ జన్మలో, ఋణము చేయు చుండినచో, ఋణము తీర్చలేము గదా! లోకమును లోబరచు కొనుటే ఋణము చేయుట. లోకమును లోబరచు కొనునది లోకమేనని తెలిసినచో, లోకమును లోకమునకు లోబరచుటే గాని, లోకమును లోబరచుకొను హక్కుండదు. లోకమును లోబరచు కొనునది వృత్తి. వృత్తిని ఖండించునది ఆత్మ.

జన్మ ఋణానుబంధము గాన, మనము జన్మచే లోకమునకు ఋణగ్రస్తుల మను మాట మరువకూడదు. పాప పుణ్య విమర్శ మనకు తెలిసేవరకు యితరులు చెప్పినట్లు నడువవలెను. ఆర్డరు వేసిన అప్పు కాగితము (నోటు) వలె భార్యాభర్తలు యిచ్చను గుర్తెరిగి కర్మను జ్ఞాపక ముంచుకొని, ఎవరికి వారే లోక ఋణము తీర్చవలయునను మాట మరువ కూడదు.

అప్పు తెచ్చుకొను వారు అప్పు యిచ్చువారింటికి రావలయును. జన్మ ఋణాను బంధమని తెలియని వారు, మాయ అంటు వస్తువని తెలియక, మాయను అంటించు కొనుచూ, జన్మను బంధించు కొనుచూ పోవుదురు. అప్పు తీర్చు వారును అప్పు యిచ్చు వారింటికి పోవలయును. జన్మ రావడమే అప్పు యిచ్చిన వారింటికి పోవుట. మానవ జన్మ ఋణ విముక్తికై వచ్చినది. అప్పు తీర్చు వారు మానవ జన్మ మంచి జన్మ యని జాగ్రత్త పడవలయును. మాయ అంటు వస్తువని తెలిసి, దేనిని అంటుకొనక, అంటించి పోవలయును.

# పుణ్య పాపములు

అప్పు తీర్చకున్న పాపము. అప్పు తీర్చినచో పుణ్యము లేదు. అట్లే తల్లి దండ్రులకు అన్నము పెట్టనిచో పాపము. పెట్టినచో పుణ్యము లేదు. కని, పెంచిన వారి ఋణము తీర్చుటయే కర్తవ్యము. లోక ఋణము తీర్చుటయే మన విధిగాని పుణ్యమను మాట లేనే లేదు. ఋణము తీర్చుట యనగా కాని వారి వలె కానట్లు కనబడుట.

# జీవహింస

ప్రాణముపై ప్రీతిగల జీవిని పట్టి చంపు పని, దానిని తిను వానిని చంపక మానదు. తిను వాడెంత ఘనుడైనను కూడ వాని నది తినక మానదు. వానిని చంపు హేతువు వాని నడతయే. తన ప్రాణమును కాపాడు కొనుచూ యితర ప్రాణులను హింసించుట , తన మాంసమును కాపాడు కొనుచూ యితర ప్రాణుల మాంసమును తినుట తగదు.

జీవుడు మంచి దనుకొని, హింసించి, మరి తాను హింసింపబడును. అది జీవునికి యెడ తెగని వ్యాపారమైనది. వివేకము ఆ జీవుని చూచినచో ఆ జీవుని అవివేకము లేకపోవును. మన జన్మ యేమి జన్మ యని చెప్పవచ్చును? మన మాంసమును కాపాడు కొనుచుండగా, యితర ప్రాణుల మాంసమును కాపాడు భారము మన మీద నుండకుండునా? ఆ భారమును ఎవరి మీద నిలిపి మనము మాంసమును భుజించుట? మనను కాపాడు కొను కర్తృత్వము మనలను విడిచినచో ఆ భారము మనను విడచును. ఎండలో నడచువారు చలువ జోడును కండ్లకు పెట్టుకొనుట చేత, వెలుగు వారి కన్నులకెట్లు కనుపించదో, అట్లే అవివేకము కన్నుల కప్పుట చేత, మనకు సత్యము కనుపించదు. వివేకము లేని కారణము చేత జీవ భేదము కనపడుచున్నది. ఆ భావమే మనముగ వుంటున్నాము.

# వినయము

సత్యము, శాంతము, దయ, ధర్మము, ఓర్పు, జ్ఞానము, అపరిగ్రహము, అహింస, అనువానిని సత్సాంగత్యము వలన నేర్చుకొన వచ్చును గాని, వినయము సత్సాంగత్యము వలన నేర్చుకొనుటకు సాధ్యము కాదు. అది భక్తికే లభ్యమగును. వినయ మనగా అన్ని ప్రక్కల వెలుగు దీపము వంటిది. వినయముతో సాటి రాదగ్గది ప్రపంచములో యేదియు లేదు.

# నడత

చీపురునకు అందినంత వరకు కసవును వూడ్చుచో, పాచి యంతయు తుడుచుకొని పోవునట్లు, తెలిసినంత వరకు మనము నడత నడచుచో మన పొరపాటులు తొలగి పోవును. వ్రాతలో పొరపాటు పడినచో ఆ పొరపాటును ఎట్లు కొట్టి వేయుదురో, అట్లే నడతలో పొరపాటు పడినను, ఆ పొరపాటుకు దొరకక నడువ వలెను.

# జ్ఞానములోనుండి రావలయును

**(మనుజునిలో ఎన్ని గుణము లున్నవో, అన్నియు వారి నడత రూపమున బయటికి వచ్చు చుండును. (ఆచరణ యందు కాన్పించు చుండును.) ఆచరణము బట్టియే వాని గుణములను నిర్ణయింప వచ్చును. అవి యన్నియు అట్టివారి సాంగత్యము చేసి సంపాదించు కొనినవే. కాబట్టి ఏ సాంగత్యము చేసిన అదియే అలవడును. జ్ఞానము (పరమాత్మను దర్శించు ఆత్మ) కావలసినచో, అట్టి జ్ఞానుల (ఆత్మ స్వరూపులనబడు వారి) సాంగత్యమున భక్తితో వారి యందున్న ఆత్మను సంపాదించిన, అది వారి లోపల నుండి వారి ఆచరణ ద్వారా బయటికి వచ్చు చుండును. క్రోధ ద్వేష అహంకార కర్తృత్వములు లేక విధి వశులై భక్తిగల హృదయములే ఆధారము గలవారై వర్తించు చుందురు. అపుడపుడు వారిలో నున్న ఆత్మకు పరమాత్మ దర్శనమగు చుండును. ఇవియే జ్ఞానుల లక్షణములు. విధి ఋణము తీరిన, అనగా మాయ నశించిన వారైన, వారి ఆత్మకు పరమాత్మయే యుండును. అట్టి వారినే లోకాతీతు లందురు. పైన చెప్పబడిన విధముగా, జ్ఞానము నార్జింపబడి, అది తెలిపి తెలిపినట్లు నడచు విధమే జ్ఞానము లోనుండి రావలయునన బడుచున్నది. అట్టి జ్ఞానము నార్జింపనిచో, ఆ లోనుండు వచ్చుటయు నుండదు.)**

మనలో లోకమున్నది. లోపలనున్న లోకము వెలుపలికి రావలయును. వెలుపల నున్న లోకమును లోపలికి తీసుకొన గూడదు. వెలుపలి మాటలు విని నప్పటికిని, అవి మన లోపలికి పోయి మనను మార్పు చేయ జాలవు. అట్లుగాక వినిన మాటలు లోపలికి పోజాలినచో బోధ వినిన మనుజునికి వున్న మనసు మారి మరియొక మనసు కావలసి యుండును.

ఊరక విని ఆనంద పడే మాయ అద్దము వంటిది. తల్లి పిల్లవానికి అద్దము చూపినచో కిల కిల నవ్వును. అపుడు అద్దములో కాన్పించు పిల్లవాడు లేడు. అట్లే "ఆహా! ఇది బాగున్నది, అది బాగున్నది." అనుచు మాటలు విని ఆశ్చర్య పడుటే గాని, ఆ మాటలు మనకు నిజముగా తెలియవు. (గుడ్డివాడు వేసిన గడ్డ గూటిలో పడినట్లుగా, మనలో ఏ భావము పక్వమై యున్నదో, తత్సంబంధ మగు మాట వినుట తటస్థించినచో, ఆ మాట తెలియ వచ్చును. అపుడు తెలిసిన మాట అగుదుము. అయిన మాట నడచెదము. అంతేగాని వెలుపలి మాట లేవియు లోపలికి పోవు. వినినట్లు నడువలేక పోయిన ఆక్షేపించువారు లేరు. అనినట్లు నడువలేక పోయిన దండించు వారున్నారు. అనినట్లు నడచునదే జ్ఞానము. అది మన లోపల నుండియే చెప్పును. అది చెప్పినట్లు నడచును. అట్టి నడతయే జ్ఞాన మార్గము.

శబ్దము సంసార మగుటచే వెలుపలి నుండి వాచా వచ్చు చొల్లు మాటలు వినిన వారు ఆనంద పడుదురే గాని, తెలిసి కాదు. అదెట్లన ఆకుమీద మణుగు బెల్లమని వ్రాసి, ఆ యాకును మక్కువతో నాకిన తీపిగా నుండదు. కాని చిన్న బెల్లపు ముక్కను నోటిలో వేసు కొనిన యెడల తీపిగా నెట్లుండునో, మనము అనినట్లు నడచిన ఆ మాటలు మనకు తెలియును.

# మానవ ప్రయోజకత్వము

మనది మానవ జన్మ గనుక, మన ప్రయోజకత్వమును చూపక తప్పదు. కనుక మన ప్రయోజకత్వమును కామ క్రోధాదులలో మీద చూపవలెను. కామ క్రోధాదులలో ఒక్కొక్కటి ఎన్నెన్ని లోక విషయములను తెచ్చి పెట్టునో చూడుడు. కావలయునని కొన్నిటిని, ఆశ్చర్యముగా వర్ణించి కొన్నిటిని, బాగుగా నున్నవని కొన్నిటిని, యిట్లే అనేకములైన వాటిని తెచ్చి పెట్టును. అవి మనలను సూదంటురాయి వలె ఆకర్షించి తమ దాసులనుగా బంధించుచున్నవి. ఉట్టి కెక్కలేనమ్మ స్వర్గమున కెక్కుదునన్న సామెతగా, తనను తాను గెలువలేని వాడు లోకమును గెలుతు నునుట కల్ల.

# సమ ప్రేమ

సర్వ జీవుల యెడ సమానముగా నుండవలసిన ప్రేమను కొందరి యెడ జూపిన పక్షపాతమే గాని సత్యము కాదు. తనను ఎవరు ప్రేమింతురో, ఆ ప్రేమను వారినే తీసుకొన నియ్యవలయును. తనను ప్రేమించు వారిని ప్రేమించుట లంచగొండి తనమే గాని సత్యము కాదు. అట్టి ప్రేమ పరమునకు శత్రువు. కూలి వానికి తగినంత కూలినే యిత్తుము గాని ప్రేమ కోసము కూలి యిచ్చుట లేదు. సర్వ జీవుల యందు సమానముగా చూపబడునదే ప్రేమ. సమానముగా లేని ప్రేమ బంధము. పరమాత్మ జన్మ బంధము లేనిది.

# సామాను దొంగల జేయును

సామానుకు లోబడియే గదా, దొంగ ఆ సామానును లోబరచు కొనుచున్నాడు. సామానుకు అతడు ఎంతగా లోబడునో, అంత దొంగతన ముండును. లోకమునకు లోబడు వారందరు దొంగలే. లోకమునకు లోబడని వారు దొంగలు కారు. పరులను దొంగలను చేయునది మన సామానే. మన యొద్దనున్న సామానే పరులను గూడ దొంగలని తెలుపునది. జీవ గుండె బ్రద్దలు కొట్టి మనము వుపయోగ పరచుకొనే ప్రతి వస్తువును మనుజునిగా చూపించే జాగ్రత్త వచ్చుచో, అది మన అసత్యములను లెక్క పెట్టును. సత్యమును చూపించును. ఇక ప్రతిదినము ఆ సత్యమెంత పెరుగునో చూడవచ్చును.

# కర్మ నిరూపణ

సుకర్మ చేయు చున్నా ననుట తప్పు. చెయ్యనిదే పాప మని చేయవలెను. దుష్కర్మ చేసితివా అది వచ్చు మాయ. విధి యని కర్మ చేసితివా అది యిచ్చు మాయయై ఋణము తీరును. అనగా పాత అప్పు తీరును. పాత అప్పు అనగా యీ జన్మ వచ్చుటకు కారణమైన పూర్వ కర్మ. ఈ రోజు విధిగా కనుపించిన కర్మ, రేపు దుష్కర్మయై కాన్పించును. అట్టి దుష్కర్మయే తుదకు లేకపోవును. ఏ కర్మయు లేనివాడు పరమాత్మ. నేను పెట్టు చున్నానని

పెట్టితివా అది నీకు తిరిగి పెట్టును. "నేను తిను చున్నాను," అని తింటివా అది నిన్ను తినును. పెట్టనిది పాపమని పెట్టితివా ఋణము తీరును.

## ఇతరుల సొమ్ము ఋణము

ఇతరుల సొమ్ము ఋణమే సుమండి. కృష్ణుడు అటుకులు తినునపుడు రుక్మిణి వాని చేయి పట్టుకొనెనట. ఇపుడు తినువారి చేయి పట్టుకొనక పోయినను, మేము పెట్టు భోజన ఫలహారములు మొదలగునవి మీకు ఋణ బంధము లగునని చెప్పి పెట్టవలెను. అప్పు పెట్టు ఋణ దాతలు ఋణ పత్రము వ్రాయించు కొందురు గదా! ఆ డబ్బు ఋణమైనపుడు, యితరులు పెట్టగా శరీరమును నిలిపిన అన్నము ఋణము కాక తప్పదు. ఋణమే జన్మ పరంపరకు హేతువు. కావున యితరుల సొమ్ము ఋణమని తెలుపక పెట్టిన, పాప పుణ్యములు యెవరివో యోచించి చూడుడు. అట్లు చెప్పగా ఋణమని తెలిసియు యెంతమంది తిందురో చూడుడు. దొంగ తిన్నను, దొర తిన్నను ప్రాణము నిలుపు కొనుటకే గదా! అట్లు ప్రాణము నిలుపునది ఋణము కాక తప్పదు. అట్టి ఋణము తిను వారికి పాపము, పెట్టు వారికి పుణ్యము కాజాలదు. ఇతరుల సొమ్ముకు ఆశ పడకు. ఆశ లేకున్న పుణ్య పాపము లంటవు. ఇది తెలిసిన వారు కష్టపడియే పొట్ట పోసు కొందురు గాని, యితరుల సొమ్మునంటరు. ఎవరిలోని శక్తి వారినే నిలుపును.

## లోకోపకారము

"నేను లోకోప కారిని." అను వాడు తాను స్వయముగా కష్టపడి తినినచో, వాని కష్టము ఎంతమంది కుపకారము చేయునో చూడుడు. ఎవరును, "నేను లోకోపకారిని" అని అనలేరు. "నేను లోకోపకారిని" అని యనుట అబద్ధము. తనను తాను వుద్ధరించు కొనలేని వాడు లోకము నుద్ధరింతు ననుట కల్ల. తనను తాను వుద్ధరించు కొనుటే లోకము నుద్ధరించుట యగును.

మనసు యొక్క సంకల్పము వలన లోకోప కారము చేసెద మనెదరు గదా! లోకోప కారము చేసే మనసు లోకానిదే కాని, వారిది కాదు. ఎట్లన, లోకములో ఎవరికిని లేని మనసు లోకోప కారము చేసెదమను వారికెట్లు వచ్చినది? లోకానిది లోకమున కిచ్చివేసి సరిహద్దులలో నిలచునదే మానవ వ్యక్తి (ఆత్మ).

## ప్రార్థన.

(తనలో శబ్దము స్ఫురించగానే) శబ్ద మాతా! నా జన్మ ఎందుకు వచ్చినదో, ఎందుకు వినుచున్నానో నాకు తెలియదు. నీకు తెలియును. వినుట దోషమని నీవు తెలిపినచో ఆ పొరపాటు తెలిసి యిక వినను. శబ్దము లేని పరమాత్మను చూచేవరకు, శబ్దమాతా! నీకు నమస్కారము.

(వాయు స్పర్శను గుర్తించగానే) వాయు మాతా! నా జన్మ ఎందుకు వచ్చినదో, ఎందుకు నిన్ను పీల్చుకొను చున్నానో నాకు తెలియదు. నీకు తెలియును. వాయువును పీల్చుట దోషమని నీవు తెలిపినచో ఆ పొరపాటు తెలిసి యిక వాయువును పీల్చను. వాయువు లేని పరమాత్మను చూచే వరకు, వాయు మాతా! నీకు నమస్కారము.

(రూపము గోచరించగానే) రూప మాతా! నా జన్మ ఎందుకు వచ్చినదో, ఎందుకు చూచు చున్నానో నాకు తెలియదు. నీకు తెలియును. చూచుట దోషమని నీవు తెలిపినచో ఆ పొరపాటు తెలిసి యిక చూడను. రూపము లేని పరమాత్మను చూచే వరకు రూప మాతా! నీకు నమస్కారము.

(దాహము కాగానే) రస మాతా! నా జన్మ ఎందుకు వచ్చినదో, ఎందుకు దాహము తీసుకొను చున్నానో నాకు తెలియదు. నీకు తెలియును. దాహము తీసుకొనుట దోషమని నీవు తెలిపినచో ఆ పొరపాటు తెలిసి యిక దాహము తీసు కొనను. దాహము లేని పరమాత్మను చూచే వరకు, రస మాతా! నీకు నమస్కారము.

(కాలు క్రింద పెట్టగానే) భూ మాతా! నా జన్మ ఎందుకు వచ్చినదో, ఎందుకు త్రొక్కు చున్నానో నాకు తెలియదు. నీకు తెలియును. త్రొక్కుట దోషమని నీవు తెలిపినచో ఆ పొరపాటు తెలిసి యిక త్రొక్కను. భూమి లేని పరమాత్మను చూచే వరకు, భూమాతా! నీకు నమస్కారము.

(అకలి కాగానే) అన్నపూర్ణాదేవి! నా జన్మ ఎందుకు వచ్చినదో, ఎందుకు తినుచున్నానో నాకు తెలియదు. నీకు తెలియును. తినుట దోషమని నీవు తెలిపినచో ఆ పొరపాటు తెలిసి యిక తినను. ఆకలిలేని పరమాత్మను చూచేవరకు అన్నపూర్ణాదేవీ! నీకు నమస్కారము.

ఈ ఆరు మనలను విడిచే వరకు మనము దాస్య భావముతో నుండ వలయును. కాని మన కవి దాస్యముండ వలయునని కోర గూడదు. ఈ యారును మనలను విడువ వలయును గాని, మనము వాటిని విడచుట కాదు.

మేము చిన్నతనము నుండియు దేనిని దేవుడని నమస్కారము చేసినను, “మా జన్మ ఎందుకు వచ్చినదో, మాకేమి కావలయునో నీకు తెలియును”, అని నమస్కారము చేసెడివారము. అట్టి నమస్కారము శుద్ధమైన నమస్కారముగా కనుపించెడిది.

## బ్రహ్మాచర్యము

మానవ వృక్షమునకు వేళ్ళు పైకి తలలు క్రిందుగా వుండును. విషయములే వేళ్ళు. ఆ విషయములను ఖండించు భావమే గొడ్డలి. జన్మ రహితము కావలయు ననినచో విషయములు ఖండింపబడ వలయును. విషయములను పెంచునదే భ్రమ. భ్రమను ఖండించునదే బ్రహ్మాచర్యము.

సృష్టికి కామము విధి యనియు, జన్మ రహితము చేసు కొనుటకు ఆ సృష్టిని ఖండించు

ఆత్మ సంపాదనే విధి యనియు స్పష్టముగానే కాన్పించుచున్నది.

భర్తకును, భార్యకును తలి దండ్రుల భావము రాని హేతువు చేత సంతానేచ్ఛ కలిగె. ఆ కారణముచే సంతానము యొక్క పాపపుణ్యములు తల్లిదండ్రులకు వచ్చుటకు హేతువయ్యెను. కాని జన్మ రహితమగుటకు యిట్టి సంతానము హేతువు కాదు.

విధి యని భ్రమించి కామమునకు, యిచ్ఛకు లోబడ్డ తలిదండ్రులకు పాపపుణ్యములు బంధములు తెచ్చునపుడు పంచేంద్రియములకు లోబడిన యిచ్ఛ మన కెన్ని విధములైన బంధములను తెచ్చునో యోచించి చూడుడు. సత్యము, శాంతము, దయ, ధర్మము, ఓర్పు, జ్ఞానము, అహింస, అపరిగ్రహము అనెడి గుణములే జన్మ రహిత పరచు పుత్రులు, ఈ గుణములు యెవరికి లేవో, వారికి "అపుత్రస్య గతిర్నాస్తి" అను వాక్యము చెల్లును.

అన్ని జీవులయందును సృష్టికి గృహస్థధర్మ మెట్లుండునో అట్లే మానవులయందును. తల్లిదండ్రులు, పెండ్లి పెద్దలు పిల్లల భారము తాము అచ్చుకొనక, సంసారము యొక్క యధార్థస్థితిని వారికి తెలిపినచో, నీతి సత్యములు వచ్చి గృహస్థమెట్లు నడువవలయునో వారికి తెలియును. పశువుల కన్నా మానవులకెక్కువ నీతి వచ్చును. బ్రహ్మచర్యమునకు అనర్థము లేకపోవును. జనులకు స్వశక్తి వచ్చును. కూలికి బిడ్డలు లేకపోవును. ధనవంతుల గర్వమణుగును. అట్లుగా నడువని జన్మగల నరుని రెండు కాళ్ళ పశువనుటకు కారణమగుచున్నది. విశ్వాసము లేని యిచ్ఛకు దాసులమైపోవుట ధర్మము కాదు.

అన్ని జన్మల కన్న మానవ జన్మ యెక్కువై నందుకు స్త్రీ పురుషులు గుడ్డ కట్టు కొనుటయే గుర్తు. మానవ జన్మకు అభిమానము ఎందుకు వచ్చినదో చూడుడు. గుడ్డను నిరూపించినది అభిమానము. ప్రాణము నైనను విడువ వచ్చును గాని, మానమును విడువ రాదనెడి మానవ జన్మ, మరుగున అభిమానము విడచుట నెంత యధర్మమో యోచించి చూడుడు. మనము అసత్య మైనపుడు గదా, అసత్యమగు మాయ బిడ్డయై జన్మకు వచ్చినది. సత్యమునకు అంతరార్థము, బాహ్యార్థము రెండును ఒకటియే.

తల్లియే స్త్రీ కదా! అట్టి స్త్రీకి పుట్టిన పురుషుడు, స్త్రీని భార్య యనవచ్చునా? అట్లే తండ్రియే పురుషుడు కదా! అట్టి పురుషునకు పుట్టిన స్త్రీ, పురుషుని భర్త యనవచ్చునా? తలిదండ్రుల తోడను, అన్న చెల్లెండ్ర తోడను ఒక్కచోట పండుకొనిన భయము లేనపుడు, భార్యా భర్తలు ఒక్కచో పండుకొనిన కలుగు భయమే పాపమని వేరు చెప్పవలయునా? బ్రహ్మచర్యా చరణులైన భార్యా భర్తలు రహస్యముగా మాట్లాడుట అనర్థము. తలిదండ్రులను తాకిన మనసెట్లుండునో, భార్యా భర్తలు ఒండొరులను తాకిన మనసట్లుండ వలయును. ధనమును గురించియు, భూమిని గురించియు వ్యాజ్య మాడు విధముగా, సృష్టి లయములను రహిత పరచెడి తలి దండ్రుల భావమును గురించి యెంతగా వ్యాజ్య మాడ వలయునో యోచించి చూడుడు. ఇచ్ఛతో జట్టీ పట్టు పట్టి యుద్ధము చేసి గెలుచునదే మానవ జన్మ. ఈ మాటలు ముందు విషముగా కనపడ వచ్చును. కాని నడత నడచిన కొలది అమృతముగా కనబడును.

మానవ జన్మ వుత్తమ జన్మ యైనందుకు హేతువు తెలిసి, యిచ్ఛను ఖండించుటే విధి. అందరును యిచ్ఛను ఖండించిన సృష్టి యేమగునని యడుగ వచ్చును. సృష్టి యేమగునో యని విచారపడువారిని గూర్చి చెప్పినది కాదీ మాట. ఈ మాట జన్మ రహిత పరచు కొనువారిని గూర్చి చెప్పినది.

అన్ని జన్మలలోనున్న భార్యాభర్తల భావము బ్రహ్మచర్యముచే జన్మరహిత పరచుకొను వారికుండదని స్వతస్సిద్ధముగానే కనబడుచున్నది. నాలుగు కాళ్ళ పశువులకు విధికి కామమున్నదనుట నిజమేనని అందరుకు కనుపించుచున్నది. జన్మ కడతేర్చుకొనుటకును, ఆత్మ సంపాదనకును మానవులకు విధికని కామమెక్కడ? ఏ విషయములోనున్నదో యోచించి చూడుడు. ఏది కోరినను కామమే. మానవ జన్మ మంచిజన్మ యనుట వలన జన్మ కడతేర్చుకొనుటకును, ఆత్మ సంపాదనకును యిచ్ఛను ఖండించుటే మానవుని విధియైయున్నది.

స్త్రీ శక్తి యిచ్ఛ. ఇచ్ఛను ఖండించుటలో పురుష శక్తికి భయమే లేదు. ఈ యిచ్ఛ తల్లిదండ్రుల భావమును నాశనము చేసినది. భార్యభర్తల భావమే యిచ్ఛ. కూరకు పనికివచ్చు కాయ విత్తనమునకు పనికిరానట్లు, విత్తనమునకు పనికివచ్చు కాయ కూరకు పనికిరానట్లు యిచ్ఛకు పనికివచ్చు జన్మ, జన్మరహితమునకు పనికిరాదు. ఇది తెలిసి విశ్వాసములేని యిచ్ఛకు దాసులమగుట ధర్మము కాదు. యిచ్ఛ మనలను తిని వేయుచున్నదో లేదో యోచించి చూడుడు. మానవులు నీతి సత్యములకు కట్టుబడియుండి, ఆ నీతి సత్యములు నడచినచో యిచ్ఛ బంధింపబడును. యిచ్ఛ బంధింపబడినచో విధికి కామము లేదు. యిచ్ఛ లేని విషయము అణువంతమైనను ఉండదు.

భర్త భార్యను వివాహము చేసు కొనుట, భార్యను కడతేర్చుట కన్న సంగతి స్పష్టముగా విధింప బడి యున్నది. తాను జన్మించిన మర్మ ద్వారము తల్లి గదా యను సత్యము యోచనకు తెలిసినచో, స్త్రీ పురుషుల మధ్య విషయానందము విషమని కాన్పించును. కనుక స్త్రీ శక్తి యిచ్ఛ (భార్య) యనియు, యిచ్ఛను ఖండించునది పురుష శక్తి (భర్త) యనియు వేరు చెప్ప వలయునా? ఈ కారణమును బట్టి భర్త భార్యకు దేవుడనుటకు హేతువయ్యెను. భార్యను కడతేర్చుటకు భర్త కర్తయైనపుడు భార్య యొక్క యిచ్ఛను ఖండించుటకు భర్త కర్తయగును. కావున భార్య యొక్క యిచ్ఛను ఖండించకపోవుట ఎంత దోషమగునో యోచించి చూడుడు. భార్య యొక్క యిచ్ఛను ఖండింపవలసిన భర్త, భార్య యొక్క యిచ్ఛకు లోబడినచో, భార్యకు భర్త యెట్లు దేవుడగును? యిచ్ఛ భార్యయనియు, యిచ్ఛను ఖండించువాడు భర్తయనియు స్పష్టముగానే కాన్పించుచున్నది. ఇట్లు విషయములన్నియు భార్యలే గనుక ఒక్క భార్య నైనను కష్టపడి కడతేర్చని వానిది పురుష జన్మయని చెప్పదగదు.

ఒక్కొక్కరిలోను స్త్రీ పురుష శక్తులు రెండును యుండగా, భార్య ఒక యూరున, భర్త మరొయొక యూరున దాగినను వారిలో నున్న యిచ్ఛ యను స్త్రీ శక్తి విడువదు. కట్టెకు

కట్టె వేరుగా నున్నను, వాటిలోని అగ్ని శక్తి నశించ నట్లు, భార్యయు భర్తయు వేరుగా నున్నను, వారిలో నున్న భార్యా భర్తల భావములు లోన అణగి యుండునే గాని, అవి అంతరించి వారికి తలిదండ్రుల భావము రాదు. చెవిటి వానికి శబ్దము వినబడక పోయినను, వానిలో నుండు శబ్దము అంతరమున అణగి యుండునే గాని, వినని భావము రాదు. కంటిలో నున్న నలక కలక పెట్టునట్లు, నరులలో నున్న యిచ్ఛ కలక పెట్టుచుండునే గాని తలి దండ్రుల భావము రాదు. తలిదండ్రుల భావము రాని హేతువు చేతనే స్త్రీ పురుషులు ఒక చోట నుండ గూడదనుటకు కారణము కనుపించు చున్నది.

పది యెండు కట్టెలలో ఒకపచ్చి కట్టె బ్రతుక లేక కాలి పోవు రీతిగా, అందరూ తల్లు లైనచో ఒకరి యెడ కూడ భార్య భావము బ్రతుక లేక మారి పోవును. ఒకరిని భార్య యను భావము బ్రతికితే ఆ భావము ఎంత మందిని ఎన్ని జన్మలలో భార్యలనుగా వర్ణించునో వేరు చెప్పనేల? అందరూ తండ్రులైనచో ఒకరి యెడ కూడ భర్త భావము బ్రతుక లేక మారి పోవును. ఒకరిని భర్తయను భావము బ్రతికితే ఎంతమందిని ఎన్ని జన్మలలో భర్తలనుగా వర్ణించునో వేరు చెప్పనేల? భార్య యను భావమును తల్లియను భావము చూచినచో భార్యయను భావము లేకపోవును. అట్లే భర్తయను భావమును తండ్రియను భావము చూచినచో భర్తయను భావము లేకపోవును. తనను కోసినను, పురుషుడు తల్లిని భార్య యని యెట్లు అనలేడో, అట్లే తల్లి భావము వచ్చిన నరుడు, స్త్రీని భార్యయని అనలేడు. అలాగే తనను కోసినను, స్త్రీ తండ్రిని భర్తయని ఎట్లు అనలేదో, తండ్రి భావము వచ్చిన స్త్రీ, పురుషుని భర్తయని అనలేదు. ఇదే విధముగా లోకములో ఎన్ని భావము లున్నవో, వాని యన్నిటికి విరుగుడుగా అన్ని లోక రహిత భావము లున్నవి. ఒక్కొక్క లోక భావమును ఒక్కొక్క విరుగుడు భావము చూచిన యెడల, ఆ లోక భావము లేక పోవును. తండ్రి భావము తానైన తరువాత, "మగవారు, మీరు ఆవలకు పొండి" అని స్త్రీ అనదు. అట్లే తల్లి భావము తానైన తరువాత, "ఆడవారు, మీరు అవలకు పొండి" అని పురుషుడనడు. స్త్రీ పురుషులు తలి దండ్రుల భావమును గుర్తించి, యింద్రియ వృత్తులతో యుద్ధమునకు దిగుటే బ్రహ్మ చర్యము. భార్యా భర్తల భావమును ఖండించు టనగా యిదియే. తలి దండ్రుల భావమే బ్రహ్మ చర్యము.

బ్రహ్మ చర్యమను యుద్ధము అంతరంగమున జరుగునది. అన్ని భావములు రహిత మయే వరకు యీ యుద్ధము జరుగ వలసినదే. వృత్తి రహితమే బ్రహ్మ చర్య రహితము.

అద్దము ముక్క లైనచో మన ముఖము భిన్నమై సరిగా కనపడని రీతిగా, దివ్యమైన తలి దండ్రుల భావము భిన్నమైనచో మన యదార్థ స్థితిని తెలియుట కెట్లు నడువ వలయునో తెలియదు. దివ్యమైన తలి దండ్రుల భావము స్వచ్ఛమైన అద్దము వంటిది. అట్టి భావము భిన్నము గాక యున్నచో, మన యదార్థ స్థితిని తెలియుట కెట్లు నడువ వలయునో తెలియును. ఇట్లే యిచ్ఛ యొక్క భావము లన్నిటిని ఖండించుటకు తగిన దివ్యమైన భావము లున్నవి.

ఒకడు నరహత్య చేసిన యెడల, ఆ హత్య చేసిన యెరుక బ్రతికితే, అది పెరిగి యింకెంత మందిని హత్య చేయునో యని గదా, నరహత్య చేసిన వారిని వురి తీయుట. అట్లే దివ్యమైన తల్లి భావమును నాశనము చేసి, ఒక స్త్రీని భార్యగా చూపిన యెరుక బ్రతికితే, యింకెంత మందిని అది భార్యలనుగా చూపి, నరుని బంధించి, బహు జన్మలకు తీసుకొని పోవునో గదా! అట్టి యెరుకను కాదని ఖండించ గలది ఖండశక్తి (ఆత్మ శక్తి)యే. ఆ ఖండ యెరుకయే యిచ్ఛ యొక్క భావములను, యిచ్ఛను కూడ ఖండించును.

★ సామాన్య ప్రపంచములో ఒక తల్లికి జన్మించిన బిడ్డలే ఒకరి నొకరు భార్యా భర్తల భావముతో చూడ లేనపుడు, కేవలము ప్రకృతిని ఖండించు ఆత్మను కావలెనన్న భక్తులు భార్యా భర్తల భావముల కెట్లు లోబడుదురు? ఆత్మ శక్తి సంపాదనకై, ఆత్మశక్తి గల వ్యక్తిని సేవించు చున్నవారు భార్యా భర్త లైనను, వారికి భార్యాభర్తల భావముండదు. వారియందు భార్యాభర్తల సంబంధించిన ఋణమున్నప్పటికి, ఆత్మ శక్తి సంపాదన పూర్తియై, ఆ శక్తితో ఋణము తీర్చుటకై జన్మించి నపుడు, తెలియకుండ ఆ ఋణము తీరేవరకు లోబడి, ఆ ఋణము తీరగానే భార్య భర్తకు తల్లిగాను, భర్త భార్యకు తండ్రిగాను కనుపింతురు. అంతే గాని భక్తులై ఆత్మ శక్తిని సంపాదించు భార్యా భర్తలు, భార్యా భర్తల భావములకు లోబడరు. ఆత్మ శక్తి గల వ్యక్తిని సేవించు వారు ఆ యాత్మకు బిడ్డలే గదా! ఒక శక్తికి బిడ్డలైనపుడు ఒకరి కొకరు తోబుట్టువులే కదా! తోబుట్టువులుగా నుండవలసిన వారు భార్యా భర్తల భావముల కెట్లు లోబడుదురు? అట్లు లోబడు వారు భక్తులు కారు.

# గృహస్థుడు

__నాది__ అను శబ్దము కలిగిన వాడై నందుచేత నీతి సత్యముల వలన హద్దులో పెట్టబడి, న్యాయమైన నడత నడచు వాడే గృహస్థుడు. ఒక యింటిని కట్టు కొనిన వాడును, ఎక్కడికి పోయినను ఆ యింటిచే పిలువబడు వాడై, ఆ యింటికి పోవు వాడును, తనను తాను పోషించు కొనుచూ అతిథి అభ్యాగతులను, సన్యాసులను ఆదరించెడి వాడును గృహస్థు డనబడును.

తాంబుర తీగె యొక్క బిగువు హెచ్చుతగ్గులైనచో నాదమెట్లు చెడిపోవునో, న్యాయము తప్పినచో గృహస్థుడట్లు చెడిపోవును. సమానముగా బిగించిన తాంబుర తీగె ఎట్లు సుస్వరముగా పలుకునో, అట్లే న్యాయబద్ధుడగు గృహస్థుని విధి సత్యముగా నడచిన నాది యను వ్యాధిని నాశనము చేయును.

న్యాయ సత్యమైన నడత నడచిన కొలదియు, నాది అనునదేదియు కనబడకపోవుటే. నేను అనునది ప్రకృతిలో చిక్కినదని తెలిసిన తన అజ్ఞానమునకు సిగ్గుపడువాడే గృహస్థుడు. ఇట్లు తెలిసి నడచు గృహస్థుని యిచ్ఛ మాయమగును.

★ **ఈ పేరా మాత్రము అమ్మ మాటలాడు స్థితిలో 29-12-1954న చెప్పినారు.**

# గృహస్థ ధర్మము

ఇచ్ఛకు లోబడక, విధికి భిన్నము గాక, మనసు మాటచేత ఒకటిగా ఋణము తీర్చుటకై దాస్య భావముతో నడచునదే గృహస్థ ధర్మము. అట్లు ఋణము తీర్చుటకై వచ్చిన గృహస్థ ధర్మమును చూచి రమ్మనిన కాల్చి వచ్చిన విధమున, హద్దు మీరి ఆ రవంత గృహస్థ ధర్మమును గొప్పచేసుకుని నరుడు తనను తానే బంధించు కొనుచున్నాడు. తన జన్మ హీనమని తెలిసిన యెడల, తన దుస్థితిని మరువక అతడు ధర్మముగా నడచును. ఇట్లు నడువగా, నడువగా గృహస్థ ధర్మము తన ఋణము తీరి అధర్మముగా కనుపించును. అధర్మ మెట్లనగా పురుషునకు తల్లి భావము వచ్చి తన భార్యయే తల్లిగా కనబడును. స్త్రీకి తండ్రి భావము వచ్చి తన భర్తయే తండ్రిగా కనబడును. ఈ భావము రానంతవరకు అందరు గృహస్థులే. గృహస్థ ధర్మమే సద్ధర్మము. అట్టి గృహస్థ ధర్మమును తిరస్కరించితివా, ఉన్నదిపోగా దండుగ పాలగుదువు. పాపము వచ్చును. తాను జన్మించిన మర్మ ద్వారము మరణించే శరీరమని జ్ఞప్తి యున్నచో, మానవుని మనసు తల్లడిల్లక మానదు.

మనకెంత తెలియునో మన జ్ఞానమంతగానే యుండును. కాని అతిశయముండదు. మనవారు మన యిల్లు అనెడి మమత వీడిన వెనుక, “యిచ్చట వుందును, అచట వుందును” అని హద్దు చేయు బుద్ధి పుట్టదు. గృహస్థ ధర్మము మమ్ము విడచినవుడు మేమెక్కడనుందుమన్నను, అచట నుండి వెడలగొట్టుచూ, మాలోని ఆత్మ, “ఏది నీ స్థలమో వివరించుము” అన అడుగుతీసి అడుగు పెట్ట హక్కు లేదయ్యె. పాపఫలముతో పుణ్యఫలము సమానమని, నోరు తెరచి పలుక దారి లేదయ్యె. ఆకలిదప్పులు లేనివాడు పరమాత్మ గాన, ఆకలి తీర్చుకొన ఇసుకరేణువంత ఆధారము లేదయ్యె. తాను తనువు మరచు పర్యంతము బ్రతుకు జీవుడు అన్ని విధముల నెట్లెట్లో భక్తుల హృదయములో దాగుచుండును.

వెలుపలి ప్రకృతికి లోబడు వృత్తి యున్నంత వరకు గృహస్థ ధర్మమే. వృత్తి యెపుడు దొరకదో, అపుడు గృహస్థ ధర్మమును దాటినట్లు అని తెలియవలెను.

# ఆకలికి గృహస్థ ధర్మము

ఒకడు, స్త్రీ లందరి లోనూ ఒక యామెను మాత్రమే తన భార్యగా నెట్లు భావించునో, అట్లే ఒకసారి ఆకలికి తినుటగృహస్థ ధర్మము వంటిది. ఆకలికి గృహస్థ ధర్మ మెవరికి వచ్చునో, వారి నోట, బూతు మాటరానట్లు “ అది రుచిగా నున్నది, యిది రుచిగాలేదు” అను మాటలు రావు. అట్టి మాటలు పలుకు చుండు నంత వరకు ఆకలికి గృహస్థ ధర్మము రాలేదనియే తెలియవలెను, పతివ్రత పర పురుషుని యెట్లు కోరదో, అట్లే ఆకలి రుచిని కోరదు. పాప పుణ్య భావములు రహితమగు వరకును ఆకలికి ఈ గృహస్థ ధర్మముండవచ్చును.

ఏరు దాటుటకు నావ యెట్టిదో జన్మ రహితమునకు యిచ్ఛలేని ఆకలి అట్టిది. అట్టి

యిచ్చలేని ఆకలికి దోషము లేకపోవును. గృహస్థ ధర్మములో విషయము విషమని యెవ్వరికి తెలియునో, వారు సంభోగానంతరము బట్ట విడచి స్నానము చేయునట్లు, ఎవరికి ఆకలికి గృహస్థ ధర్మము వచ్చినదో, వారు భోజనానంతరము పండ్లు తోముకొనకమానరు.

ఒక తల్లికి పలువురు కొడుకులు, కుమార్తెలు వున్నను, ఆమె తన కుమారులకు తన కూతుళ్ళనిచ్చి పెండ్లి చేయగూడక, మరి యొక కుటుంబము వారితో యెట్లు సంబంధము చేయునో, అటులే ఎవరి ఆకలికి గృహస్థ ధర్మము వచ్చినదో, వారు, దగ్గర స్థలముల యందుండి కష్టపడక వచ్చిన వారిడు ఆహారమును పుచ్చుకొన గూడక, కష్టపడి దూరమునుండి వచ్చిన వారిడు ఆహారమును వారి భక్తి శక్తికి లోబడి తిందురు. అట్టి నియమ మెవరికి పోవునో, అనగా అట్టి నియమము దాటిపోయిన వారికి గంగానదిలోని పావన జలమును, మురుగుతూములోని మురుగుడు నీరును ఒకటిగా కనుపించును. పసిపిల్లను ఎవరు తీసుకొనినను వారి దగ్గరకు ఎట్లు పోవునో, అట్లే జిహ్వాచాపల్యమునకు జాగ్రత్తలేని స్థితియందు ఆకలి యిచ్చకు లోబడి తినును. ఎవరి ఆకలికి గృహస్థ ధర్మము లేకపోవునో, అనగా ఎవరికి ఆకలియనునది లేకపోవునో, అట్టివారు పాపపుణ్యరహితులు. వారే లోకాతీతులు.

## రా యను శబ్దమునకు గృహస్థ ధర్మము

రా యను అక్షరమునకు లోబడునదియున్నంత వరకు ఎవరెక్కడికి రమ్మనిన అక్కడకు వెళ్ళవలెను. లోబడునది యున్నంతవరకును లోబరచు కొనునది యుండును. భార్య భర్తకు అప్పు తీర్చుకొన వలసినట్లే, లోబడునది లోబరచుకొను దానికి అప్పు తీర్చుకొనవలెను. అట్లుగాక లోబడునదే రా అను దానిని లోబరచు కొనినచో అది రా యను శబ్దమునకు గృహస్థ ధర్మము కాజాలదు. లోబడు దానిని, లోబరచుకొనే వారికి లోబరచి, లోబడని వారము కావలయును. శబ్దము వినే దానికి శబ్దమే సంసారము.

## పంచేంద్రియముల గృహస్థ ధర్మము

శబ్దము యొక్క కార్యకారణములు వివరించి చింతించుట: " శబ్దము వినకుండ నుండ వచ్చును గాని, వినిన శబ్దమును విననట్లు తీసుకొన లేము" అని తెలిసినచో శబ్దము వినుదాని కభిమానము వచ్చును.

స్పర్శయొక్క కార్య కారణముల వివరించి చింతించుట: " స్పర్శించకుండ నుండ వచ్చును గాని, స్పర్శించిన దానిని స్పర్శించ నట్లు తీసుకొన లేము" అని తెలిసినచో స్పర్శించు దాని కభిమానము వచ్చును.

రూపము యొక్క కార్యకారణముల వివరించి చింతించుట: " రూపించ కుండ నుండవచ్చునుగాని, రూపించిన దానిని రూపించనట్లు తీసుకొన లేము" అని తెలిసినచో రూపించు దాని కభిమానము వచ్చును.

రసము యొక్క కార్యకారణముల వివరించి చింతించుట: " రుచి చూడకుండ నుండ వచ్చును గాని, రుచిచూచిన దానిని రుచి చూడనట్లు తీసుకొన లేము" అని తెలిసినచో రుచి చూచు దాని కభిమానము వచ్చును.

గంధము యొక్క కార్య కారణముల వివరించి చింతించుట: " వాసన చూడకుండ నుండ వచ్చును గాని, వాసన చూచిన దానిని వాసన చూడనట్లు తీసుకొన లేము" అని తెలిసినచో వాసన చూచు దాని కభిమానము వచ్చును.

ఇట్లు చింతించగా, చింతించగా " మన జన్మ యెందుకు వచ్చినది? మన మెవరిమైనది?" యీ నిజస్థితి స్వతస్సిద్ధముగా కనుపించును.

మనలో నున్న నీతి సత్యములు మనసును పట్టినచో ఆ మనసు యిచ్ఛాను సారము పోవ మానవుల తరమా? కార్య కారణముల వివరించే జాగ్రత్త యెపుడు వచ్చునో, యిచ్ఛ యొక్క విషయములు అపుడే పడి పోవును. నిజస్థితి తెలిసినవాడు, కోరిన కోరికలు సఫల మగుటయే పుణ్య మనియు, ఆ కోరికలు నిష్ఫల మగుట పాప మనియు తలంచక, ఛీ!ఛీ! యని యీ రెంటిని కోరడు.

# మాయ యననేమి?

కర్మకు కారణ మగునది జన్మ. మరియు జన్మకు కారణ మగునది కర్మ. ఈ రెంటికిని హేతువగునది మాయ.★

వచ్చు మాయ, యిచ్చు మాయ అని మాయ రెండు విధములు. వచ్చు మాయ యెట్టిదన :-

1. రావణుడు సీతను కోరుట, సర్వమును కోల్పోవుట.
2. కీచకుడు ద్రౌపదిని కోరుట, తాను నాశన మగుట.
3. దేవేంద్రుడు అహల్యను పొందుట, అవమానము పాలగుట.
4. విశ్వామిత్రుడు సత్యమును భంగ పరుపగోరుట, తపస్సును కోల్పోవుట.

ఈ కథలన్నియు సత్యమో యసత్యమో గాని, కోరితెచ్చు కొనునదెల్ల వచ్చు మాయ. అనగా యితరుల వల్లయేది పొందినను అది పరిగ్రహమై ఋణమేయగును. ఇతరుల సొత్తు మనకు ఋణము గాక మానదు. ' ఈ చెప్పు వారు తినరా ." అని యడుగ వచ్చును. వారిలో ధనేషణ రహిత మైనది. ధనము తాకు హక్కున్నంత వరకు కర్మచేయు శక్తియు ధనమే, గడ్డిపోచ త్రుంచు నంతటి కర్మయున్నను వారికి సహితము యితరుల సొమ్ముఋణమే యగును.

★ **అసత్యము, సృష్టి, లోకము, భ్రమ, యిచ్ఛ, ప్రకృతి ఇవన్నియు మాయకు పర్యాయపదాలు.**

ఇక రెండవదగు యిచ్చు మాయ యెట్టిదన:-

1. శిబి చక్రవర్తి పక్షిని రక్షించుటకై తన శరీరమునే కోసి యిచ్చుట.
2. శ్రీరామాంజనేయులు యిరువురును యయాతిని గూర్చి అసత్య మాడక యుద్ధము చేయుట.
3. శ్రీకృష్ణార్జునులు గయుని గురించి ధర్మము వీడక యుద్ధము చేయుట.
4. హరిశ్చంద్రుడు సత్య వ్రతము కొరకు రాజ్యమును వీడి భార్యా పుత్రుల నమ్ముకొని కాటికాపరి యగుట.

ఈ కథలును సత్యమో యసత్యమో గాని, యిచ్చుమాయ అన్ని విధముల యీ తీరున వుండును. సత్యమైననడత, అసత్యమగు నడతను ఖండించుచూ పోగా పోగా ఒక్కొక్క యింద్రియ వృత్తియు తుదకు విషయము కనుపించక నివృత్తి యగును. నిప్పు కట్టెను కాల్చి తాను చల్లారు రీతిగా, నీతి సత్యములు (యిచ్చు మాయ) వచ్చు మాయను చంపి, తుదకు అవియును మాయ మగును. అపుడు పరమాత్మ, పరమాత్మ భావమునకు యెటు చూచినను నిండికాన్పించును. ఆత్మ శక్తి గలవారి విధిగా నడచు నడతయే యదార్థమైన నీతి సత్యములు.

ఇచ్చు మాయ నీరసములను కల్పించి తద్వారా ప్రారబ్ధగుణ దోషములను తెలుపును. నీరస మనగా ఒక నగను ముక్కలు ముక్కలుగా నరికి, కరగబెట్టి, దాని రూపును మాపివేయు తీరున, ఒక్కొక్క గుణమును మాపి వేయు అవస్థ. అనగా ఒక్కొక్క గుణ దోషమును తెలుపుచు తొలగించునది.

పాప పుణ్య రహితమయే వరకు, ఒక్క విషయమున్నను, మాయ మనలను భంగ పరచక మానదు. న్యాయ సత్యములు మాయ (యిచ్చ)ను పట్టుకొని ముక్కు కుట్టినపుడు మాయ యేడ్చునే గాని, హద్దు దాట దాని తరము గాదు. మాయ తనకు తానె అంటు వస్తువై దేనిని అంటుకొనదు.

కట్టెలో నిప్పు ఉన్నప్పటికిని రాపిడిలేక కాల్చనట్లు, మనలో నీతిసత్యములున్నను, మనోవాక్కాయముల యేకముగా నడచే యెరుక (ఆత్మ) లేనంతవరకు మాయ విషయ (వ్యభిచార) మని మనకు తెలియదు. తెలియనంతవరకు మాయ మనలను విడువదు. మాయను బట్టి గుణము, గుణమును బట్టి మాయ వుండును. బెల్లమునకు, తీపికి; వెలుతురునకు, దీపమునకు ఎట్టి అవినాభావ సంబంధము గలదో, అట్లే మాయకు, గుణమునకు అట్టి సంబంధము గలదు. కావున ఈ రెంటిని బాపుటకు సింధూరము వంటి శక్తి సంభవింపవలయును. పసుపు, సున్నముల రంగు బాపునది సింధూరమే. <u>మననము</u> అనునది మాయ. మాయ లేనిది. లేనిది యెట్లున్నదో తెలియదు.

ఉప్పుబొమ్మ నీటిలో దింపినంత వరకు యెటుల లేక పోవునో, అటులే విషయ

రూపమగు మాయ, మాయ యని తెలిసినంత వరకు ఆ విషయము లేకపోవును. అటులే తెలియనిదియు, తెలిసినదియు, తుదకు లేనివే యగును. ఇక మన మనునది మధ్య తంత్రముగా నున్నది. ఇది తెలిసినచో వృత్తి లేనిదే యగును.

వచ్చు మాయ, యిచ్చు మాయ రెండును మనో వృత్తులే. మన మాటలును విషయములే. విషయములే సంసారములు. ఒక్కొక్క యింద్రియమును ఒక్కొక్క విషయము లోబరచుకొను చున్నది.

వచ్చు మాయ కట్టె వంటిది. కట్టెకు కాల్చబడే గుణ మెట్లుండునో, వచ్చు మాయకు ఖండింపబడే గుణ మట్లుండును. ఇచ్చు మాయ నిప్పు వంటిది. నిప్పునకు కాల్చే గుణమెట్లుండునో, ఇచ్చు మాయకు ఖండించే గుణమట్లుండును. పరమాత్మ నివురు వంటిది. నివురునకు కాల్చే గుణము, కాల్చబడే గుణము యెట్లు లేవో, పరమాత్మకు ఖండించే గుణము, ఖండింపబడే గుణము అట్లే లేవు. నివురు నిప్పు నెట్లు కలుపుకొనలేదో, అట్లే పరమాత్మ మాయను కలుపుకొన లేదు. కట్టెను కాల్చిన నిప్పు తనకు తానె నిలువలేక చల్లారు రీతిగా, నిప్పు వంటి యిచ్చు మాయ, కట్టెవంటి వచ్చు మాయను ఖండించి తుదకు తానే మాయ మగును.

కాల్చబడు కట్టె యెపుడుండునో, ఆకట్టెను కాల్చునిప్పు అపుడుండును. కట్టెను కాల్చిన తరువాత ఆ నిప్పు తనంత తానె చల్లారును. ఆ తీరున జన్మలు తెచ్చు మాయ యెపుడున్నదో, జన్మ రహిత పరచు మాయ అపుడుండును. జన్మ రహిత పరచు మాయ జన్మను రహిత పరచి తనకు తానే మాయమగును. ఉండునది పరమాత్మ.

వచ్చు మాయ జన్మలు పెంచునది. ఇచ్చు మాయ జన్మలు త్రుంచునది. వచ్చు మాయకు కలుపుకునే గుణము, ఇచ్చు మాయకు ఖండించే గుణము గలవు. ఈ రెండును మాయయే. కలుపుకునే దానిని ఖండించేది రానీయక పోయిన యెడల, కలుపుకునేది తనకు తానే వదలి పోవును. అది తనను కట్టు త్రాళ్లుతానే తెచ్చుకొనును. కాని దానిని మనము కట్టవలయునని తలచిన కర్తృత్వము వచ్చును. అపుడు మనము వచ్చు మాయకు చిక్కినవార మగుదుమే గాని, దానిని తప్పించుకొన మన తరముకాదు. ఈ మానవజన్మ యిచ్చుటకు వచ్చిన జన్మగనుక, వచ్చు మాయకు చిక్కినచో, అదియెంత పెరుగునో వేరు చెప్పనేల? ఇచ్చు మాయను కొట్టివేయ వలయునని వచ్చు మాయ యెపుడును చెడుగుడు ఆడుచుండును. ఇచ్చు మాయ జాగ్రత్తగా కావలి కాయుచుండును. ఇచ్చు మాయకు హక్కు కలదు. వచ్చు మాయకు హక్కులేదు. అసత్యము, అజాగ్రత, పరిగ్రహము దాని లక్షణములు. ఈ రెండు మాయలును మనలోనే యున్నవి. వచ్చు మాయ లేకపోయిన యిచ్చు మాయ లేకపోవును. దానికింక పనియుండదు.

పిపీలికాది బ్రహ్మ పర్యంతము వెలుపల వచ్చు మాయారూపమున ప్రతిబింబించు ప్రకృతి లోపలనున్నదే. ఇచ్చు మాయ లోపల నుండి వెలుపలకు రావలయునే గాని, వెలుపల నుండి తిరిగి లోపలకు పోజాలదు. చెట్లు తాము విడచిన ఫలములను యెట్లు తిరిగి లోపలికి తీసుకొనజాలవో, అట్లే మనము విడిచిన ప్రకృతిని మనము తిరిగి స్వీకరింపజాలము.

పసిపిల్ల ప్రతిదినము యెంత పెరుగునో, అంత ఆయువు తగ్గు చుండును. అది తల్లికి తెలియదు. సంవత్సరములు గడచిన తర్వాత తెలియును. అట్లే ఒక మాయ పెరుగుట యెపుడుండునో, రెండవ మాయ తరుగుట అపుడే యుండును. ప్రాణముండగనే పరిశుద్ధ మాయ పెరిగి మలిన మాయ లేక పోవలెను. మలిన మాయ, శుద్ధమాయ లేనివాడు పరమాత్మ.

దొర చూచిన దొంగ కెట్లు భయము కలుగునో, నీతి సత్యములు చూచినచో మాయ తాను నాశన మగుదును గదాయని యేడ్చును. జన్మ రహితమనిన జీవాత్మ కానందము లేదు. జీవాత్మను బంధించుట మాయ కానందము. మాయను ఖండించుట నీతి సత్యముల స్వభావము.

సత్యము జన విరోధమను మాట చెల్లునేమోగాని, జనుల భావమును బట్టి జన్మ నడువదు. మాయను తెలియక వూరక మాటలాడుదుము. మాయ తెలిసినచో మాటలాడము. జీవునికి ఆత్మ స్పర్శ తగులగానే జీవత్వము మాయమగును. జీవాత్మ విషయము గాన, నశించునదై యేడ్చును. జీవాత్మయగు మాయ బూటకపు సౌభాగ్యవతి.

మనమనగా నెవరు? పరమాత్మ సొత్తా లేక మాయ సొత్తా? పరమాత్మ సొత్తునకు కావలయునను గుణముండదు. కావలయునను గుణముండగనే కామమనే మాయ వచ్చి పైబడును. కనుక మనము అనేది మాయ సొత్తే కదా! పరమాత్మ సొత్తు కావలయుననిన అట్టి సొత్తు గల ఆత్మశక్తి గలవారి ననుసరించి, మాయకు లోబడనివారము కావలయును.

వచ్చు మాయను పెంచునది వచ్చు మాయయే. వచ్చు మాయా స్వరూపుడు పరిగ్రహము చేయువాడు. ఇచ్చు మాయా స్వరూపుడు త్యాగము చేయువాడు. వచ్చు మాయను పట్టుదుననిన, ఆ వచ్చు మాయా స్వరూపుడగు మానవునికి తరమా? వచ్చు మాయను పట్టు నేర్పు యిచ్చు మాయలో నుండును. తన మాటను బట్టి నడువలేని మానవుడు మాయా రూప మనసును పట్టగల ననుట సిగ్గుకాదే! మాయను పట్టు నేర్పు నీతి, సత్యములలో కలదు.

## రా అను మాయ

"రా, అమ్మా!" అనెడు మాయ మనలో నుండి, నోటితో రమ్మని పిలచుచు, లోకమును లోబరచు కొనుచు, జన్మరహితమునకు త్రోవ తెలుసుననుకొనుట నూతిలోనున్న కప్ప, "మా నూయి గొప్పది" యనుకొనుట వంటిదేగాని, అది తెలిసికాదు. ఆ కప్ప బావి నుండి యెగిరి, సముద్రములో పడినచో, ఆ సముద్రమెంతయున్నదో దానికి తెలియును. రా అను మాయ మనలో లేక, మన నోటితో పిలువక, లోకమును లోబరచు కొనక పోయినచో, జన్మ రహితమునకు త్రోవ తెలియును. పోవలసిన మాయను రమ్మని పిలుచుట ఎంత యధర్మమో యోచించి చూడుడు. లోకా తీతమునకు పోవలెనంటే, మనలో రమ్మనే మాయలేక పోవలెను. అట్టి ఆశ విడచుటే లోకాతీతము.

మాయ యిద్దరు అమ్మల రూపమున వుండును. ఒక అమ్మ భవ బంధములను పెంచును. రెండవ అమ్మ భవ బంధములను త్రుంచును. క్రియకు యెవరైనను భవ బంధములను త్రుంచు అమ్మనే విత్తనముగా సంపాదించవలయును.

ఉప్పు, కప్పురముల వలె వచ్చు మాయ, ఇచ్చు మాయ రెండును ఒకే పోలికగా నుండుటచే యిందు ఏది యేదో పరీక్షించుట కష్టము. పరీక్షించుట కంటెను నడచుట యింకను కష్టము.

# భ్రమ

విశాలమైన హృదయ భూమిలో మాయ భ్రమసి బ్రహ్మయైనది. ఆ బ్రహ్మ యిష్టపడి విష్ణువైనది. ఆ విష్ణువు తృప్తిపడి యీశ్వరుడై లయ పరచుకొనును. ఇవియే కర్త, కర్మ, క్రియలై కాలచక్రములో వుల్టాసీదాగా తిరుగు చున్నవి.

మన మాయ మనకు తెలిసిన మన భ్రమ తగ్గును. ఇష్టము తృప్తి చెంది అయిష్టమైన విష్ణువు తగ్గును. ఈశ్వరునకు విషయ మేదియు కనుపించక, తన నేరము తనకు తెలిసి, తనను తానే ఖండించు కొనును. మాయ మాయమగును.

మన మాయ అవివేకి. అవివేకులమైన మనకు మన మెవ్వరమను మాట తెలిసినచో మాయ లేకపోవును. ఎంత వరకు తెలియునో, అంతవరకు మాయ లేకపోవును.

భ్రమయే మన ఆకారము, మన స్వరూపమే మన విషయము. సూర్యునకు శీతలమును హరించు శక్తి యెటులున్నదో, అటులనే శుద్ధమాయకు మలిన మాయను హరించు శక్తి కలదు. ఈ శుద్ధమాయ పరమాత్మను దర్శించిన ఆత్మ యున్నవారి యందే యుండును. భ్రమ యింద్రియములను లోబరచుకొని మూడు పలకల అద్దము చూపునట్లు, త్రోవలేని తావునకు త్రోవ చూపును. త్రోవయున్న తావునకు త్రోవలేనట్లు చూపును. ఆభ్రమ తాను కానిది, తానని భ్రమించి తనను తానే బంధించు కొనును. ఇట్లు తన బంధమునకు తానే కారణ మగుచున్నది. మరియు తనను బంధము నుండి విడిపించునది తానార్జించిన శుద్ధ మాయయే గాని అన్యము కాదని తనకు తానే తెలియును. ఇట్లు త్రోవతెలుపు శక్తి, ఆత్మ శక్తి నార్జించిన వారియందే యుండును.

మన స్వశక్తిని మరపించి కన్నులను యోనులుగా జేసిన విషయానందము ఎంత దు:ఖదాయకమో యోచించి చూడుడు. కన్నుల యానందము ఆనందము కాదని తెలిసిన వివేకి కన్నుల యానందమునకు ఆశ పడడు. భ్రమ భ్రమసి బ్రహ్మయై సృష్టికి హేతువైనపుడు, ఆభ్రమను గూర్చి భ్రమపడుట ఎంత దు:ఖ దాయకమో యోచించి చూడుడు.

# బంధ విముక్తి

కట్టెకు గల కాల్పబడెడి గుణమంతయు కాల్పబడు తీరున, ఖండింప బడవలసిన వృత్తి యంతయు ఖండింప బడవలయును గదా! ఖండింప బడకయున్న వృత్తి యంతయు

బంధించుటకే నని వేరు చెప్పవలయునా! అట్టి వృత్తి యున్నంత వరకు మనుజుని బంధ విముక్తికి అణువంత యాధారము లేదు. కాని ఖండించు వృత్తికి ఆత్మాధారముండును.

సూర్యుడుదయించిన చీకటి యెట్లు లేకపోవునో, అట్లే లోకము లేదను మాట స్పృహకు రాగానే, లోకము సత్యమనే భ్రమ పటాపంచలై పోవును. ఒకసారి పరమాత్మను దర్శించిన మనుజుడు తనకు గోచరించు అసత్య ప్రపంచము తన భ్రాంతియే యని తెలిసి, తన యసత్యమునకు చింతింపక తప్పదు.

మాయ బజారులో అమ్మబడు వస్తువు వంటిది. అసత్య ప్రపంచమును అసత్య వంతులకే విడిచివేసిన, అసత్యమును ఖండించు యెరుక ఎవరికి కావలయునో వారే దానిని తీసుకొందురు. ఖండించు మాయ, ఖండింపబడు మాయను పూర్తిగా ఖండించి తానును మాయమగును. అంతట ఆత్మకు బంధవిముక్తియగును. ఉండునది పరమాత్మ.

# ఇచ్ఛ

మనలో కావలెనను ఎఱుక ఒక్కటే. అదియే ఇచ్ఛా శక్తి. అది అనేక విధములై, అనేక విధములైన వానిని కావలెనని తెచ్చి మనలను బంధించు చున్నది. కనుక ఇచ్ఛ ఖండింప బడవలసి యున్నది. నామ, రూప, క్రియా వ్యాపారము చేయు యిచ్ఛాశక్తి ఖండింపబడ నంతవరకు మనము మాయ కందని వారమగుటకు కష్టపడ వలయును.

జన్మ రహితము కావలయు ననినచో యిచ్ఛ ఖండింపబడవలయును. అపుడది యింద్రి యానందములకు, విషయా నందములకును ముందడుగు వేయలేక వెనుకకు పోవును, అట్లు యిచ్ఛ వెనుకకు పోవుటే జన్మ రాహిత్యమునకు త్రోవ.

కావలయుననునదెల్లను తనను తెలియనీయని మార్గము. అదియే పరమాత్మను తెలియనీయని మార్గము. " ఇదికాదు, ఇదికాదు" అనునది తనను తెలుపు మార్గము, ఇదియే పరమాత్మను తెలుపు మార్గము. పరమాత్మను దర్శించియున్న వారలే, యీ ప్రపంచమును, " ఇదికాదు, ఇదికాదు" అనుచు పోవుదురు. పరమాత్మను దర్శించని వారు ఎట్లు (దేనిని చూచి) " ఇదికాదు, ఇదికాదు" అని యనెదరు? కాన పరమాత్మను దర్శించి యున్ననే, యీ ప్రపంచమును, " ఇదికాదు, ఇదికాదు" అనుటకు హక్కు కలదు.

ఇట్లుండ విషయేంద్రి యానందములకును, భజనలకును రమ్మని పిలిచి పెట్టిన, భోజన ఫలహారములను గూర్చి యిచ్ఛ ఎంత ఆనందపడునో చూడుడు. ఇచ్ఛ ఆనందపడు నంతవరకు జన్మ రహితమగుట కల్ల. జన్మ ఋణాను బంధము గనుక ఆ జన్మను నిలుపునది అన్న మైనపుడు ఆయన్న మెంత ఋణమో కదా! మండుచున్న అగ్ని చమురుచే చల్లారదు. అట్లే రేగుచున్న యిచ్ఛ పరుల సొమ్ముచే చల్లారదు. ఇచ్ఛయను దావాగ్ని ఆత్మ చింతయను దు:ఖ సాగరము పొంగిననే చల్లారును.

ఇపుడు మనకు తెలియవలసినది యేమి? జన్మలు తెచ్చుయిచ్ఛా శక్తి వేరనియు, జన్మ

రహితపరచు శక్తి వేరనియు తెలియవలెను. ఇక జన్మలను తెచ్చు ఆ యిచ్ఛా శక్తిని రహితపరచుటకు యెట్టిశక్తి కావలయునో యోచించి యేరుకొని తీసుకొనుటే (ఆర్జించుటే) మానవుని కర్తవ్యము.

# ఆత్మ యననేమి?

మాయ మూడు విధములుగా నుండుననియే చెప్పవచ్చును.

1. తన్ను తా తెలియక నడచునది (జీవాత్మ).
2. తన్ను తా తెలిసి తెలిసిన రీతి నడువనిది (అంతరాత్మ). ఈ రెండును జీవుడే.
3. తన్ను తా తెలిసి తెలిసినరీతి నడచునది (ఆత్మశక్తి). ఇది పరమాత్మను దర్శించిన ఆత్మ యున్నవారి యందే యుండుటచే దీనిని కూడ వాడుకలో ఆత్మ యని వ్యవహరించుచుండిరి.

జీవుడన మలినపు మాయ. ఆత్మయన శుద్ధమాయ. ఈ మూడు విధముల మాయ లేనిదే పరమాత్మ. ఈ మూడవ మాయ యగు ఆత్మ యెవరిలో నున్నదో వారి మనసు, మాట, చేత ఒకటిగానే యుండును. దానిని మనము క్రొత్తగా సృష్టించుటలేదు. ఆ మాయ సృష్టిలోనే యున్నది. ఈ మూడవ మాయయగు ఆత్మ మనలో యుండినచో, మన మాటలో నడతలో కూడ యుండును, మనలో ఎపుడు లేకపోవునో, మన మాటలో నడతలో అపుడే లేకపోవును. అది వున్నట్లయిన మనలోని ప్రకృతి మనసు, మాట, చేత ఒకటిగా నడచి తీరును. మనము, మాది అనే మమత తగ్గును. మన కర్తృత్వము అంతరించును.

"నేను, నేను అనేది నేనేనా? లేక యింకొక ఆత్మయున్నదా"? అను దానిని తెలియదలచిన మనుజుడు తన తనువును మాటి మాటికి శుద్ధ ఎరుక (పరమాత్మను దర్శించిన వారల)కు అమ్మి ఆ విక్రయమునకు లోబడ వలయును. అపుడు అసత్యము యొక్క ఆట సాగదు. సత్యమునకు బలము వచ్చును. యీ <u>నేను</u> అనునది కాక సత్యమగు ఆత్మ వేరుగా నున్నదని స్వతస్సిద్ధముగా దృఢపడును. అపుడు యీ <u>నేను</u> అనేది ఆత్మకు లోబడి నౌకరిగా వర్తించును.

ఆత్మ ప్రాణమునకు ప్రాణమైన ప్రాణధనము. అట్టి యాత్మ సంపాదనను మానవ జన్మలో కోల్పోతిమా, మన మెవ్వరమో తెలియజాలము. దొంగ, ధనపు పెట్టెకై యెట్లు వెదకునో, అట్లే ఆత్మకొరకై వెదుకవలయును. వెదకి దానిని సంపాదించుకొనవలయును. అప్పుడది పలికినట్లు నడువవలయును. అట్లు నడువగా నడువగా పలుకుటకు పలుకు లేకపోవును. మరియు నడచుటకు వృత్తి లేకపోవును. పరమాత్మను చూచు ఆత్మకు పరమాత్మయే కాన్పించును. ఆ యెరుకకు ప్రజలను చూడ నిచ్చు లేదు. మనము అద్దములో

చూచిన ఆ యద్దము కానరాక మన ముఖమే కనపడు రీతిగా పరమాత్మయే కనపడును. పరమాత్మ భావమునకు లోకము కానరాక పరమాత్మయే కాన్పించును.

సూర్యుడు పైకి వచ్చినకొలది మన నీడ కాలిక్రిందకు యెట్లు వచ్చునో, అట్లే "మనమెవ్వరము? ఎచట నుండి వచ్చినారము? ఎచటకు పోవుదము?" అను విచారణలో మునిగిన కొలది మన విషయములు మనకు విషమై, "రామ,రామ" అందుము. ఆ విషయములు మనకు ప్రాణహానికరమై కానుపించుచో అవి లబలబలాడును. అపుడవి మన ప్రాణమును విడిచిపెట్టును.

ఒక విషయమునకు లోబడి యుండి, దాని పోటీ విషయమును తెలుసుకొన వలయు ననుట, చెట్టున యీ సంవత్సరము కాచిన కాయలుండగనే, మరు సంవత్సరము కాయబోవు కాయలను లెక్క బెట్ట జూచుటవలె నుండును.

పరిశుద్ధమైన ఆత్మ లోకమునకు లోబడదు. అది లోకము నెరుగదు గాన, లోకమును లోబరచు కొనదు. అప్పుతెచ్చుకొనుట మానిన అప్పు తీర్చవచ్చును గాన, లోకమును లోబరచు కొనరాదు. లోకమునకు లోబడని వారమైనచో, లోకమునకు లోబడునది లోకమని తెలిసిన వార మగుదుము. అపుడు మనలోని లోకమును సులభముగా లోకమునకు లోబరచవచ్చును. ఇక లోకము మనలను లోబరచుకొన జాలదు. లోకమును ( కావలెనను) చూచే మన భావము మనను విడువ నంతవరకు మనము పరమాత్మ భావమునకు దూరముగా నున్నట్లే. లోకమునకు లోబడనివారు దగ్గరగా నుందురు.

భోగమునకు గాక అప్పు తీర్చుకొనుటకే ఆస్థిని సంపాదించవలసిన రీతిగా మన హృదయ భూమిలో విషయములకు తావీయక పరిశుద్ధాత్మకే తావీయ వలయును. చేతలో లేనిది గీతలో రాదుకదా! మనము ఋణము తీర్చుకొనుటకు పరశుద్ధమైన కర్మచేసి పరిశుద్ధాత్మను సంపాదించవలయును.

పరిశుద్ధాత్మ సత్య పరాయణమైనది. అది తా చెప్పినట్లు నడచును. ఏది చెప్పునో అది లేకపోయినయెడల నడతయు లేకపోవును.

అగ్ని ముట్లుకున్న కట్టె ఎట్లు దగ్ధమగునో, ఆత్మయున్న జీవాత్మ అట్లు దగ్ధమగును. ఎవరికి ఆత్మ తెలుపునో వారే ధన్యులు. ఆత్మ, "ఇది కాదు, ఇది కాదు" అని తెలుపును. ఆత్మ కాదన్న వృత్తి లేకపోవును.

ఆత్మ అంతఃపురమున నుండు కాంతవలె, యింద్రియ విషయములకు లోబడక యుండును. అనగా వెలుపలి ప్రకృతికి లోబడక యుండును. వెలుపలి ప్రకృతిని లోబరచు కొనుట ఎంత దుఃఖ దాయకమో యోచించి చూడుడు. శవమును కుక్కలు, కాకులు, గ్రద్దలు పీకుకొని తిను రీతిగా, వెలుపలి ప్రకృతిని మనము లోబరచు కొనినచో, మననది పీకుకొని తినక మానునా? ఆట ఆడువాడు తాను యెదిరిని తాకి, తాను దొరకక తప్పించుకొని పోవునట్లు, వెలుపలి ప్రకృతికి తాను దొరకక, తనలోని ప్రకృతిని అంటించి పోవలయును. ఆత్మను సంపాదించు కొనక పోవుట ఎంత ద్రోహమో కదా! విషయ రహితునకు విషయములు

శవము వంటిపే. మాటలను ఖండించు మానవతి మాటలకు అందునా? అందదు.

సత్యమైన అహంకారమేది? తన విషయములు పొరపాటులని, " ఇదికాదు, ఇదికాదు" అనుచు ఖండించునదే సత్యమైన అహంకారము. ఖండింపబడే వృత్తి యెపుడు కనుపించక పోవునో, ఖండించే సత్యమైన అహంకారము తనంత తాను చల్లారి పోవును. మన శరీరమున యెంతటి రంగున్నదో ఆ రంగు అంతటిదిగా కనుపించు రీతిగా, మన యెరుకకు ఎంత శక్తి (మాయ) కలదో అంతయే తెలియును.

మా తల్లీ! ఆత్మవాణీ! నీ మహిమ నీవు తెలుసుకొనవలెనే గాని, ఎంతఘనుడైనను తెలుసుకొనలేడు. ఎండమావులరీతి ఏమియు లేదని చూపినావు.

మా తల్లీ! నీవు అంతర్వాణి వన్నమాట చెల్లును. నీకన్నా వాణి మరియెకటి లేనేలేదు. అమ్మా! అనగా అంతర్వాణి (ఆత్మ)యే గాని వేరులేదు. నీ చూపు అణువంతచాలును. నీవు మాటలకు కాన్పించవు. మనసును ఛేదింతువు.

# ముందు కాయ పిమ్మట పూవు

కొన్ని చెట్లకు ముందు కాయ, పిమ్మట పూవు పుట్టును. పరిశుద్ధమాయ అట్టిది. దాని రకము, విత్తనము, నడత, మనసు. జ్ఞానము ప్రత్యేకముగా నుండును. పరిశుద్ధ మాయకు ఖండించెడు గుణము గలదు. ఖండించెడు దానిని ఖండ పరిపూర్ణమన వచ్చును. ఒక విత్తనము నిచ్చి మరియొక విత్తనము తెచ్చుకొను రీతిగా, మలిన మాయనిచ్చి శుద్ధమాయను తెచ్చుకొన వలయును. అట్టి శుద్ధమాయయే మలిన మాయను లేకుండజేసి తుదకు తానును లేకపోవును. మలినము, శుద్ధము లేనివాడు పరమాత్మ.

నరునిలో పరిశుద్ధమాయ వున్న యెడల మనసు, మాట, చేత ఒకటిగా నడచును. అట్టి పరిశుద్ధమాయ లేనియెడల, ఎవని యాత్మ పరిశుద్ధ మైనదో వానిని వెదకి, పరిశీలించి, మనో వాక్కాయములతో యీ జన్మ కర్మదేనను మాట జ్ఞాపక ముంచుకొని, తన జీవాత్మను పరిశుద్ధాత్మకే విడిచి వేయ వలయును. వంచన పడక వారి పంచగోరి మది నుంచవలెను.

# జీవుని భార్యాత్వము

మనలో <u>**నాది**</u> యను శబ్దమునకు హక్కున్నంత వరకు మన జీవుడు కామ క్రోధాదులకు భార్యయే. మనలో <u>**నేను**</u> అను శబ్దమున్నంత వరకు మన జీవుడు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములకు భార్యయే. ద్రౌపది అయిదుగురికి భార్య యనుట అసత్యము. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులకు లోబడు జీవుడే ద్రౌపది. శబ్ద, స్పర్శ, రూప, రస. గంధములు గల దుర్యోధనునికి లోబడక వెడలి పోవుటే అరణ్యవాసము." అని యనవచ్చును. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములకు లోబడని ఆత్మ యేదియో అదియే పతివ్రత. అదియే పరమ హంస. అదియే ముక్తికాంత. అట్టి యాత్మ యెవరిలో నున్నదో వారే ధన్యులు.

లోకమునకు లోబడి చూచుచు, వినుచు, మాట్లాడుచు తానే స్వయమాత్మ యనుకొనుట ఎంత యసత్యమో యోచించి చూడుడు.

## సత్యాగ్రహి ★

సృష్టికి హేతువైన విషయాలను ఖండించు ఆత్మను సంపాదించక, తృప్తిలేని అసంతృప్తి (తృష్ణ) కి లోబడి మానవుడు శరీరమును వ్యర్థముగా త్యాగము చేయుట ఎంత యదార్థమో యోచించి చూడుడు. శరీరము తనదే ననుకొని, ఆ శరీరమును త్యాగము చేయదలచినవాడు తన శరీరమును మూరెడు పెంచగలడా? జన్మ రహిత పరచుకొనుటకై యిచ్ఛను నిగ్రహించు తృప్తికి యేది ధర్మమో తెలియును. ఆత్మ దాపున నుండునది తృప్తి. తన సత్యమును నిలుపుకొనునది తృప్తి. ఆత్మ యెన్నడును భిన్న భిన్న విషయ రూపములను కలుపుకొనదు. విషయములను ఖండించునదియే ఆత్మ.

<u>నేను</u> అనునది లేని మాయ గనుక ఆ <u>నేను</u> అనునది అహమగుటచే, "నా శరీరము, నా ధర్మము." అను వానికి తనలో ఆత్మలేదని తెలియవలెను. సత్యమిదియే యని నిర్ణయించుటకు హక్కులేదు. కనుక సత్యమును నిలుపుటకు ఆధారము ఆత్మయే.

జీవుడు నిర్జీవి కావలసియుండగా ప్రకృతిలో యే పక్షమునకు పోనివాడు కావలయును. ఏమన, ఏ పక్షమునకు పోయినను ఆత్మ సంపాదనకు సావకాశము లేకపోవును. తనను తెలుపు వస్తువు ఆత్మ యైనపుడు, అట్టి యాత్మ శక్తిగల వ్యక్తిమీద ఆధార పడవలయునో, పంచ భూతముల సహవాసముచే కలిగిన భిన్న భిన్న స్వరూపములతో వెలయు ప్రకృతి విషయములమీద ఆధారపడ వలయునో యోచించి చూడుడు.

## తెలుపు తెలివి

పోవలసిన యూరు లాంతరు వెలిగించి ఎత్తి చూపినను కనుపించనటుల, అనేది మనలో వున్నప్పటికిని, అనినట్లు మనము నడువక పోయినచో ఏమియు తెలియదు. లాంతరు వెలిగించి ఆ వెలుతురు ఎంతదూరము చూపునో అంతదూరము పోగా యింకను అంతదూరము చూపుచునే యుండును. అట్లు ఎంత దూరము మనము పోగలమో, అంతవరకు అది దారి చూపుచునే యుండును. అట్లే మనకు తెలుపు తెలివియు నుండును. అది తెలిపినట్లు నడచిన యెడల యింకను తెలుపును. నడచు వృత్తి ఎపుడు లేకపోవునో తెలుపు తెలివియు అపుడు లేకపోవును. కాని యీ తెలుపు తెలివి ఆత్మశక్తి గలవారి యొద్దనే యుండునన్న సంగతి మరువరాదు.

---

**★ 1930లో గాంధీజీ ఉప్పు సత్యాగ్రహము కొరకై బయలుదేరి నపుడు "ఉప్పునైనా సంపాదించాలి లేదా నా శరీరము సముద్రపు టలలపై నోలలాడాలి" అన్నారట. ఆ సందర్భములో "సత్యాగ్రహి" అంటే ఏమిటో శ్రీ చిన్నమ్మగారు పై విధంగా వివరించారు.**

# మనసు, మాట, చేత

ఆత్మశక్తి గలవారే మనసు, మాట, చేత ఒకటిగా నడువ గలుగుదురు. బంగారమున కెంత విలువ యుండునో, వారి మాటకును అంత విలువ యుండును. వారి నోరు ప్రియ మగును గాని చౌక కాదు. మనుజునకు మానము నందెంత యభిమాన ముండునో, వారికిని వారి మాటయందంత అభిమానముండును. వారట్లు మనసు, మాట, చేత ఒకటిగా నడువగా నడువగా, వారి మనోవృత్తులు శూన్యములై మనసు మాణిక్యము వంటి దగును. సంపూర్ణమైన అభిమానము గలవారు ఎట్లు తమ ప్రాణమునైనను వదలి మానమునే రక్షించు కొందురో, అట్లే మనోవాక్కాయ శుద్ధి గలవారు అసత్యము మొదలగు దురభ్యాసములకు లోబడరు.

జన్మ ఋణానుబంధము గాన, అట్టి ఋణబంధము తీర వలయునంటే, మనసు, మాట, చేత ఒకటిగా నడచునట్టి ఆత్మశక్తి సంపన్నుల సాంగత్యము చేసి ఆ శక్తిని సంపాదించ వలయును. మంచిదగు మానవ జన్మలోనే అట్టి శక్తిని సంపాదించి ఋణము తీర్చలేకపోతిమా, ఎట్టి కర్మను సంపాదించు కొందుమో యోచించి చూడుడు. 'మనసు, మాట, చేత ఒకటిగా నడచుటచే భవ రోగమును మాన్పు మందు' అని గుర్తెరింగి అట్లుగా నడిపించే ఆత్మశక్తిని సంపాదించవలయును.

మనసు, మాట, చేత ఒకటిగా నడిచే ధనమును యిది వరకు సంపాదించి యుంటివా, "ఇదికాదు, ఇదికాదు" అనుచు ఒక్కొక్క గుణమే నిన్ను విడిచి పోవును. నీ నడక సులభ మగును. తుదకన్ని ఋణములు తీరును. లేని యెడల యిప్పుడైనను సంపాదించుకొనుము. దాని సాయముతో (దానిని సంపాదించినచో) మరియొక జన్మయందు సులభముగా నడచెదవు.

మనలో లోకమున్నది. మనలోనున్న లోకమే వెలుపల నున్నది. దేవుడు కావలయునంటే మనలోని లోకము వెలుపలకు రావలయును. ఫలములు చెట్లునెట్లు విడిచి పోవునో, అట్లే మనసు, మాట, చేత ఒకటిగా నడచునట్టి ఆత్మశక్తి సంపన్నులను లోక గుణములు ఒక్కొక్కటే విడిచిపోవును.

మనసులో ఒకటి, మాట వేరొకటి. నడత మరొకటిగా నుండుటయు, ప్రేమ, మర్యాద, గౌరవము, యిచ్ఛకము అను నవియు మనోవాక్కాయ శుద్ధికి భిన్నములై బంధములగును. మనో వాక్కాయము లొకటికాక భిన్నములైతే మనము భిన్నము గలవారమని వేరు చెప్పవలయునా? అవియే మన మరుజన్మకు విత్తనములు.

# నీతి సత్యములు

ఆత్మ శక్తి సంపన్నులు మాట మాటకు సత్యమునే పలుకుదురు. వారిది ఒకమాట సత్యము, ఒకమాట యసత్యము కాదు. అట్లు అన్నమాట ప్రకారము తప్పక నడచునట్టి

ఆత్మ శక్తి గలవారిని ముక్తికాంత తరుముకొని వచ్చును. వారికి చెప్ప శక్యముగాని చిరసౌఖ్యము. వారట్లు నడువగా నడువగా, వారి యజ్ఞానము సిగ్గుపడి మాయ మాయమగును. తన్ను తా తెలిసిన మాయ మాయమగును. జగము సున్న యగును. అహంకారము (నేను) కర్పూర చందమున కరిగిపోవునే గాని కర్తృత్వ మెందును గానరాదు.

అసత్య, అధర్మముల నడత మన ఋణమును పెంచును. నీతి సత్యముల నడత మన ఋణమును తీర్చును. నీతి సత్యములే మనలను హద్దులో వుంచి నడుపునవి. ఆత్మశక్తి గలవారి యొద్దనే యిట్టి నీతి సత్యములుండును.

తాము వెలిగించుకొన్న దీపము మరియొకరికి వుపయోగ పడు రీతిగా, తామన్న మాట చొప్పున నడచునట్టి ఆత్మశక్తి గలవారు, వారు కడతేరగా, వారిద్వారా యితరులు సయితము కడతేరవచ్చును.

ఒకసారి పరమాత్మను దర్శించినవారు దేవుని గురించి ఏ పనియు చేయరు. సత్యమొక్కటియే నడతురు. ఏమేని కావలయునని తెచ్చుకొనుటంతయు ఒకటి కోరిన మరియొకటి సంభవించుటకు హేతువగునే గాని సరియైన త్రోవ కాదు.

పాప పుణ్యములు రహితమయే వరకు జ్ఞానుల (ఆత్మ శక్తి గలవారి) రక్షణకు సత్యమైన నడతయే మార్గము. వారట్లు సత్యము నడువగా నడువగా, అసత్య ప్రపంచము లేక పోయి, తమ వృత్తి నివృత్తి కాగా, ప్రపంచము వారిని విడచును.

విషయములన్నియు ఆటలోని బరుల వంటివి. జ్ఞానులు అన్ని బరులను ఒకొకటిగా దాటి తీరుదురు. ఒక్క విషయము మిగిలియున్నను వారికి లోకము మిగిలి యుండును. ఒక్కొక్కటిగా అన్ని విషయముల దాటించునది నీతి సత్యముల నడతయే.

వేదమనగా యే దేశమునను లేదు. పరిశుద్ధాత్మ పలికి నట్లు అనగా మనసు, మాట, చేత, ఒకటిగా నుండునట్లు నడచుటే వేదము. జాగ్రత్త, నీతి సత్యము అనునవే వేదము. జన్మ రాహిత్యమునకు జప తప పూజలు వేదము కాదు. సత్యము, సత్యము అని పలుకుట వేదము కాదు. సత్యమైన నడతయే వేదము.

మనసు, శరీరము కండలు కళపెళ కాగక పోయిన, తెలుసుకొందు ననుకొని నప్పటికి సత్యము (ఆత్మ) తెలియదు. సత్యము తనకు తానే తెలియునపుడు మనసు, శరీరము, కండలు కళపెళలాడి, కరగి ఒక్కొక్క విషయము తెలియవచ్చును. బంతి యాడువారు బంతిని నేలబడనివ్వక ఎట్లు ఎగుర గొట్టుదురో, అట్లే సత్యముగా నడచినవారిని (జ్ఞానులను) పడిపోనీక, వెలుపలి ప్రకృతి తన ఋణము తీర్చుకొనుచూ, తనను తాకనివ్వక, తుదకు విడిచిపెట్టును.

చెట్టుయొక్క ఆకులు, ఫలములు లోపలనుండి వెలుపలకు వచ్చునే గాని, ఆ యాకులు, ఫలములు మరల చెట్టు లోనికి పోజాలవుగదా! ఇదియొక మానవ వృక్షము. ఈ మానవ వృక్షము నుండి వెలుపలి లోకమునకు ఎన్నెన్నియో లోక గుణములు బయటికి రావలసి

యున్నవి. మనసు, మాట, చేత ఒకటిగా నడచునట్టి జ్ఞానులకు లోపలనున్న లోకము వేగముగా బయటికి వచ్చును. బయటికి వచ్చిన లోకము తిరిగి లోపలికి పోజాలదు.

"దేవుడు గుణరహితుడు." అను మాటను ఏమి చేసి మనము 'రామ, రామ' యనుచు కోరికలు కోరుట? అటుల కోరు నెడల దేవుడు గుణరహితుడను మాటకు భిన్నము తెచ్చిన వార మగుదుము. కాన అది సరికాదు. సత్యము పలుకుట, పలికినట్లు నడచుటయే సరియైన మార్గము. ఈ మార్గమున ఆత్మశక్తి గలవారే నడువ గలుగుదురు. ఆ శక్తి నీలో లేక పోయిన అట్టి శక్తి గలవారు ఎచట వుందురో వెదుక వలయును. వెదకిన దొరుకుదురు. వారి యాత్మకు నీ జీవాత్మను అప్పు పెట్టుము. అనగా మొదట అన్నము, నీరు యిచ్చిన చాలును. అది కర్మయగును. ఆ కర్మయే నిన్ను నడపును. నిర్మలాత్మతో నిలిచి యుండుటకు కర్మ సూత్రమే కారణము, అది నదిని దాటించు నావ వంటిది.

## అవస్థా త్రయము

తెలియనే తెలియనిది జాగ్రత్తలో సుషుప్తి. తెలిసి తెలిసినట్లు నడువనిది జాగ్రత్తలో స్వప్నము. తెలిసి తెలిసినట్లు నడచునది జాగ్రత్తలో జాగ్రత్త. జాగ్రత్తలో తెలియనే తెలియనీయనిది సుషుప్తి లోనికి తీసుకొని పోవును. (జీవాత్మస్థితి). జాగ్రత్తలో తెలిసి తెలిసినట్లు నడువనీయనిది స్వప్నములోనికి తీసుకొని పోవును (అంతరాత్మ స్థితి). జాగ్రత్తలో తెలిసి తెలిసినట్లు నడుపునది జాగ్రత్తకు తీసుకొని పోవును (ఆత్మస్థితి). ఇదియే పరమాత్మ దాపునకు పోవు త్రోవను చూపును. ఈ మూడును జీవుని అవస్థలు. ఈ మూడు అవస్థలకును లోబడనివాడు లోకాతీతుడు.

## సాకారీ - నిరాకారీ (పాట)

దిన దినము పెరుగునే సాకారీ
దిన దినము తరుగునే నిరాకారీ

ముసుగులు వేయునే సాకారీ
ముసుగులు తీయునే నిరాకారీ

లోకమునకు లోబడునే సాకారీ
లోకమును ఖండించునే నిరాకారీ

చిక్కులు పెట్టునే సాకారీ
చిక్కులు తీయునే నిరాకారీ

సాకులు సాకునే సాకారీ
సాకులు త్రుంచునే నిరాకారీ

పెంచుకుంటూ పోవునే సాకారీ
త్రుంచుకుంటూ పోవునే నిరాకారీ

దేని ముఖము దానికే సాకారీ
లేని ముఖము దానికే నిరాకారీ

ఎక్కుచూ పోవునే సాకారీ
దిగుతూ వచ్చునే నిరాకారీ

దేనిది దానికే సాకారీ
కానిది కానిదే నిరాకారీ

జన్మలు పెంచునే సాకారీ
జన్మలు త్రుంచునే నిరాకారీ

చదువులు సాకునే సాకారీ
చదువులు సున్న చుట్టునే నిరాకారీ

నిష్ఠలు చేయునే సాకారీ
నిష్ఠలు గుంట పెట్టునే నిరాకారీ

అనుగ్రహ మిచ్చునే సాకారీ
నిగ్రహించునే నిరాకారీ

వెలుపల సున్నలే సాకారీ
దాపట సున్నలే నిరాకారీ

పాటలు పాడునే సాకారీ
పాటలు సున్నలే నిరాకారీ



# అమ్మకు వందనములతోనర్పించు నవరత్నములు

1. అమ్మను చూడగ రమ్మని
తమ్ముడు వ్రాయంగ వచ్చి దర్శించితి, నో
అమ్మా! ధన్యుడనైతిని
మిమ్మిక మరువంగలేను మేనుండంగా

2. అమ్మా! చిన్నమ్మా! లో
కమ్మున మీయంత వారు గానరటంచున్
నమ్మితి నామది లోపల
తమ్ముడు వచియుంచు మాట తథ్యంబయెగా

3. అమ్మను నమ్మినవారికి
యిమ్మహిలో కలుషమంట దెన్నడుననుచున్
నమ్మి మిము గొలుచువారిదె
అమ్మా! యదృష్టమనగ నారయ యిలలో

4. అమ్మను మించిన జ్ఞానులు
యిమ్మహిలో లేరటంచు నెరిగిన వరకున్
నమ్మి మిము నాశ్రయించిన
తమ్ముడు, మరి యితర జనులు ధన్యులు తల్లీ!

5. అమ్మా! పోవగ సెలవిక
నిమ్మాయని యడుగ దలచి, యెత్తగ గళమున్
చెమ్మగిలె కన్నులేలనొ
అమ్మా! చెప్పంగ జాలనైతిని యేమో!

6. ఎందుకు దుఃఖము నాయన
ఎందులకని మీరలడుగ, నేమోయనుచున్
తొందరగ మీకు భక్తిన్
వందనమిడి బయలుదేరి వచ్చితి తల్లీ!

7. వచ్చినదాది మనంబున
నచ్చటి ముచ్చట్ల దలచి యానందముతో
పుచ్చుచునుంటిని కాలము
యిచ్చక మిదికాదు తల్లి యెంతయు నిజమౌ!

8. భగవంతుని సృష్టిదియని
యుగయుగములనాటినుండి యుండినరూఢిన్
తెగనాడి కాదటంచును
తగురీతిని జెప్పితీవు, తల్లీ! నిజమున్

9. అమ్మా! నిత్యము మిమ్ముల
నెమ్మనమున దలతునమ్మ నేమముతోడన్
యిమ్మొక యాశీర్వాదము
తమ్ముడు పంపంగ నాకు తప్పక చేరున్

# బుద్ధుడే చిన్నమ్మ

చిన్నమ్మను దర్శించిన నాకు (నాకే కాదు, దర్శించిన వారికందరకూ అనుకుంటాను) ఆమె మాటలు విని మననం చేసుకొన్న మీదట వెనుకటి నడతంతయూ వెర్రినడతయే అనిపించును. అయినను అప్పుడప్పుడు సృష్టికర్త, భర్త, హర్త అన్నియూ భగవంతుడే అని వేదములు, శాస్త్రములు మొదలగునవి ఘోషిస్తున్నవని చెప్పుచున్న గొప్ప గొప్ప పండితుల, వేదాంతుల మాటలను ఒక్కసారిగా త్రోసివేసి ఒ అంటే న రాని ఒక ముసలమ్మ "ఈ సృష్టి దేవునిది కాదు" అని ఏమేమో చెప్పినంత మాత్రముతో నమ్మవలసిందేనా అని నరనరాన, రోమ రోమాన జీర్ణించియున్న తత్వం ప్రశ్నిస్తోంది. అప్పుడు వెంటనే యీ ముసలమ్మ మాటలకును, రెండు వేల సంవత్సరముల క్రిందట ప్రపంచ ప్రఖ్యాతిగాంచి అందరిచే పూజింపబడిన బుద్ధుడు ప్రవచించిన మాటలకును భేదమేమన్నా వున్నదేమో పరిశీలించి చూడుమని సమాధానం వచ్చింది. అప్పుడు బుద్ధుని జీవితమును గురించి, ఆయన బోధలను గురించి తెలుసుకొనుటకు తత్సంబంధమైన గ్రంథమొకటి సంపాదించి చదవనారంభించాను. ఆరు సంవత్సరాలు శరీరాన్ని శుష్కింపజేసుకుని ఘోర తపస్సు జేసి, తుదకు నిష్ఫలమని గ్రహించి ఆయన చెప్పినదిది :-

మ॥ ఉపవాసంబులు, ప్రార్థనల్, జపములున్,
హోమముంబులున్ వ్యర్థముల్
కృపమై నీయవి తానెవండుగొను?
మీరీ లంచముంజేసి, పా
ప పథంబుం గడద్రొక్కనేర్తురె? కడుం
బ్రాపించు నిద్దాన, దే
హ పరిశ్రాంతి, వృథా పరిశ్రమమునన్
బ్రారబ్ధముల్ బోవునె?

తే॥ పనికిమాలిన కలుపు నవ్వలకు ద్రోసి
మంచి విత్తనములు చల్లు మానవునకు

ఫలము నిరవద్యముగ కల్గుభంగి, పాప
కృతులెడపు వారలకు పుణ్యగతి లభించు

సారాంశమేమన అమ్మ చెప్పిన విషయాలకును, నేను చదివిన యీ గ్రంథములోని విషయాలకును తేడా ఏమీ కనుపించలేదు.

– భక్తులొకరు

# చిన్నమ్మ
## శతకము

తే. పరుల నని తెచ్చుకొనకుము బాధ నెపుడు
పరులు అన్నారటంచును బాధపడకు
పరుల జోలేల నీకని పలుకు నమ్మ
వినుము చిన్నమ్మ మాటలు కనుము నిజము. 1

తే. చేతయే గీత యని నమ్మి చేతమందు
మంచి కర్మను చేసిన మంచి ఫలము
పొందనగు నంచు పలుకును పొందుగాను
వినుము చిన్నమ్మ మాటలు కనుము నిజము. 2

తే. చేతయే గీతయై నీకు చెడునొ, మేలొ
చేయుచుండును గావున చేయు పనులు
మంచివై యుండులాగున మసలు డవని
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 3

తే. నీవు చేసిన కర్మయే నిన్ను పట్టి
కుడుపుచుండను మాటయే కడు నిజంబు
గాన మంచిని చేయగా గడగవలయు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 4

తే. ఎట్టి బీజంబు నాటిన అట్టి ఫలము
పొందుదువు గాని అన్యథా పొందలేవు
అట్టులే కర్మఫలమని అరయవలయు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 5

తే. మంచి నడతయె దేవుడై మించు యిలను
చెడ్డ నడతయె కాలుడై చెరుపుచేయు
బొమ్మలకు చేయు పూజలు వమ్మె యగును
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 6

తే. తాను చేసిన బొమ్మయే తనకు దైవ
మనుచు భావింప వెట్టియే అనగవలయు
తనదు మంచి ప్రవర్తనే తనకు దైవ
మనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 7

తే. విన్నవారిదె వినినది వేరుకాదు
చూచునది చూచువారిదె చూడ జగతి
తిన్నవారిదె తినినది ఎన్నభువిని
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 8

తే. కోపమన్నది నీలోన కూడియున్న
బయటి కోపంబు తప్పక బాధపెట్టు
అట్టివే గుణములనుచు నరయువలయు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 9

తే. తీర్పరివి కాకుమెపుడును తెలుసునంచు
స్వయముగా నీవె తీర్పింప బడయవలయు
అందులోననె సుఖమును పొందనగును
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 10

తే. ఒకడు బాజారునందున యొకని గాంచి
తనదు మిత్రుడే యంచును తలచి మదిని
కౌగలించు కొనంగను కడకు జేర
కాని వానిని గాంచియు కలతజెందు. 11

తే. అట్టులే నాది యనునది యంతకూడ
ఋణము తీరిన వెనుకను కాని దాని
వలెను కాన్పించు చుండును యిలను మనకు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 12

తే. విషయములు పెంచు జన్మలు విరివిగాను
విషయములు పెర్గు భ్రమచేత విరివిగాను
భ్రమను ఖండించు నద్దియే బ్రహ్మచర్య
మనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 13

తే. సత్య శాంత దయాదులే నిత్యమైన
సౌఖ్యమీయంగ దగినట్టి సంతతిలను
కొడుకు కూతుళ్ళు సుఖమును కూర్చలేరు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 14

తే. భర్తభావంబు నశియించి భవ్యమైన
తండ్రి భావంబు స్త్రీలకు తగులునెడల
పురుషులను తొలగుడనుచు తరుణులెపుడు
పలుకలేరంచు చిన్నమ్మ పలుకు నెపుడు. 15

తే. భార్య భావంబు నశియించి భవ్యమైన
తల్లిభావంబు మగవార్కి తగిలెనేని
ఆవలకు పొండు మీరలు ఆడువారు
అనగలేరని పలుకును అమ్మ వినుడు 16

తే. కామ క్రోధాది గుణముల కగ్గమయితి
మనుచు యేడ్వంగ వలయును అనుదినంబు
కలుగు జాగ్రత్త ఆవిధి మెలగునెడల
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 17

తే. సిగ్గు నభిమానమును లేక సెలగునెపుడు
సిగ్గు నభిమానమును మీరి సెలగునపుడు
పిచ్చివాడని పిలతురు నొచ్చునటుల
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 18

తే. అప్పు తీర్చక యుండుట గొప్ప అఘము
అప్పుతీర్చిన పుణ్యంబు అబ్బదెపుడు
తలను పడియున్న బరువది తొలగునంతె
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 19

తే. లోక మర్యాద కొఱకు యీ లోకమందు
మనము జన్మించలేదని మనసునందు
తెలిసికొని జన్మరాహిత్యం దెలియవలయు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 20

తే. తన్ను దానెర్గజాలక యున్నయట్టి
స్థితిని జీవాత్మయంచును చెప్పనగును
అనుచు పలుకును చిన్నమ్మ అనుదినంబు
వినుము చిన్నమ్మ మాటలు కనుము నిజము. 21

తే. తెలిసియును తెలిసినట్టుల మెలగలేక
కలుషమార్గమునందున మెలగుదాని
అంతరాత్మని అందురు ఆత్మ విదులు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 22

తే. తనకు తెలిసిన రీతిగా తప్పకుండ
నడచుకొనుచుండు దానిని పుడమి మీద
ఆత్మయని చెప్పుచుందురు ఆత్మవిదులు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 23

తే. పైన చెప్పిన మూటికి బాహ్యమగుచు
వెలుగుచుండెడి దానినే వేత్త లిలను
అనుచు నుందురు పరమాత్మ అనును అమ్మ
వినర చిన్నమ్మ మాటలు కనర నిజము. 24

తే. వ్రాత యందలి పొరపాట్లు వరుసగాను
దిద్దుకొని పోవునట్లుగా దిద్దుకొనుడు
నడత యందలి పొరపాట్లు విడువకుండ
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 25

తే. జ్ఞానమన్నది లోనుండి జననమంది
పెరిగి పెద్దది కావలె తరువులాగ
పరుల బోధలు నీకేమి పనికిరావు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 26

## మాయ

తే. మాయశక్తికి లోబడి చేయు కర్మ
పట్టి కుడిపెడి వేళను బాధపడుచు
దేవుడా! అని ఏడ్చుట దేనికనును
వినుము చిన్నమ్మ మాటలు కనుము నిజము. 27

తే. మాయయే పుట్టజేయును మరల మరల
మాయయే పెట్టు కష్టాలు పాయకెపుడు
అనుచు తెలియక దేవుని ఆడిపోతు
రనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 28

తే. మాయ యనునదియే సృష్టి చేయుచుండు
చావు పుటుకల నద్దియే సలుపుచుండు
కష్ట సుఖముల కద్దియే కారణంబు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 29

తే. మాయ మమతలు రెండును మాయమైన
జన్మయును కష్టములుకూడ జనులకెపుడు

కలుగనేర వటంచును తెలియ వలయు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 30

తే. మనసు మాయలు రెండును మనకు ఒకటె
మనసు పోయిన వెనుకను మాయలేదు
మాయపోయిన జననంబు మాయమగును
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 31

## సాంగత్యము

తే. మల్లి తీవల దరినున్న మనకు మిగుల
హాయి నిచ్చు సువాసన పాయకబ్బు
సాధు సాంగత్య మిట్టిదే జగతియందు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 32

తే. ఉల్లిమడి చెంత జేరిన ఓర్వరాని
చెడ్డవాసన ముక్కులన్ చేరుచుండు
దుష్ట సాంగత్యమిచ్చును దుష్ట ఫలము
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 33

తే. కాంతి సాయంబు వలననే కనులతోడ
చూడ గలుగుచు నుంటిమి సుమ్మి యిలను
స్వయముగాచూడ కన్నులు బడయలేదు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 34

తే. శబ్ద స్నేహంబు వలననే జగతియందు
వినుచు నున్నాము రవములు వీనులలర
స్వయముగా వినుశక్తిని బడయలేదు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 35

తే. వాయు స్నేహంబు వలననే స్పర్శగుణము
కలిగి యుంటిమి లేకున్నయిలను మనము
స్వయముగా స్పర్శశక్తిని బడయలేదు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 36

తే. రసము స్నేహంబు వలననే రసనతోడ
రుచిని వర్ణించుచుంటిమి యుచితముగను
స్వయముగా అట్టిశక్తిని బడయలేదు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 37

తే. గంధ స్నేహంబు వల్ల నాఘ్రాణ శక్తి
కలిగి యుంటిమి అన్నది తెలియవలయు
స్వయముగా అట్టి శక్తిని బడయలేదు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 38

తే. పంచ భూతాత్మకంబైన పాడు జన్మ
ఎంచి చూడగ నిజశక్తి హీనమైన
జన్మయని నిశ్చయంబగు జగతియందు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 39

తే. కల్లు త్రాగిన మనుజుని కరణి ధరణి
భూత పంచక మైదింటి పొత్తు కలిగి
తెలియ నేరక నిజమును మెలగుచుంటి
మనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 40

తే. కాంతి సాయంబు చేతనే కంటితోడ
వస్తువులు చూడ గల్గుట వసుధ యందు
కాంతి లేకున్న చూచుట కల్ల సుమ్మి
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 41

తే. అంధకారపు సహవాస మవని యందు
మనల గోతిని దింపను మాట యందు
లేదు సందియ మావంత లేదు సుమ్మి
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 42

తే. అట్టులే జ్ఞాని సహవాస మవని యందు
తగిన రీతిని పరమాత్మ దర్శనముకు
సాయపడుచుండు మనలకు పాయకెపుడు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 43

## భక్తి

తే. మంచి మొక్కల కంటును యెంచి మనము
కట్టుకొను భంగి జ్ఞానుల కడకు చేరి
ఆత్మశక్తిని పొందుట అవుసరంబు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 44

తే. పండియుండిన పొలములో పరిగ దొరకు
ఊసరక్షేత్ర మందేమి ఒరగు నీకు

ఆత్మశక్తున్న వారినే ఆశ్రయింపు
మనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 45

తే. ఫలము లేమైన మనకిల వలయునేని
ఫలము, ఫలమంచు నూరక పలవరింత
పెట్టకయె పండ్లు బడయగ చెట్టు కడకు
చేరుచుండు మటంచును చెప్పునమ్మ. 46

తే. కాని, దేవుని విషయమై కనులుమూసి
దేవుడా! దేవుడా! యంచు దేవురిస్తు
కాలమంతయు వూరకే గడుపు చుంటి
మనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 47

తే. ఆత్మ శక్తినె దైవ శక్తనుచు నుంద్రు
మనుజులందునె ఆశక్తి మసలుచుండు
అట్టి శక్తిని కలిగిన యట్టివారె
గొప్పవారని చిన్నమ్మ చెప్పునెపుడు. 48

తే. అట్టి జ్ఞానుల దరిజేరి నహరహమ్ము
సేవజేసిన ఆ శక్తి చేరు మనల
అట్టి యత్నము చేయక వట్టి మాట
లేల యని పల్కు చిన్నమ్మ మేలుకొనుడు. 49

ఆ॥ పొలము నందు నెరువు పోసిన వెంటనే
ఫలము రాని పగిది యిలను మనకు
ఆత్మశక్తి సేవ అట్టిదే భువిపైన
అనుచు పలుకు చుండు అమ్మవినుడు. 50

ఆ. కూడు తినెడి వేళ కూడునే తిందువు
వలను పడవు యితర పనులు ఏవి
ఒకటి చేయు వేళ నింకొక టెట్లగు
అనుచు పలుకుచుండు అమ్మ ఎపుడు. 51

ఆ. ఆవిధంబుగానె అవనిలో మనలకు
లోక పనులు చేయ లౌక్యమబ్బు
ఆత్మశక్తి అపుడు అబ్బుట సున్నరా
అనుచు పలుకుచుండు అమ్మ వినుడు. 52

తే. పండ్లుగల చెట్టునుండియే పండ్లు దొరకు
ఎండిపోయిన చెట్లేమి యిచ్చు నీకు

పండిపోయిన జ్ఞానుల పటము వల్ల
ఫలము లేదని చిన్నమ్మ పలుకు చుండు. 53

తే. జ్ఞానులగు వారి దరిజేరి పూని మదిని
భక్తితో గొల్చుచుండిన శక్తి కొలది
ముక్తి ప్రాప్తించు జీవికి ముదము హెచ్చు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 54

తే. రాతి బొమ్మను నిలబెట్టి రాత్రి బగలు
నీవె దేవుడ వోయి, నన్ బ్రోవు మనుచు
ఏడ్చుచుండిన లాభంబు యేమి లేదు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 55

తే. పటము నందలి గోవుకు భక్తి మీర
పూజలను చేసి దుగ్ధంబు పొందువారు
కలర భువి యందు చూడగ కలనునైన?
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 56

తే. బెల్లమని కాగితము పైన పేర్మి వ్రాసి
నాకి చూచిన లాభంబు లేక యుండు
రామకోటులు వ్రాసిన రాదు ముక్తి
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 57

తే. రామ కృష్ణా యటంచును రాత్రి బవలు
నోరు నొవ్వగ నుడివిన తీరు కష్ట
మనెడి మాటలు నమ్ముట కనువు పడవు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 58

తే. దేవుడో! దేవుడో! యంచు దేవురిస్తు
కాలమంతయు గడిపిన కలుగు లాభ
మేమి యుండ దటంచును యెరుగ వలయు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 59

తే. కష్టములు వచ్చి పైబడి కళచువేళ
దేవుడా! నీకు మ్రొక్కెద బ్రోవుమనుచు
లంచ మీయంగ బూనిన లాభ మేమి?
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 60

తే. దేవుడా! యిట్టి కష్టాలు దేని కీవు
పెట్టుచున్నావటంచును పెద్దగాను

గోలచేయుట పూర్తిగా బేల తనమె
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 61

తే. ఇట్టి పాపిష్టి జన్మల కట్ట బెట్టి
బాధలను పెట్ట నేలరా బ్రహ్మ యనుచు
వెఱ్ఱిగా యేడ్చుచుండుట వెడగుదనమె
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 62

తే. ఆమయము వచ్చి కష్టంబు లడరువేళ
బత్తితో నాదు వెంట్రుక లిత్తు నీకు
అంచు లంచంబు జూప తలంచ రాదు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 63

తే. మనకువలె దేవునికి కూడ తినెడి యిచ్ఛ
యున్నదంచును ముందుంచి అన్నమింత
తినర యనుచును పల్కుట దేనికయ్య
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 64

తే. పొగడు చుండిన సుఖములు పొసగ జేసి
పొగడ కుండిన కష్టముల్ నెగడ జేసి
మెలగు వాడెట్టి దేవుడో తెలుసుకొనుడు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 65

తే. పూజ చేయుచు నుండిన పుణ్యమిచ్చి
చేయకుండిన పాపంబు పాయకిచ్చి
మసలు వాడెట్టి దేవుడో మనుజులార!
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 66

ఆ. బొమ్మ సేవ చేయ పొందు లాభము లేదు
పటము పూజవల్ల ఫలము సున్న
అమ్మ నెపుడు మీరు అటుల చేయకుడంచు
మనకు చెప్పు మాట మరువ వలదు. 67

## సాధన

తే. యోగ బలమున మనసును యొడిచిపట్ట
వీలు పడునంచు పలుకుట వెఱ్ఱిమాట
పట్టుటుండిన విడచుట అట్టె యుండు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 68

తే. చీరకుండిన రంగును చెరప నెంచి
పెట్టెలో దాచియుంచిన అట్టె యుండు
అణచి పెట్టిన మనసుయు నంతె యగును
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 69

తే. ముక్కు బిగియించి జపమున మునుగువారు
అలుపు నెఱుగక భజనలు సలుపువారు
ముక్తిమార్గము నెఱుగని వ్యక్తులయ్యు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 70

తే. అనుభవించెడి కర్మను అట్టిపెట్టి
అన్న పానంబులను మాని కన్ను మూసి
పూన హఠ యోగములు ముక్తి గానరెపుడు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 71

తే. మేకపోతు పులిని మ్రింగెద నను మాట
వెడగు తనము గాదె పుడమి మీద
పట్టె దాత్మ ననెడి పలుకుయు నంతెరా
అనుచు పలుకు చుండు అమ్మ ఎపుడు. 72

తే. మనము మౌనము పట్టుట మంచి కాదు
మౌనమే పట్టవలయును మనల నెపుడు
ఆత్మ శక్తున్న వారికే అదియు నబ్బు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 73

## గురువు

తే. మదిని రహితంబు గావించు నదియె గురువు
వేరె గురువుండె ననుటది వెఱ్ఱి తనము
సత్య వర్తన మన్నదే నిత్య శిష్యు
డనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 74

తే. మేము గురువుల మనుకొను స్వాము లిలను
ఋణము తీర్పగ వచ్చిన ఘనులె యయ్యు
క్రొత్త ఋణమును మరికొంత కూర్చుకొంద్రు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 75

తే. తప్పులను తెల్పు శక్తియే తగిన గురువు
అట్లు నడచెడి నద్దియే అంతెవాసి

గురువు శిష్యులు మనలోనె కూడి యుండు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 76

తే. గురువు శిష్యులు అను మాట ధరణి యందు
ఏరికిన్ కూడ దంచును ఎరుగ వలయు
మంచి నడతనె గురువుగ ఎంచ వలయు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 77

తే. అమల మనసుయె గురువగు అవని యందు
సత్య వాణియె యుపదేశ సారమగును
శిష్యుడన మంచి నడతయె చివర కగును
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 78

తే. తనదు రకమును గాంచుటె తారకంబు
తనదు రకమును తెలియక తన్నుకొనెడి
గురువులను నమ్మి యుండుట కూడదయ్య
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 79

## ఆత్మ

తే. కాల్చు శక్తెట్లు నిప్పుకు కలిగి యుండొ
కలుగు సన్యాసి శక్తికి ఖండగుణము
అట్టి శక్తినె యందురు ఆత్మ శక్తి
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 80

తే. ఖండ ఎరుకది మనలోన యుండెనేని
వృత్తు లన్నిటి ఖండించి సత్తెమైన
మార్గమును చూపు మనకని మాత పలుకు
వినుము చిన్నమ్మ మాటలు కనుము నిజము. 81

తే. దంతి మ్రింగిన అల కపిద్ధంబుపగిది
ఆత్మ శక్తిని కలిగిన యతని లోని
మాయ యంతయు కానక మాయమగును
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 82

తే. మాయ శక్తిని ఖండించు మంచి శక్తి
ఖండ శక్తను పేరున కలదు యొకటి
అదియె వృత్తుల నన్నిటి వదల జేయు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 83

తే. దొంగ, దొరకంట పడినచో దొంగతనము
అంత మగురీతి, ఎవనిలో ఆత్మ చూచు
అతని వృత్తులు అన్నియు అంతమగును
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 84

తే. వెచ్చ జేసిన విత్తనా లెచ్చటైన
మొలక లెత్తుట గాంచిరే యిలను మీరు
అట్టులే ఆత్మ శక్తనే అగ్ని తాకి
కామ క్రోధాది గుణములు కానరావు. 85

## జన్మ రాహిత్యము

తే. అగ్ని తాకిన కట్టెట్లు బుగ్గి యగునొ
ఆత్మ తెలిసిన జీవాత్మ అంతె యగును
జన్మ రాహిత్య మద్దియే జగతి యందు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 86

తే. కోర్కెయే పెక్కు జన్మలు కూడ బెట్టు
జన్మయే కష్టము లకిక్క జగతి యందు
కోర్కెలను చంపు శక్తున్న కూడు ముక్తి
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 87

తే. జన్మ రాహిత్యమును కోరు జనులు భువిని
భ్రమను ఖండించు శక్తిని బడయు నెడల
జన్మ రాహిత్య మబ్బును జగతి యందు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 88

తే. మాయ శక్తికి లొంగక మసలు నెడల
కర్మ రాహిత్య మనునది కలిగి తుదకు
జన్మ రాహిత్య మనునది జరిగి తీరు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 89

తే. ఇచ్ఛ ఖండింప బడుటకే యిట్టి జన్మ
కలిగి యుండిన దనుటకు కారణంబు
శుక్ల శోణితములె మీరు చూడు డిలను
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 90

తే. ఇచ్ఛ జరిపెడి పూజలే హెచ్చవేత
తీసివేతలు కావని తెలిసి కొనుడు

తీసివేతలె ముక్తికి తీయు దారి
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 91

తే. జన్మ కలుగుట యన్నదే జగతి యందు
అప్పు తీర్చుట కంచును అరసి మనము
నడచు కొన్నను ముక్తిని బడయగలము
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 92

తే. తెలిసి యుండిన వృత్తిని తెలిసి నటుల
నడచు చుండిన క్రమముగ కడకు మనకు
వృత్తులన్నియు నశియించి ముక్తి మిగులు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 93

తే. చావు పుట్టుక లన్నవి సమసి నపుడు
కష్ట సుఖములు రెండును కడకు ముట్టి
శాశ్వతానంద మన్నది జనుల కొదవు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 94

## పరమాత్మ

తే. శబ్ద రూపాది రహితుడే జగతి యందు
పిల్వ బడు పరమాత్మను పేరు తోడ
పంచకంబును తప్పగు ఎంచి చూడ
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 95

తే. ఇరులు రవి కెట్లు లేవొ యీ ధరణి యందు
లేవు గుణములు పరమాత్మ కేవి కూడ
కష్ట సుఖములు కూర్చునా అట్టివాడు?
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 96

తే. కాను పించెడి పగలద్ది కాదు పగలు
పంచ భూతాత్మకంబైన పగలు అద్ది
స్వప్రకాశంబుతో నున్న పగలె పగలు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 97

తే. పదియునారు గుణంబులు బాసెనేని
స్వయముగా జూడ వచ్చును స్వప్రకాశు
సందియం బేమి లేదిట సత్య మిద్ది
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 98

తే. ఆత్మ పరమాత్మ చేరుట అన్నమాట
వట్టి మాటంచు నమ్ముడు గట్టిగాను
నిండుగా యుండి దూర సందుండ దనును
వినుము చిన్నమ్మ మాటలు కనుము నిజము. 99

తే. ఎల్లెడల తానెయై యుండి పెల్లుగాను
వెలుగు చుండెడి దేవుండు వెత్తి యగుచు
గుడుల యందుండు నను మాట కూడదయ్య
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 100

తే. నిర్గుణుండని దేవుడు నీవె చెప్పి
సగుణుడై పుట్టు ననుచును సణగ నేల
ఎట్లు పొసగును రెండును యెరుగ రాదు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 101

తే. జనన మరణంబు లన్నవి సాగుచున్న
దేవుడెట్లగు నాతడు తెలిసి కొనుడు
కాన, దేవుడు పుట్టుట కల్ల మాట
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 102

తే. మనకు వలె ఆతనికి కూడ మనము నందు
కోప తాపము లన్నవి కూడి యున్న
దేవు డెట్లగు, నాతడు దేబె యగును
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 103

తే. దుష్టులను చంప దలచియు ముష్టి జన్మ
ఎత్తవలసిన అవుసరం బేమి కల్గు
అట్టి తలపేల అతనికి అంట గట్ట
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 104

తే. అభవుడని పిల్వబడు వాడు అవని యందు
దుష్టులను చంపగా నెంచి యిష్ట పడియె
ప్రభవ మందు నటంచును పలుక రాదు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 105

తే. పందిగా పుట్టి నాడని పలికినావు
చేపగా పుట్టి నాడని చెప్పినావు
ఇట్టి పుట్టుక లతనికి కట్ట బెట్ట
వల దటంచును చిన్నమ్మ పలుకు చుండు. 106

తే. సగము జంతువు మిగిలిన సగము నరుని
వలెను అవతార మెత్తెనా వసుధయందు
పిచ్చి వ్రాతలు ఏలరా పిచ్చి తండ్రి?
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము. 107

తే. కూర్మముగ పుట్టినాడని కులికినావు
కర్మ ఏముండి దేవుడు కడకు యిటుల
పాడు జన్మలు ఎత్తెరా? పలుకవేర?
అనుచు ప్రశ్నించు చిన్నమ్మ కనర నిజము. 108

# ఇతర పద్యములు

## అష్టమద గజములు

సీ. అని తెచ్చుకొనకుము, అన్నది తేకంచు
మాత మనకు చెప్పు మంచి మాట

కని తెచ్చుకొనకుము, విని తెచ్చుకోకని
మాత మనకు చెప్పు మంచి మాట

కానిది తినకుము, కానిది తేకంచు
మాత మనకు చెప్పు మంచి మాట

తేకుము యివ్వక, తేకంచు అచ్చుక
మాత మనకు చెప్పు మంచి మాట

తే. ఇవియె అష్ట మదగజంబు లిలను కనుము
లాగి ప్రకృతి లోనికి బాగ మనల
బాధ పెట్టును, జాగ్రత్త పడుడు మీరు
అనుచు పలుకును చిన్నమ్మ కనుము నిజము.

తే. తెచ్చుకొనకుండ యుండెడి తెలివి లేక
మెలగు చుండెడి యట్టి దుర్బలము యున్న
అట్టి దానిని ఖండించు ఆత్మశక్తి
ఐడసి యానంద మొందుడు తడయ కికను

# తక్కువేమి?

సీ. అన్న ధర్మరాజు అంగిట యందున్న
తక్కువేమియు లేదు తలచి చూడ

న్యాయంబు తప్పని వాయు సుతుండున్న
తక్కువేమియు లేదు తలచి చూడ

ఆచరణంబను అర్జునుం డండైన
తక్కువేమియు లేదు తలచి చూడ
సత్సంగ మనియెడి సహదేవ నకులున్న
తక్కువేమియు లేదు తలచి చూడ

తే. వనిత ద్రౌపది వైరాగ్య మనునదున్న
తక్కువేమియు లేదిక తలప మనకు
అర్జురుంగూడ మనలను అంటియున్న
తక్కువేమియు లేదిక ధరణి మనకు.

# తలక్రిందుల చెట్టు

సీ. తలలేని భ్రాంతియు తల్ల క్రిందుల చెట్టు
శిరము క్రిందికి పైకి చేరు వ్రేళ్ళు
రేపు మాపును కూడ మోపుగా మేయుచు
పనికి మాలిన వాక్కు పలుకు చెట్టు
తన్ను దా నెరుగదు దాని గుణంబేమొ
దాని డంబము చూడ దగని చెట్టు
తెలిసి కొందమటన్న తెలియని చెట్టది
ఎరుగని వారికి మరుగు చెట్టు

తే. ఎరిగి యుండిన నయ్యది పరుగు దీయు
పరుగు దీసిన కొలదిని తరుగు చెట్టు
నేను పోయిన పండిన ప్రమాను అద్ది
పండి పోయిన ఆ చెట్టు పాయసంబె.

## ఏది గొప్ప?

సీ. దేహమే ఘనమని తెలుపుద మటయన్న
నిశ్వాస శ్వాసపై నిలచు నద్ది
శ్వాస నిశ్వాసలు శాశ్వత మందుమా
బ్రతుకు జీవుని జేరి సతత మవ్వి
అంతటి జీవుండు నదియేమి చిత్రమో
ప్రారబ్ధ కర్మకు బద్ధు డగును
ప్రారబ్ధ కర్మయే ప్రబల మైనదటన్న
అహము చేతిలో నద్ది ఆడుచుండు
అంతటి అహమును సుంత చేయగ లేక
నీతికి బద్ధమై నిలచి యుండు
అట్టి నైతిక శక్తి అదియేమి మాయయొ
వైరాగ్య చూపుచే వై దొలంగు

తే. అట్టి వైరాగ్యమును కూడ ఆత్మ దరిని
అణగి యుండును నిరతంబు అణువు పగిది
గొప్పదగు నాత్మ కూడను తప్పకికను
భక్త జనముల పాలిటి భాగ్యమగును.

## మంచి ఏది?

సీ. పరమాత్మ భావంబు కలవారి పజ్జను
పడి యుండుటే నీకు పాడి యగును
పరమాత్మ భావంబు కలవారికిం జేయు
సేవయే సరియగు సేవ యగును
పరమాత్మ భావంబు కలవారికిం బెట్టు
ఫలములే సరియగు ఫలమునిచ్చు
పరమాత్మ భావంబు కలవారికిం జేయు
దానమే సత్పాత్ర దానమగును

తే. చేతయే గీత యగు మాట సత్య మనుచు
చెప్ప గలిగిన యట్టి యా గొప్పవారి
పల్కు లాలకించియు నీవు పరమ ఆత్మ
దర్శనంబైన జ్ఞానుల దరిని జేరు.

# ఎవరిది వారిదే

సీ. ఒక చోట నొక మాట ఒకడు విన్న ఫలంబు
అనుభవించునె వాడు, అన్యుడెట్లు?

ఒక పండులో నుండు ప్రకటమౌ రుచులెల్ల
తిను వానిదే యంచు తెలిసికొనుము

ఒక చిత్రశాలలో చకచకల్ కనుసొంపు
చూచు వానిదెగాక జూచునెవడు?

గాఢ నిద్రలో గల్గు కమ్మని సౌఖ్యంబు
నిద్రించు వానిదె నిజము దలుప

తే. అన్ని ఫలములు వారినే యంటినట్లు
మనల కోపాన ఒరులన్న మాట కూడ
అన్న వారిదె గాక యెట్లౌను మనకు
ఇంత మాత్రంబు తెలియదా చింతజేయ.

# మంచిచెడులు

ఉ. మంచియు చెడ్డయున్ గలిసి
మానవ జన్మము వచ్చు, లోపలన్

గాంచిన వాటినే బయట
గాంచుచు నుందుము, మంచి వారికిన్

మంచియె గానుపించు, చెడు
మానిసి కెప్పుడు చెడ్డతోచు, ఊ

హించిన అందు యిందు మన
దేమిటి తప్పు, విచిత్ర మారయన్.

# ప్రార్థన

సీ. శబ్దమాతా! నాదు జన్మ ఎందుకు వచ్చె
యెందుకు విందునో యెరుగ నేను

నీకు తెలియును గాన నీవు దోషమటన్న
వినుటయే మానెద విరతి గల్గి

వాయుమాతా! నేను వచ్చిన దెందుకో
నిను పీల్చ నేలనొ నేను యెరుగ

నీకు తెలియును గాన నీవు దోషమటన్న
శ్వాసనే మానెద శాశ్వతముగ

ఆకారమాత! నా ఆకార మేలనో
యెందుకు చూతునో యెరుగ నేను

నీకు తెలియును గాన నీవు దోషమటన్న
కాంచుటే మానెద కడకు నేను

భూమాత! నేనేల పుట్టితినో యిందు
యెందుకు నడతునో యెరుగ నేను

నీకు తెలియును గాన నీవు దోషమటన్న
నడచుటే మానెద పుడమి మీద

అన్నమా! నా జన్మ అసలెందు కయ్యెనో
యెందుకు తిందునో యెరుగనైతి

నీకు తెలియును గాన నీవు దోషమటన్న
తినుటయే మానెద తెలివి గలిగి

రసమాత! నా జన్మ అసలెందు కయ్యెనో
యేల త్రాగుదొ నేను యెరుగనైతి

నీకు తెలియును గాన నీవు దోషమటన్న
త్రాగుటే మానెద తప్పకికను

తే. మీరు ఆర్గురు లేనట్టి పరమ ఆత్మ
దర్శనంబగు వరకును దాసు నగదు
మీదు దాస్యము కోరను నాదు మదిని
మీరలే నన్ను విడనాడి తీరవలయు
నేను మిమ్ముల విడచుట నేరదెపుడు.



# పాటలు

## 1వ భాగము

## (గీతార్థ సారము - మాదిరి)

1. చేతార్థ సారమె గీతా
దాని ననుభ వించుటె నవ నీతా
చేతయే గీతని చిత్తమందెరిగియు
దేనిది దానిది దత్తము చేయుడు

ఇచ్చు మాయను యెరిగి మనమున
వచ్చు మాయను తుచ్ఛ మనుచు
మాయకందక మసలు వారిల
మరల జన్మము పొందరెన్నడు ॥ చే ॥

2. మాది యనునది మీదె గనుకా
ఇక మీది మీకిచ్చిన వెనుకా
మీది మీ కిచ్చిన మాదను మమతకు
లేదు తా వింతయు లేశమైనను గాని

మమత పోయిన వెనుక మనకిక
మనసు యన్నది గాన దెందున
గాన వచ్చెడి దాత్మయే యని
మానసంబున నెరుగ వలయు ॥ చే ॥

3. మనసు మాయమైన వెనుకా
మన ఆత్మే పరమాత్మ గనుకా
అయ్యదే స్థిరసౌఖ్యమని నమ్మి మదియందు
దానిని పొందగ పూని చరించుడు

నిండు భక్తిని కలిగి మదిలో
ఖండ ఎరుకను ఎరిగి బాగుగ
వుండు స్థితియే యుత్త మంబని
పండు లూడిన అమ్మ చెప్పును ॥చే॥

4. నీ చేతయె నీదగు రాతా
అద్ది తుడువ శక్యముగాని గీతా
చేతయె గీతని స్థిరముగ నమ్మియు
చేత లుడగ వలయు చిత్త శుద్ధిగాను

చేత లుడిగిన నాడు నీకిక
జన్మ యుండ దటంచు నిత్యము
అమ్మ చెప్పెడి మాటలను నీ
వాలకించి నడచు కొనుము ॥చే॥

## 2

### (కలనిజమాయెగా మాదిరి)

1. నీదుకర్మ నీదెరా - రాదు వేరె కర్మరా
అనెడి మాట నమ్మరా - అదియె తప్పక జరుగురా

జన్మరహితకై కర్మలు చేయుచు
పాత కర్మలను బాపు కొనుచు
యుండిన నీకు జన్మలు యుండవు
అనెడి మాటలు నమ్మరా॥ నీ॥

2. తెలిసికొన్న తెలియదూ - తెలిసియున్న లేదురా
ఆత్మశక్తి యున్నను - వృత్తులన్నియు వదలురా

వృత్తులు అన్నవి యూడక వుండిన
ముక్తి అన్నది కల్గుట జరుగదు
గావున వాటిని కాల దన్నుచు
కదలి నీవు పోవలెరా॥ నీ॥

3. ముక్తి ముక్తి అంచునూ - నోరు నొవ్వగ అంచునూ
యుండిన లాభము లేదురా - ఆత్మ శక్తిని పొందరా

ఆత్మ శక్తిని పొందగ నీవు
అట్టి శక్తిని గలిగిన వారిని
చేరి నీవు సేవలు జేసిన
చేరును నీకు అశక్తి ॥ నీ॥

4. బోధ గురువుల చేరకా - బాధలు నీవు పొందకా
ఆత్మ శక్తుల చేరరా - అదియె నీకు మేలురా

కావున నీవు వేగమె లేచి
జాగును చేయక ఏమాత్రము
ముక్తి మార్గమును చూపెడి యట్టి
ఆత్మ శక్తులను చేరరా ॥ నీ॥

5. ఎన్ని చదువులు చదివినా - ఎంత పాండితి యుండినా
పూజలు ఎన్ని చేసినా - జపములు పెద్దగ సల్పినా
వచ్చెడి పుణ్యము లేదుర యికను
పిచ్చి పనులు మానర యికను
సత్యంబైన మార్గమునందు
జనరా నీవిక ఓ నరుడా ॥ నీ॥

## 3

## (సత్యమంగళ నాను సీతా - మాదిరి)

1. సర్వ గుణముల రూపు మాప బాబూ లేరా
నిర్వికార సౌఖ్య మంద లేచి రారా । స॥
2. వాదములతో వచ్చునది లేదూ లేదూ
నీలోన నున్న మలిన మేమి పోదూ పోదూ । స॥
3. లోన నున్న మాయ యంతా ఖాళీ ఖాళీ
చేసి వేయ లేచి రారా జల్దీ జల్దీ । స॥
4. రాళ్ళు రప్పల పూజచేస్తే రాదూ ముక్తీ
రంగ యనుచు అంగ లార్చిన యేదీ రాదూ । స॥
5. నాదు కొరకు కాదు అనుచు భాయీ నీవూ
పరుల వద్ద భిక్షమెత్త రాదూ రాదూ । స॥
6. సంఘ సేవ చేస్తే ముక్తి నాస్తీ నాస్తీ
మెప్పు బొందగోరి నీవు చేయాబోకూ । స॥
7. మెప్పు వల్ల ముప్పు వచ్చు భాయీ భాయీ
అట్టి పనికి పూనుకోకు భాయీ భాయీ । స॥
8. పరుల కోసము చేస్తే నీవు భాయీ భాయీ
పరుల వాడవె నీవే అగుదువు భాయీ భాయీ । స॥
9. మనసు, మాట, చేత ఒకటె అగుటే గీతా
గీత గీత యనుచు పల్కిన కాదూ గీత । స॥
10. చేత గీత యనెడి మాట చెల్లూ చెల్లూ
చెయ్యనిదె యేది రాదు భాయీ భాయీ । స॥
11. ఆత్మ శక్తి గలిగిన వారి సేవా నీవు
చేసి ముక్తిని బొంద వేగ రారా బాబూ । స॥

## 4

### (తెల్లవార వచ్చె మాదిరి)

1. ఆలు బిడ్డలనుచు - అన్న దమ్ములనుచు
మమతను పెంచక - మేలుకో
మమతను పెంచితే - యమ యాతనలు నీకు
కలుగుట తథ్యము - మేలుకో ॥

2. ఎల్ల కాలము నీవు - యిల్లు వాకిలనుచు
అల్లాగే యుండక - మేలుకో
కుళ్ళు సంసారమున - కుములుచు యుండిన
కలుగదు ముక్తని - తెలుసుకో ॥

3. చాటు బోధలు చేస్తూ - మూటలు గడి యించు
గురువుల మోసము - తెలుసుకో
చాటు బోధల వల్ల - చేటులుండు నని ॥
గట్టిగ నీమది - తెలుసుకో॥

4. తీర్ధ యాత్రల వల్ల - తీరు పాప మనుట
కల్ల మాట యని - తెలుసుకో
కల్ల మాటలు నమ్మి - కాలము గడుపక
తల్లి పలుకులు నీవు - తెలుసుకో ॥

5. శాస్త్ర పురాణాలు చదివిన మాత్రాన
జ్ఞానము రాదని - తెలుసుకో ।
జ్ఞానుల దరి జేరి - సేవ చేసినపుడె
జ్ఞానమబ్బునని తెలుసుకో

6. కాషాయ వస్త్రాలు - కట్టిన మాత్రాన
జ్ఞానులు కారని - తెలుసుకో ।
జ్ఞానులైన వారు - పూని వేష మెపుడు
వేయ రటంచును - తెలుసుకో ॥

7. పూజలు భజనలు - పుణ్యమీయ వనుచు
తెల్లముగా నీవు - తెలుసుకో ।
వక్ర మార్గమందు - వందేళ్ళు నడచిన
లాభము లేదని - తెలుసుకో ॥

8. దేవుడు నీవె నా - దిక్కని యేడ్చిన
కలుగదు ముక్తని - తెలుసుకో

మేలు కీడులు చేయ - మేదిని దేవుడు
పక్షపాతి గాడు - తెలుసుకో ॥

9. ఆత్మ శక్తులను - ఆశ్రయించి వుంటే
అందును ముక్తని - తెలుసుకో ॥
అన్య మార్గము వల్ల - ఆవంత లాభము
కలుగ దెన్నడని - తెలుసుకో ॥

## 5

## (నందామయా గురుడ - మాదిరి)

1) విందామయా మనము విందామయా
అమ్మ మాటలు మనము విందామయా ।

2) పోదామయా మనము పోదామయా
ఆత్మ శక్తిని పొంద పోదామయా ।

3) చేదామయా మనము చేదామయా
ఆత్మ శక్తికి సేవ చేదామయా ।

1. రహస్య వేదాంతులకు దూరమున నుండియే
ఒక్క దండము మీరు వదలండయా ।
సాలీడు గూటిలో వాలిన యీగల
చిక్కులో పడుటయే నిక్కమయా ॥ పో॥

2. సాధు సాంగత్యమె చక్కని మార్గము
పోదాము అందున రారండయా ।
ఆచరించగ మనకు అన్య మార్గము లేదు
భక్తి మార్గమె మనకు గత్యమయా ॥ పో॥

3. మంచి కర్మను జేసి మించిన ఆత్మను
పొందగా మీరలు రారండయా ।
చేతయే గీతని చిత్తమందెరిగియు
భక్తితో సేవను చేయండయా ॥ చే॥

4. ఆవు పటము తెచ్చి అర్చించి పూజించి
పాల నిమ్మని యన్న యివ్వదయా ।
విగ్రహంబు తెచ్చి వేయేండ్లు పూజింప
వచ్చున దేమియు వుండదయా ॥ విం॥

5. ఆత్మ శక్తనియడి ఆ విత్తనంబును
దివ్య పురుషుల నుండి పొందాలయా ।
పొట్ల విత్తనంబు పొందాలి మనమంటె
చెట్టు నుండియే అందాలయా ॥ పో॥

6. నిర్గుణుండగు వాని నీవె నా దిక్కని
ఏడ్చిన లాభము యేమిటయా ।
మాయ శక్తిని చంప చిన్నమ్మ లోపల
ఆత్మ శక్తి యొకటి యున్నదయా ॥ చే॥

7. మాయ సృష్టి తెచ్చి దేవుని సృష్టని
చెప్పుట తప్పని తెలియండయా
సూర్యుని లో నుండి చీకటి యేలాగు
వచ్చునో కొంచెము యోచించయా । ॥వి॥

8. పూజలు గీజలు పుణ్య మీయవని
చెప్పెడి మాటలు ఒప్పునయా ।
పరమాత్మ దర్శన భాగ్య మబ్బిన వారి
చేరి సేవించుటే క్షేమమయా ॥ ।వి।

9. అమ్మ మాటలలోని అర్థము తెలిసిన
ఆనంద మయముగ నుండునయా ।
అమ్మ లో నున్నట్టి ఆ యాత్మ శక్తిని
సేవించ అయ్యది మనదేనయా ॥ ॥చే॥

## 6

### (రాజేంద్ర వినుము విరాజితమగు - మాదిరి)

1. నరులార గనుడి యీ నరజన్మ సార్థకత
గను మార్గ మికనైననూ
అయ్యేదె మనకు పరమ భాగ్యము గనుకనూ
మానవ జన్మము – మరల దొరుకదు గాన
యీ జన్మ మందునె – గాంచుడు ముక్తిని
ముక్తి మార్గము గాన నేరక
మురికి సంసారంబులో పడి
శక్తి హీనులయ్యు మీరు
చచ్చి మరల పుట్టనేల ॥ ॥న॥

2. సత్యము తెలియ కా సత్యమార్గంబున
పిచ్చిగ పోరాదయా

అయ్యది విడచి సత్యమెరుగా రండయా
రాముడు కృష్ణుడు – రంగడు మొదలగు
వారల బొమ్మలు – వద్దుర పూజింప

అనుచు చెప్పెడి అమ్మ మాటల
అర్థమెరిగిన తప్పకుండను
సత్యమెయ్యదొ తెలియు గావున
శ్రద్ధగా వినరండి మీరిక ॥ ॥న॥

3. ఏనాడొ చనిన ఆ పూతాత్మ బొమ్మల
నేలర పూజింపనూ

అందున మీరు పొందరు ఏ లాభమూ
పటము నందున్నట్టి – పాడియావును మీరు
బ్రతిమ లాడినను – పాలనీయదు గాన

కదల మెదల లేని బొమ్మల
కాళ్ళు చేతులు పట్టి యేడ్వక
ఆత్మ శక్తుల దరిని జేరి
ఆశ్రయించుట మంచిదికను॥ ॥న॥

4. అజ్ఞానులార మీ అజ్ఞత పోద్రోలి
సుజ్ఞానమును గనుడీ

దానన హృదిని జ్యోతిని వెలిగించుడీ
తాజేయు కర్మయె – తనను నడుపుచు నుండ
రక్షింప మనుచును – రాతి బొమ్మల తోడ

చెప్పుకొన్నను ముక్తి మీ కిట
చేరబోదు గాన మీరలు
కర్మ రహితమైన బ్రతుకును
గడుప బూనుట మంచి దికను॥ ॥న॥

5. ఏ ఆత్మ పరమాత్మ దర్శనమూ గను
నదియె మహా ధన్యమూ

కావున యిల నదియె మనకు శరణ్యమూ
పరమాత్మ దర్శన – భాగ్య మబ్బని వారి
చేరి సేవించిన – చిన్నమైనను గాని

లేదు లాభమటంచు మదిలో
లెస్సగా నీ వెరిగితేని
బోధ గురువుల జేరి యెన్నడు
బాధలను బొందవికను ॥ ॥న॥

## 7

## ( భజనచేసే విధము - మాదిరి )

1. అమ్మ మాటలు ఆలకించండి - జనులార
అందలి అర్థమెరిగి ఆచరించండి
తన్ను దాను తెలియ నేరక
ఎన్ని జన్మములైన నెత్తుచు
నుండు దానినె జీవ ఆత్మని
ఖండితంబుగ పలుకునమ్మ ॥ అ॥

2. అంతరాత్మను తెలిసి కొనరండి - జనులార
దాని కర్థ మియ్యది మీరు వినరండి
తెలిసి నట్టుల మెలగ కిలలో
పలు తెఱంగుల నడచు కొనుచు
విలువ లేకయె యుండు దానిని
పలుకుచుందురు అంతరాత్మని ॥ అ॥

3. ఆత్మ యనగ నేమొ వినరండి - జనులార
దాని అంతరార్థము తెలిసి కొనరండి
తెలిసి నట్టుల తాను మెలగుచు
కలుష మార్గము నందు బోకను
విలువ గలిగి యుండు దానినె
యిలను ఆత్మని పలుకు నమ్మ ॥ అ॥

4. పరమాత్మ కర్థము తెలిసి కొనరండి - జనులార
మూటి కతీత మైనది అద్ది సుమండీ
వాటి కేటికి చెంద కిలలో
తనకు దానె సాటి యగుచు
మేటియై వెలుగొందు దానినె
ధాటిగా పరమాత్మ యనునూ ॥ అ॥

5. ముక్తి మార్గము వెదక రారండి - జనులార
దానిని అమ్మ తెల్పును మీరు నమ్మండీ

అమ్మ చెప్పెడి మాట లందలి
అర్ధమును మీ రెరిగి బాగుగ
ఆత్మ శక్తికి సేవ జేసిన
పూతమగు మీ జన్మ మిలలో ॥ అ॥

## 8

## (బ్రహ్మ ముహూర్తము వేళాయె - మాదిరి)

1. చేతయె గీతని, గీతయె రాతని
చిక్కు మాట లేవొ చెప్పు నమ్మ ।
అన్న ధర్మరాజు అంగిటలో యున్న
చిక్కు లుండ వంచు చెప్పు నమ్మ ॥
2. వచ్చు మాయ యంచు, ఇచ్చు మాయ యంచు
చిక్కు మాట లేవొ చెప్పు నమ్మ
నాది నీదె యంచు, నీది నీ కిమ్మంచు చి॥
3. అని తెచ్చు కోకుము, అన్నది తేకంచు చి॥
కని తెచ్చు కోకని, విని తెచ్చు కోకని చి॥
4. తినకము కానిది, తేకంచు అచ్చుక చి॥
తేకుము కానిది, తేకంచు యివ్వక చి॥
5. విశ్వమే విషయము, విషయమే విషమంచు చి॥
దొర యిట్టె చూచిన దొంగట్టె పోవని చి॥
6. ధనమున్న దొంగల ననయంబు పెంచని చి॥
జ్ఞానంబు లో నుండి జనన మొందు నంచు చి॥
7. జాగ్రదావస్థలో జాగ్రతుండు నంచు చి॥
జాగ్రత వచ్చిన అజాగ్రత లేదని చి॥
8. బ్రహ్మ చర్యమన్న భ్రమపైన చర్యంచు చి॥
పెరిగి పోయిన కొలది తరిగి పోవునంచు చి॥
9. వున్నది లేదంచు, లేని దున్నదంచు చి॥
కన్నదే నిజమని ఎన్నగావలె నంచు చి॥
10. మాయ పోయిన వెనుక మనకున్న దాత్మంచు చి॥
తెలిసి కొంటివి గాని తెలియలేదంచును చి॥
11. దైవ సృష్టి యంచు తలప రాదంచును చి॥
మాయ సృష్టి యిద్ది దేవునిది కాదంచు చి॥

12. దేవుని ప్రార్థింప దేనికి మీరంచు చి॥
లంచ గొండి గాడు యెంచగ అతడంచు చి॥

13. ఖండ యెరుక యొకటి యుండిన చాలంచు చి॥
ఖండ యెరుకొాక టుండి అఖండు డతడని చి॥

తే. చిక్కు మాటల అర్థంబు చిక్కనేని
చిక్కు మాటలు కావివి చక్కనైన
ముక్కు సూటిగ పలికిన ముక్కలంచు
చక్కగా తెల్సి పోవును ఒక్క సారె
చిక్కులన్నియు తొలగును చెక్కలయ్యి.

## 9

### (భజన చేసే విధము - మాదిరి)

1. కోర్కెలను వదలి వేయండి – ఓ భక్తులార
కోర్కెలే మన కొంప తీయండీ
కోర్కెలను చంపకుంటే – గోతి యందు పడక తప్పదు
గాన మీరు కోర్కెలను – కాలరాసి వేయుడికను ॥ కో॥

2. ఇచ్ఛలను పెంచ బోకండి – ఓ భక్తులార
మచ్ఛ మాపును మీరు నమ్మండి
ఇచ్ఛలను పెంచుచుంటే – వచ్చు చుండును పెక్కు జన్మలు
జన్మలే యిల నరక హేతవు – మర్మ మెరగి మెలగు డికను ॥ కో॥

3. మండుచున్న అగ్ని చూడండి – ఓ భక్తులార
తైలమున చల్లార దదియండి
అట్టులే యిల రేగుచున్న – యిచ్ఛ పరుల సొమ్ము చేతను
తరిగి పోక సుంతయైన – పెరుగు చుండును మీదు మిక్కిలి ॥ కో॥

4. ఆత్మ శక్తను జలముతో నండి – ఓ భక్తులార
ఇచ్ఛ యను దావాగ్ని నార్పండి
ఆత్మ శక్తను జలము మీరు – ఆత్మ శక్తుల వద్ద నుండే
పొంద శక్యము గాన వెంటనే – పోవుడికను వారి చెంతకు ॥ కో॥

## 10

వినరా బాబూ అమ్మ మాటను
వీనులు అలరగ నీ విపుడు

వినియు నీవు అమ్మను చేరియు
పొందుము సుఖము తప్పకను ॥

1. కోరిన ఫలమును బడయ గోరుచు
కూర్చొని గృహమున నీవిపుడు
పండు పండని పలవరించిన
బడయ నేరవని తెలుసు గదా ॥ వి॥

2. ఫలమును బొందగ దగిన యత్నము
సలుపుచు నుందువు నీ వపుడు
పండ్లు గలిగిన స్థలముకు పోయి
బడయుద నీవు తప్పకను ॥ వి॥

3. మోక్షము మోక్షము అనుచు గృహమున
ముదమున కూర్చొన రాదుగదా
ఆత్మ శక్తిని సంపాదించిన
అయ్యది నీకు అందునయా ॥ వి॥

4. అట్టి శక్తి గలవారిని నీవు
ఆశ్రయింప నది వచ్చునయా
పైసా కూడా ఖర్చు చేయకే
బడయ వచ్చు నది యెరుగుమయా ॥ వి॥

5. కావున నీవు గడుపక కాలము
కడు వేగంబున రావయ్యా
ఆలసించిన ఆశా భంగం
కలుగును తప్పక నమ్ముమయా ॥ వి॥

## 11

## (శ్రీ కృష్ణపరమాత్మ దేవాదిదేవ - మాదిరి)

రాకే రాకే మాయా – రాకే నా దరికీ
వచ్చిన లాభంబు – లేశంబు లేదు

1. అసత్యమా! నిన్ను సత్యంబుతో చెప్పి
సాగ నంపెద చూడు సరగున నిన్ను రా॥

2. క్రోధమా! నీవింక వుండ దగదమ్మా
శాంతమ్మ గారును చనుదెంచు చుండె ॥ రా॥

3. నిర్దయా! నీవింక నడవ వచ్చమ్మా
దయ గారు త్వరగనే దయ చేయు చుండె ॥ రా॥

4. లోభమా! నిన్నింక ధర్మంబు తో చెప్పి
వెళ్ళ గొట్టించెద వేవేగ చూడు ॥ రా॥

5. అసహనమా! నీదు ఆట చాలమ్మా
సహనంబు గారికి స్వాగత మిత్తిమి ॥ రా॥

6. అజ్ఞానమా! నీవు అడుగు లిడవమ్మా
జ్ఞానంబు గారికి వినయంబు చూపి ॥ రా॥

7. హింసయా! నీ హింస చాలు నింకమ్మా
అహింస గారును అరుగొ విచ్చేసె ॥ రా॥

8. పరిగ్రహమా! నీ వింక పారిపోవమ్మా
అపరిగ్రహంబును అవతరిస్తుండె ॥ రా॥

## 12

### (భజన చేసే విధము - మాదిరి)

1. ఆత్మ శక్తి గలుగు వారన్నా - యీ లోకమందున
అనిన యట్లు నడచు కొనునన్నా
మనసు, మాట, చేత ఒకటిగ - నడచు వారి మాటకెంతొ
విలువ గలదు లోకమందున - తెలిసి కొనరా నీవు అన్నా ॥

2. వారి నోరు చౌక కాదన్నా - ఓరన్న అద్ది
చాల ప్రియముగ నుండు రోరన్నా
మనుజునకు మానమందు - ఎంత అభిమాన ముండునొ
తమ మాట యందు వారికి - అంతె అభిమాన ముండును ॥

3. త్రికరణంబుగ నడువవలెనన్నా - యీ లోకమందున
తీర్చుకొనుము నీదు ఋణమన్నా
త్రికరణంబుగ నడచుకుంటె - తీరిపోవును ఋణముఅంత
ముక్తి యన్నది పొందగలవు - భక్తితో యిల మెలగరన్నా ॥

## 13

### ( శివుడు జీవుడు వేరుగ లేరని - మాదిరి )

1. దేవుని సృష్టి కాదని యనియెడి
అమ్మ మాటలు నమ్ముడయా ।

మాయ సృష్టని ఎరిగియు దీనిని
దేవుని సృష్టని అనకండి ॥ దే॥

2. గుణములు లేని ఆ పరమాత్ముడు
సృష్టిని ఎట్టుల చేయునయా।
అతనికి దోషము అంటగట్టుట
అన్యాయంబని ఎరుగడయా ॥ దే॥

3. మాయాసృష్టియె మమతను పెట్టి
గోతిలో మనలను కూల్చెనయా
ఎరుగని యట్టుల ఎక్కడొవుండి
కనులకు గంతలు కట్టునయా దే॥

4. బొమ్మకు పూజలు ఎంతగ చేసిన
వచ్చెడి దేమియు లేదు సుమా।
ఇచ్చున పాలను ఎంతగ వేడిన
పటమున యుండిన ఆ యావు ॥ దే॥

5. కావున పూజలు కాదని మీరలు
జ్ఞానుల చెంతకు చేరుడయా
సత్సాంగత్యమె సత్ఫల మిచ్చుని
సాధుల కొలవగ లేలెండి ॥ దే॥

## 14

## ( గీతార్థసారమె - మాదిరి )

1. అమ్మ మాటలు వినరన్నా
నీవు అర్థ మెరిగి మెలగ రన్నా
అమ్మ మాటలలోని - అర్థమెరిగీ నీవు
ఇమ్మహిలో గల - మాయకు లోగాక

నీదు జన్మ సార్థకంబగు
నికరమైన మార్గమందున
నడచు కొనుటే మేలురా యిక
పడగ నేలర పెక్కు బాధలు ॥

2. నేను అనునది యిచ్చు మాయా
అందు వున్న వన్నియు వట్టి పొరలే

పొరల యందు నొక్క - పలుకుయు లేదని
మది నందు నెరిగియు - మనుజులారా మీరు

పలుకలేని పొరల నన్నిటి
జ్ఞాన మనియెడి వాయు చేతను
ఎగుర గొట్టిన మీదు మానవ
జన్మ సార్థక మగును వినుడీ ॥ అ॥

3. నీవు అనునది వచ్చు మాయా
అది లోనుండి ప్రతి బింబ మగుచు
గోచరించును దాని - గుట్టునెరిగియు మీరు
మోసపోక మెలగ - మోక్షము గలుగును

జన్మ కర్మది కనుక నీవు
అన్న దుండెడి వరకు నేను
నాది నీకు లో బడేదగు
నీదె యని వేర్చెప్పనేల ॥ అ॥

4. నాది, నేను యిచ్చు మాయా
యిక నీది, నీవు వచ్చు మాయా
నీది, నీవు బయట - మెలగుచు వుండును
నాది, నేను లోన - నక్కి నక్కి యుండు

అనుచు చెప్పెడి అమ్మ మాటల
అర్థమెంతో కలదు గావున
వ్యర్థమైన మాట లనుచు
విసుగు చెందక వినర నీవు ॥ అ॥

5. ఋణము తీర్చగ జన్మ వచ్చా
గాన తీర్చ కుండుట చాల పాపం
మానవ జన్మను - మంటిలో గలపక
ఋణము తీర్చగ నీవు - పూనర మనుజుడ

నీది నీవు రాక చేసియు
నాది నేను ఇచ్చి వేసియు
నీదు జన్మ ఋణము తీర్చి
నికరమైన ముక్తి బొందర ॥ అ॥

6. నేను అనునది లేక పోతే
యిక నీవు అనునది ఉండబోదూ

యిది యెపుడుండదొ - అపుడె లోకము లేదు
మాయ మాయమగును - మనుజుడ నమ్మర
నేను, నీవు లేని వాడై నిండి అంతట పరమాత్మ
యుండునని చిన్నమ్మ, అరటి పండు ఒలచినట్లు చెప్పెర ॥ అ॥

## 15

## (భజనచేసేవిధము - మాదిరి)

1. కొన్ని చెట్లకు ముందు కాయండి - ఓ భక్తులార
పిమ్మటె అట పుట్టు పువ్వండి
అట్టిదె పరిశుద్ధ మాయని - అమ్మ చెప్పుచు నుండు మనకు
దాని అర్థంబేమొ యిపుడు - తలచి చూతము రండి మీరు ॥ కొ॥

2. మాయ లాంటిది కాదు సుమండీ - ఓ భక్తులార
దీని నడత వేరు గనరండీ
ఖండనము చేయు గుణము
కలిగి యిద్ది యుండు నటర
అందు చేతనె అమ్మ దానిని
ఖండ పరి పూర్ణమందురు ॥ కొ॥

3. మలిన మాయను యిచ్చి వేయండి - ఓ భక్తులార
శుద్ధ మాయను తెచ్చు కొనండి
మలిన మాయను ఇచ్చి వేస్తూ
శుద్ధ మాయను తెచ్చుకుంటే
తుదకు రెండును లేక పోయి
పరమ ఆత్మయె మిగులునటరా ॥ కొ॥

4. శుద్ధ మాయ యున్న వారండి - ఓ భక్తులార
త్రికరణంబుగ నడవ గలరండి
గాన అట్టి వారి వెదకి
మానసంబున భక్తి నిలిపి
సేవ జేసిన వారి శక్తి
చెంద గలదు మీకు నమ్మండి ॥ కొ॥

## 16

మనసా యిటు వినుమా
ఓ మనసా యిటు గనుమా

అనయము నీ వాత్మ శక్తి
అనుసరించి యుండు మెపుడు ॥

1. సంఘసేవ చేయవచ్చు – సన్నుతులను బడయవచ్చు
ఎన్న నేనె గొప్పయనుచు – ఎగిరి ఎగిరి పడను వచ్చు
కాని దాని వల్ల ముక్తి – కలుగ నేరదెపుడు నీకు ॥ మ॥

2. ఘనము గాను ధనము పెంచి – అనయము తా సుఖము బొంది
కులుకుచునె గృహమునందు – కూరుచొని యుండవచ్చు
కాని యద్ది మనకు ఎపుడు – కాదు శాశ్వతమ్ము సుఖము ॥ మ॥

3. కవనములను గుప్పవచ్చు – కడు నీతులు చెప్పవచ్చు
వేదములను చదువవచ్చు – బోధనలను చేయవచ్చు
కాని దానివల్ల మనకు – కలుగనేర దాత్మశక్తి ॥ మ॥

4. దాన ధర్మములను మనము – పూని యెన్నొ చేయవచ్చు
పుణ్యమనుచు మనసునందు – పొంగి యుండవచ్చు నీవు
కాని దాని వల్ల మనకు – కలుగ బోదు ముక్తి యెపుడు ॥ మ॥

5. యోగములను పట్టవచ్చు – యాగములను సలుపవచ్చు
సిద్ధులనుచు లోకమందు – పెద్ద పేరు పొందవచ్చు
కాని దానివల్ల తనదు – లక్ష్యమేమి పూర్తి కాదు ॥ మ॥

6. అన్న పానములను మాని – ఎన్ని యేండ్లు యైన నీవు
యోగ బలము చేత భువిని – యుండ వచ్చు స్థిరముగాను
కాని దాని వల్ల ముక్తి – కలుగబోదు కనుము నిజము ॥ మ॥

7. కాషాయ ఉడుపులను – కట్టవచ్చు నిత్యమును
మఠములందు చేరినీవు – మంత్రములను చదువవచ్చు
కాని దాని వల్ల నీదు – మలినమేమి మాసిపోదు ॥ మ॥

8. ఆత్మశక్తి సేవ వలనె – అందగలవు అట్టి శక్తి
అన్యమేమి చేసినను – అంద బోదు ముక్తి నీకు
కాన దాని కోస మీవు – కదలి లేచి రమ్ము యికను ॥ మ॥

9. ధనము గినము కోరదద్ది – మనసు నిలిపి భక్తితోడ
జ్ఞానులైన వారి చేరి – సేవ చేయు చున్న యెడల
సులువుగాను దొరకునంచు – తెలిసి నీవు మసలు మికను ॥ మ॥

## 17

### (భజనచేసే విధము - మాదిరి)

1. పోవలసిన యూరి కోరన్నా - నీ వెన్నడునూ
నడవకుండా చేరలేవన్నా
లైటు వెలిగించి నీవు - ఎత్తి చూపిన యంత మాత్రాన
చేర నేరవు ముందు గ్రామము - కదలి నీవు నడవ కుండిన ॥ పో॥

2. ఆవిధంబుగానె ఓ రన్నా - మన అంతరాత్మ
చెప్పి లాభము ఏమిటోరన్నా
అంతరాత్మ చెప్పి నటుల - సత్య పధమున నడచుకుంటే
ఆత్మ శక్తి కలుగు ననుచు - అమ్మ చెప్పుచునుండు వినర ॥ పో॥

3. వెలుగు చూపిన మార్గ మందన్నా - వెనకంజ వేయక
నడచి ముందుకు సాగ వలెనన్నా
సాగి నీవు పోవు చుంటె - వెనుకబడును కొన్ని యూళ్ళు
చేర వలసిన యూరు నీకు - చేరు వగును తప్పకుండ ॥ పో॥

4. తెలుపు తెలివి చూపునట్లన్న - యిక జాగు చేయక
నడచు కొనుట మేలు రోరన్నా
జాగు చేయక నడచుకుంటె - జారి పోయి వృత్తులన్నీ
ఆత్మ శక్తి గలుగు ననుచు - అమ్మ నీకు చెప్పలేదా ॥ పో॥

## 18

### (కృష్ణా దీనదయాళో - మాదిరి)

మాయా - నీవు నన్నేల - బాధింతువే
1. భక్తి మార్గము నుంచి మమ్ము - భ్రష్టులను చేయకే
రక్తి మార్గము చూపి మమ్ము - అంప కోత పెట్టకే
ఓసీ - మాయ శక్తి - కొంప ముంచకే ॥ మా॥

2. అన్న చెల్లెల కాదనంటివి - కాని వాళ్ళకు లోను జేస్తివి
పనికి మాలిన పాడు భావాల్ - కలుగ జేసి యుంటివి
అట్టి - పాడు భావాల్ మా - కంట గట్టకే ॥ మా॥

3. పెళ్ళి చేసుక పెద్ద గోతిలొ - దూకుమని బోధించకే
అందులోనే సుఖము వుందని - బొందలో పడవేయకే
అబ్బో - నీదు బోధలన్ని - దెబ్బ తీయునే ॥ మా॥

4. ఆలు బిడ్డల భ్రాంతిలో మము - కూల ద్రోసి నావులే
మాది మాదను మమతలో మము - ముంచి వేసి నావులే
చాలూ - చాలిక నీవు - దారి బట్టవే ॥ మా॥

5. ఇల్లు వాకిలి విడిచి పెట్టి - వెళ్ళ వద్దని చెప్పకే
కళ్ళు మూసుకు యిందులో బడి - కుళ్ళమని బోధించకే
నీదు - బోధలికను - కట్టి పెట్టవే ॥ మా॥

6. పొలము బొట్రా చూచుకొమ్మని - బుద్ధిని మరల్చకే
ధనము దస్కము పెంచు కొమ్మని - తప్పు త్రోవను పెట్టకే
రాకూ - రాకిక నీవు - రాకే నాదరికీ ॥ మా॥

7. మంచి దని చూపి నీవు - చెడ్డ లోకి త్రోయకే
మంచి యేదొ చెడ్డ యేదొ - తెలియకుండ చేస్తివే
మంచీ - మంచని మమ్ము ముంచినావులే ॥ మా॥

8. అచ్చుకున్న మోస మగుననె - యోచనే లేకుండజేసి
సంఘసేవను ఆశ పెట్టి - చాల లోతుకు దించినావె
చాలూ - చాలిక మోసము - తెలిసి పోయెలే ॥ మా॥

9. చేయరాని చేష్టలెన్నో - చేయించీ యుంటివీ
నీదు వలలో పడియు నేను - బాధలన్ పడుచుంటినీ
యేలా - యీలాగు నన్నేడిపించెదో ॥ మా॥

10. నీవు నన్ను బాధ పెట్టక - నన్ను విడచి పోగదే
జనన మరణము లందు నన్ను - కష్ట పెట్టగ నేలనే
సాధు - సాంగత్యము - పొంద నీగదే ॥ మా॥

## 19

## (భజనచేసేవిధము - మాదిరి)

1. మానవుండను చెట్టు కోయన్నా - మన మరసి చూసిన
వేళ్ళు పైకి నుండు రోరన్నా

వేళ్ళు పైకి తలలు క్రిందికి
యుండు మానవ చెట్టు కంచును
చిన్న అమ్మ చెప్పు మాటల
యందు వున్న అర్థ మరయర ॥ మా॥

2. విషయమే వేళ్ళంటరో యన్నా - ఆ విషయములను
ఖండించు భావమె గొడ్డలట రన్నా

జన్మ రహితము కోరువారు
విషయములను ఖండింప వలయును
అట్లు చేయకుంటె మరల
పుట్టి చచ్చుట తప్పదన్నా ॥ మా॥

3. భ్రమ యనునదె పెంచు నటరన్నా – విషయాల నిలలొ
భ్రమయె తరచుగ పెంచు నటరన్నా

గాన భ్రమను ఖండనంబు
చేసి వేయ వలయు నటర
భ్రమను ఖండనంబు చేయుటె
బ్రహ్మ చర్య మటర యన్నా ॥ మా॥

4. సృష్టి యంతకు కామ మోరన్నా – విధిగ మనకు
గాను పించుచు నున్న దోరన్నా

గాన సృష్టిని మాపు కొరకు
కామ రహితము ముందు ముఖ్యము
అందు కొరకు ఆత్మ శక్తిని
పొందవలెర తప్పకుండను ॥ మా॥

5. తల్లి దండ్రుల భావమోరన్నా – యిల దంపతులకు
రాని హేతువు చేత నోరన్నా

కలిగి సంతతి పాప పుణ్య
ఫలము వారి తల్లి దండ్రుల
కంటు చున్నది, అట్టి పుత్రులు
జన్మ రహితకు తోడుపడరు ॥ మా॥

6. ఆడుదే యిల తల్లి కదరన్నా – అట్టి స్త్రీకి
పుట్టి యుండిన పురుషు డోరన్నా

స్త్రీని పట్టి భార్య యనుచు
సిగ్గు విడచి మెలగు యిలలో
పాప మెంతొ కూడ పెట్టుట
భావ్య మటర నీకు అన్నా ॥ మా॥

7. అట్టులే యిల పురుషుడో యక్కా – మన కందరకు
తండ్రియే గద చూడుమో యక్కా

అట్టి పురుషుని స్త్రీలు పట్టి
భర్తయనుచు పలుకుచుండి

మాయలో పడి మెలగ చుండుట
హేయమనుచు తలచు డికను ॥ మా॥

8. బ్రహ్మ చర్యము మంచిదోరన్నా - యీ జన్మరహితకు
బ్రహ్మ చర్యము పూను మోరన్నా

బ్రహ్మ చర్యము పూనుటంటె
భ్రమను దూరము చేసుకొనుటె
అనెడి మాటలు మరచి పోక
ఆత్మ శక్తుల నాశ్ర యించర ॥ మా॥

## 20

### (అమ్మానొప్పులే - మాదిరి)

**అమ్మా ! మాయయే**
**చిన్నమ్మా ! మాయయే**

1. వద్దామని మీవద్దకు నాకు
బుద్ధి పుట్టి నే బయలు దేరితే
ఎందుకు అటకు? ఏ ముందక్కడ ?
వద్దుర అనుచు బుద్ధిమరల్చెనె ॥ అ॥

**బాబూ ! చూడరా**
**యీ మాట వినరా**

2. ఆత్మ శక్తులను ఆశ్రయించితే
ఉచ్చులో పడునని భయము కల్గి
ఎందుకు అటకని బోధించును
వద్దుర వినకు దాని మాటను ॥ బా॥

3. కమ్మ కమ్మని మాటలు చెప్పుచు
కడు సౌఖ్యంబును గూర్చెడి భార్యను
కాదని పోతే కష్టా లుండని
చెప్ప సాగెనే చెవులో బాగా ॥ అ॥

4. నోటికి రాని బూతు చేతకు
పాల్పడి నీవు పాటులు పడుచు

వారివీరి పై వంకలు పెట్టుట
ఎంచి చూడగ వెర్రి తనంబె ॥ బా॥

5. మురిపెము తోడ నాన్నా యనుచు
ముద్దు ముద్దుగ మాటలు చెప్పుచు
కళ కళ లాడే బిడ్డల వదలి
కదల వద్దని బోధిస్తోంది ॥ అ॥

6. సత్య శాంత దయాదులె బిడ్డలు
శాశ్వత సౌఖ్యము నిత్తురు వారలె
శుక్ల శోణితపు బిడ్డలు మనల
నరక బాధలకు దారి తీయును ॥ బా॥

7. ఇల్లూ వాకిలి విడచి పోతే
ఆలు బిడ్డల ఉసురూ నీకు
తప్పక తగులని నిత్యము నాతో
చెప్పు చున్నదే పాడు మాయ ॥ అ॥

8. ముక్కుకు నగను కోరిన యపుడు
ముందు బాధగ వుందని ఎరిగియు
ఆలు బిడ్డల ఉసురూ తగులని
అంగ లార్చుట వెర్రితనంబె ॥ బా॥

9. కారము వుప్పూ కలిగిన కూరలె
కమ్మ కమ్మగ యుండెడి రీతిని
కష్ట సుఖాల మిళితపు బ్రతుకె
కమ్మగ నుండని బోధిస్తోంది ॥ అ॥

10. కష్ట సుఖాల కతీత మైన
శాశ్వత యానందము నిచ్చే
ఉన్నత పదవి యుందని ఒకటి
తెలుసుకొని పొందర బాబు ॥ బా॥

11. అమరిన పండును అనుభవించక
అందని పండ్లకు అఱ్ఱు జాచితే
రెంటికి చెడ్డ రేవడ వౌదని
మాటి మాటికి చెప్పు చుండునే ॥ అ॥

12. అల్ప సౌఖ్యమును ఆశించియును
శాశ్వత సౌఖ్యము నొందక యుంటే

రెంటికి చెడ్డ రేవడ వౌట
తప్పదు కనుము యిప్పటికైన ॥ బా॥

13. సృష్టిలో యున్న సౌందర్యాన్ని
అనుభవించక వై రాగ్యంబును

పూనితి వేని జీవిత మంతా
పోయిన యట్లే అని చెప్పునే ॥ అ॥

14. కంటికి యింపును కలిగించేవి
శ్రవణా నందము చేకూర్చేవీ
ఒడలుకు సుఖమును ఒన గూర్చేవీ
ఎండ మావులని ఎరుగుము బాబు ॥ బా॥

15. చక్కని గ్రంథాల్ చదువుట మాని
ప్రకృతి యిచ్చే సౌఖ్యము మాని

చప్ప చప్పని జీవితంబుకై
ఎన్నడు పోకు అనుచు చెప్పునె ॥ అ॥

16. చక్కెర రుచిని ఎరుగక యుండి
చౌడే రుచి యని తలచెడి వారికి

చప్ప చప్పని బ్రతుకు కాక
మెప్పగు జీవిత మెట్లొనురా ॥ బా॥

17. ఇంటి వద్దనే యుండి పున్నెము
యింతో అంతో చేసుకొ రాద

ఎందుకురా యీ వెఱ్ఱి నీకని
ఏమేమొ అది బోధించునే ॥ అ॥

18. ఇంటి వద్దను చేసెడి పుణ్యము
క్షణిక సౌఖ్యమే యిచ్చును గాన

పూతాత్ములను సేవించి యును
పొందర నీవు శాశ్వత సుఖము ॥ బా॥

## 21

ఓ భక్తులారా ! ముక్తి మార్గము వెదకరారండీ

1. రాతి బొమ్మకు ప్రీతి తోడ
పూజలెంతగ చేయుచున్న

ముక్తి కల్గుట వట్టి మాట
దాని వదలి కదలి రారండీ ॥ ఓ॥

2. గొఱ్ఱె లట్టుల బుర్ర లొంచి
గోతి లోనికి కూలి పోక

మంచి యేదో యెంచి చూచి
మించు భక్తిని నడువ రారండీ ॥ ఓ॥

3. తీర్ధ యాత్రలు చేయు నెడల
తీరు కష్టాలనుచు నమ్మి

కాల మంతయు వ్యర్థ పరచక
ఆత్మ శక్తుల దరిని చేరండీ ॥ ఓ॥

4. కాగితాలు పాడు చేస్తూ
రామ కోటులు వ్రాయు చున్న

జన్మ రాహితి కలుగదని
నమ్మి మీరు కదలి రారండీ ॥ ఓ॥

5. కృష్ణుడేమో కూడబెట్టని
లేని కృష్ణుని పట్టుకొని

కృష్ణా కృష్ణా యనుచు గొణిగిన
కష్టములు తీర బోవండీ ॥ ఓ॥

6. సంసార సాగరమున
చావు బ్రతుకుల మధ్యలో బడి

మునిగి తేలుచు మూల్గుటేల
కనులు తెరచి కదలి రారండీ ॥ ఓ॥

7. ఆలు బిడ్డల గాలమందు
తగిలి మీరు తన్నుకొనక

వద్దు బాబని వదలి దాని
బుద్ధి గల్గి మెలగ రారండీ ॥ ఓ॥

8. ఆత్మ శక్తుల దరిని జేరి
ఆత్మ రాముడు వీడె యంచు
అతని పొందగ మీరలంతా
అడ్డు చెప్పక కదలి రారండీ ॥ ఓ॥

## 22
## (భజనచేసేవిధము - మాదిరి)

1. ఆకలికి కూడ నటరన్నా - గృహస్థ ధర్మము
యున్న దటర తెలిసి కొనరన్నా
పెక్కు స్త్రీలు యుండ పురుషుడు
ఒక్క స్త్రీనె భార్యగాను
కోరి ఏక పత్ని వ్రతుడై
కోర నట్టుల యితర స్త్రీలను ॥

2. క్షుత్తు తీరుట కొక్కసారన్నా - తిని యుండుటాయె
గృహస్థ ధర్మము క్షుత్తు కటరన్నా
అట్టి వారికి జిహ్వ యిలలో
ఎట్టి రుచులు కోరకుండ
పొట్ట ఆకలి తీరుకొరకే
పట్టెడన్నము తిందు రటర ॥ ఆ॥

3. ఏరు దాటగ నీకు ఓరన్నా - రంధ్రాలు లేని
నావ ఎట్టులొ అట్టులే నన్నా
రుచులు లేని అన్నముతో
ఆకలిని తీర్చు కొనుచు
జీవితంబును గడుపు కొనుటే
శ్రేష్ఠమని చిన్నమ్మ చెప్పును ॥ ఆ॥

4. ఎవరి ఆకలి కుండ దోరన్నా - గృహస్థ ధర్మము
వారి బ్రతుకే వ్యర్థమోరన్నా
గాన ఆకలి తీరు కొరకే
కాస్తొ కూస్తో తినుచు మీరు
లోక యాత్ర చేయవలయు
లేక జిహ్వ చపలమన్నది ॥ ఆ॥

## 23

### (గీతార్థసారమె -మాదిరి)

1. నాది యను శబ్దమునకూ
మనలొ హక్కు కలిగి నంత వరకూ

కామ క్రోధాదులకు జీవుడు భార్యని
తెలిసి కొనుడు మీరు తెల్లముగా యికను

శబ్ద, స్పర్శ, రూప, రస - గంధములకు జీవు డిలలో
భార్య యనియు స్పష్టముగా - పలుక వచ్చు తప్పులేదిల ॥ నా॥

2. పాంచాలి పాండవుల భార్యా
అన్న మాట కర్థము లేదు వినరా
శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముల కిల
లోబడు జీవుడె ద్రౌపది యన బరగె

అట్టి గుణములు కలిగి యుండిన
కౌరవేయునికంద కుండగ
వెడలి పోయిన ద్రుపద సుతనె
అడవి యందున యుండె ననిరి॥ నా॥

3. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ
ములకు లోబడ కిల ఏది
వుండునో ఆ ఆత్మే పతివ్రతా అని
పరమ హంస మరి ముక్తి కాంతా యని

అమ్మ చెప్పెడి మాట లెంత
కమ్మ దనము కలిగి యున్నవో
నెమ్మనంబున తలచి చూడర
నీకె తెలియును స్వయముగాను ॥ నా॥

## 24

### ( రాజేంద్ర వినుము విరాజితమగు - మాదిరి )

1. వినర భక్తుడ నీకు వివరించి చెప్పెద
ఇచ్చు వచ్చు మాయనూ

అప్పుడు నీకు తేట తెల్ల మగునూ
కర్మకు హేతువు - జన్మయే యైనది
జన్మకు హేతువు - కర్మయే యైనది

వీని రెంటికి మూల హేతువు-మాయ యనునది కలదు యొకటి
అదియు కూడా రెండు రకములు - ఆలకించర వినుతు నీకు ॥ వి॥

2. నీ వెరిగి యుందువు సీతను కోరిన
రావణుడే మాయెనో

అట్టిదె వచ్చు మాయని ఎరుగుమురా
కీచకుడను వాడు - ద్రౌపది గోరియు
దశ కంఠులాగున - దగ్ధమై పోయెను

కాన కోరి తెచ్చుకున్నదె - వచ్చు మాయని ఎరిగి మనమున
కోరి తెచ్చు కొనక నీవు - భూరి సుఖముల నందరికను ॥ వి॥

3. వామన మూర్తికి దానము యిచ్చిన
బలి గతి ఏ మాయెరా

పాపము ఆతడు - పాతాళ గతుడాయెరా
ఇచ్చి తెచ్చు కొను - ముప్పును నీ విపుడు
ఇచ్చు మాయ యని - ఎరిగియు మనమున

ఇచ్చు కొన్నను పుణ్య మగునను - పిచ్చిలో పడి యిచ్చు మాయకు
లోనుగాక మెలగ వలెర - లోక మందున తెలివి గలిగి ॥ వి॥

4. కావున భక్తుడు కనులు తెరచి నీవు
గానర యీ సత్యమూ

అందున నీకు అబ్బును స్థిర సౌఖ్యమూ
సత్యముగ నడచి - అసత్య మార్గమును
కాదనుచు నీ విల - ముందుకు పోయిన

వృత్తులన్నియు ఒకటి నొకటి - వరుసగాను మాయ మగుచు

తుదకు తాను మాయమయ్యె - పరమ ఆత్మయె యుండిపోవును ॥ వి॥

## 25

## ( భజనచేసే విధము - మాదిరి )

1. ఏది పగలో ఎరుగ వలెనండి - ఓ భక్తులార
పగలు పగలు కాదు నమ్మండి

మనకు కనపడు పగలు నేను
అనెడి దానిని తెలియ నేరక

నాద్రి యను దాని వైపుకు
త్రోవ చూపుచు నున్నదండి ॥ ఏ॥

2. పంచ భూత యుతము యిది యండి – ఓ భక్తులార
దొంగ త్రోవలు చూపుదిది యండీ
స్వంత శక్తిని పాడు జేసి
జ్ఞాన రత్నము నపహరించిన
పగలు గావున దీని నమ్మిన
పడుట తప్పదు గోతి యందున ॥ ఏ॥

3. అసలు పగలు నెరుగ వలెనండి – ఓ భక్తులార
స్వప్రకాశమైన దది యండి
నామ రూపము చేత చెప్ప
నలవి గాక ఆ ప్రకాశము
ఆత్మ చేతనె చూడబడునని
అమ్మ మనకు చెప్పు చుండును ॥ ఏ॥

4. ఆత్మ తామె కాని వారండీ – ఓ భక్తులార
ప్రకృతి పగలును వాడు కొనునండి
అసలు పగటి సహవాస
మబ్బనేరని కారణమున
అంధ ప్రాయుల యట్లు జగతి
బంధనంబుల చిక్కు కొందురు ॥ ఏ॥

5. ఆత్మ తామె అయిన వారండీ – ఓ భక్తులార
అసలు వెలుతురు చూడ గలరండి
అసలు వెలుతురు చూచునట్టి
ఆత్మ శక్తుల దరిని జేరి
సేవ జేసి ఆత్మ శక్తిని
సేకరించుట మంచి దండి ॥ ఏ॥

## 26
## (బ్రహ్మ పట్నము పోదమంటే - మాదిరి)

1. తెలియ కుండా చేయునది – జాగ్రత్తలో సుషుప్తిరా
తెలిసి నట్టుల నడువనిది – జాగ్రత్తలో స్వప్నంబురా ॥

2. తెలిసి నట్టుల నడచునది – జాగ్రత్తలో జాగ్రత్తరా
తెలిసి కొనరా మూటి అర్థము – తిన్నగా ఓ రన్నయా

3. జాగ్రతందు తెలియ నీయక – గాఢ నిద్ర కన్నయా
తీసుకొని పోవునది – జీవాత్మ స్థితిరో రన్నయా ॥

4. జాగ్రతందు తెలిసినట్టుల – నడువ నీయక అన్నయా
స్వప్నంబులోకి నడుపు నదియె – అంతరాత్మ రన్నయా ॥

5. జాగ్రతందు తెలిసినట్టుల – నడుపునది రో రన్నయా
జాగ్రతకే మనల తీసుకు – పోవును రో రన్నయా ॥

6. ఆత్మ స్థితి అని దీనిని – అమ్మ అంటూ వుండురా
ఇద్దియే పరమాత్మ వైపుకు – దారి జూపును అన్నయా ॥

7. జీవస్థితి ఈ విధంబుగ – మూడు రకములు అన్నయా
మూటికి లోబడ నోడే – లోక దూరు డన్నయా ॥

## 27

### (భజనచేసే విధము - మాదిరి)

1. అమ్మ మాటలు ఆలకించన్నా – చిన్నమ్మ మాటలు
చిత్రముగా నుండి రోరన్నా

చిత్రమైన మాటలతో
శాశ్వతంబుగ నుండు సంగతి
చెప్పుచుండును అమ్మ మనకు
శ్రద్ధగాను వినర నీవు ॥ అ॥

2. కృష్ణుడూ నొక మాయ యేరన్నా – మన మాయ తెలిసిన
కృష్ణ మాయయు తెలియు నోరన్నా

మనదు హృదయము మనకు తెలిసిన
హృదయ మందలి రాముడితడని
మనదు శక్తి మనకు తెలుపును
మనకు తెలుపు వారు లేరిక ॥ అ॥

3. బ్రహ్మ కర్థము తెలియు మోరన్నా – చిన్నమ్మ మనకు
చిత్రముగ చెప్పు నోరన్నా

మనదు హృదయ భూమి యందు
మాయ భ్రమసి బ్రహ్మాయైనది

బ్రహ్మ యిష్ట పడియె తుదకు
విష్ణువే అయినాడు అటరా ॥ అ॥

4. విష్ణు వప్పుడు వినుము ఓరన్నా - తా తృప్తి చెంది
యీశ్వరుండె అయ్యినాడటరా

యీశ్వరుండు అయ్యి ఆతడు
లయము చేసు కొనుచు వరుసను
కర్త, కర్మ, క్రియయు తానై
కాల చక్రమందు తిరుగును ॥ అ॥

5. మనదు మాయ మనకు తెలిసినా - ఓరన్న యికను
మనదు భ్రమకు చోటు లేదన్నా

అప్పు డిష్టము తృప్తి చెంది
అయిష్టమైన విష్ణు వుండక
యీశ్వరుండు తనదు నేరము
తెలిసి కొనుచు మెలగుచుండును ॥ అ॥

6. మనదు భ్రమయే మనదు ఆకారం - ఓరన్న వినర
మన స్వరూపమె మనదు విషయము

సూర్య శక్తి శీతలమును
పారద్రోలెడి రీతిగానె
శుద్ధ మాయ అనెడి శక్తి
మలిన మాయను పారద్రోలును ॥ అ॥

7. భ్రమకు కలిగిన శక్తి వినరన్నా - అది యింద్రియాలను
వశము చేసుకు నడుపు నోరన్నా

త్రోవలేని తావులకు తా
త్రోవ జూపుచు తిరిగి మరల
త్రోవ కలిగిన వైపు కద్ది
త్రోవ లేని యట్లు చూపును ॥ అ॥

8. తాను కానిది తనదు కానిది - ఓరన్న వినర
తనదె యంచు తానె యంచును

భ్రమను మునిగి బంధనంబున
తనను తానె కట్టుకొనుచు

తిరిగి తిరిగి జన్మలెత్తుచు
నరక బాధల ననుభవించు ॥ అ॥

9. భ్రమను తరిమి వేయు మోరన్నా - నీవు భ్రమకు
లోను గాక మెలగు మోరన్నా

భ్రమను నీవు తరిమి వేసిన
నీదు శక్తి నీకు తెలియును
నీకు నిజమగు త్రోవ అదియే
నిక్కముగ చూపగలదు ॥ అ॥

## 28

### (రాజేంద్రవినుము విరాజితమగు - మాదిరి)

1. వేదాంతి వినుము నే వినిపింతు నిప్పుడు
అమ్మ చెప్పిన మాటలూ

అయ్యవి బహు సత్యమైన వాక్కులూ
శబ్ద, స్పర్శ, రూప - ఆకలి దప్పులు
లేకయె నెవడుండు - లోకా తీతు డగుచు

ఆతడే పరిపూర్ణుడగును - పూర్ణుడే పరమాత్మ గాన
క్రొత్త ఏమీ లేదు యిందు - ఎత్తి చెప్ప మీకు అనును ॥ వే॥

2. లోక మర్యాదల కోసము మన మిల
జన్మ ఎత్తగ లేదురా

జన్మ రహితకై వచ్చి తిమిరా
పుణ్య మను మాట - లేదు లోకమున
పుణ్యమనగా పరి - పూర్ణమె యగుగాన

పూర్ణమనగా సూదిమోపను - సందు ఏమీ లేని వాడగు
ఆతడె పరమాత్మ యనుచు - పలుక నేలర వేరుగాను ॥ వే॥

3. ఆ పరమాత్మ కై మనము కష్ట పడ
పని లేదు ఏ మాత్రమూ

మన తప్పుల ఖండించుటే సూత్రమూ
లేని దానిని మీరు - తెచ్చు కొనుట కాదు
లేని దేదో యిక - లేకయె పోవును

అనుచు తెలిసి కొన్న యెడల - అతడే పరమాత్మ గనును
అనుచు చెప్పెడి అమ్మ మాటల - అమృతంబును గోలరికను ॥ వే॥

4. సూర్యునకు యిల చీకటి లేనటుల
లేదుర పరమాత్మకూ
యీ లోకము లేదుర పరమాత్మకూ

గుణములు లేనట్టి - పరమాత్మ యందున
సద్గుణ దుర్గుణ - మన్నవి యుండవుర

అట్టివాడు మనకు ఎట్టుల - రక్షణంబును శిక్షణంబును
యివ్వగలడో ఎరుగ నేరక - వెఱ్ఱులగుచు వేడుచుందురు ॥ దే॥

5. అగ్ని తాకిన కట్టె దగ్ధమగు నటుల
జీవాత్మ యను నదియూ

తప్పక ఆత్మ తాక దగ్ధమగునూ
నేతి నేతి యనుచు - ఆత్మ తెలుపుచు నుండ
వృత్తు లన్నియు కూడ - వూడి పోవును గాన

లోకమే యిక లేకపోయి - వున్నదే పరమాత్మ యగుచు
చెప్పరాని సౌఖ్యమప్పుడు - ఒప్పుచుండును శాశ్వతంబుగ ॥ వే॥

## 29

### (భజనచేసేవిధము - మాదిరి)

1. దేవుడెవరో తెలిసికొనరండి - ఓ భక్తులార
బాధ్య తేమియు లేని వాడండి

మనము తెలియక తప్పు వ్రాసిన
బాధ్యతే విధి లేదొ వెలుగుకు
అట్టులే మన మంచి చెడులకు
దేవుడెన్నడు కాడు బాధ్యుడు ॥ దే॥

2. ఎన్ని పూజలు చేయనేమండి - ఓ భక్తులార
వచ్చు లాభము నాస్తి సుమ్మండి

నీదు వ్రాత తప్పు నీవు
దిద్దు కొనుటకు జాగ్రతెటులో
హృదయ దోషము పారద్రోలగ
సత్యమైన నడత కావలె ॥ వే॥

3. దేవుడేమీ చేయబోడండి – ఓ భక్తులార
కర్మ రహితుడు వాడు నమ్మండి

పాప పుణ్య సృష్టి లయలకు
బాధ్యు డాతడు కాడు యంచును
తెలిసి కొనిన వారె యిలలో
తెలియ గలరు దేవుడెవరో ॥ దే॥

4. సృష్టికర్త దేవుడనకండి – ఓ భక్తులార
వట్టి బూటక మిదియె నమ్మండి

దేవుడే యిల సృష్టికర్తని
తెలియ నేరక మాయలో పడి
జనన మరణ చక్రమందున
తిరుగ బోకుడు మీర లికను ॥ దే॥

5. ఖండ ఎరుకయె మీరు నమ్మండి – ఓ భక్తులార
కల్మషంబును బాపు నమ్మండి

ఖండ ఎరుకను గలిగి యుండి
కర్మ రహితము చేసుకుంటె
నీవె దేవుడు వగుదువయ్య
వేరె దేవుడు లేడు యెచట ॥ దే॥

## 30

### (రాజేంద్రవినుము విరాజితమగు - మాదిరి)

1. మనకెంత తెలియునొ మన జ్ఞాన మంతియె
అను మాట బహు సత్యమూ

ఏ మాత్రము ఎక్కువ లేకుండురా
మన వారు మన యిల్లు – అను మమత పోయిన
యిచట వుందు లేక – అచట వుందు ననుచు

హద్దుచేయ బుద్ధి పుట్టక
అంతయును నొక్కటిగా
గానుపించు నుండు ననుచు
జ్ఞానులాడెడి మాట నిజమురా ॥ మ॥

2. తాను మిత్రుడైన తనకు అందరును
మిత్రులుగా నుండురా

అన్నది చాల సత్యమైన మాటరా
ఆ రీతిగా స్త్రీకి – తండ్రి భావమురాగ
అందరు తండ్రులుగ – ఆమెకు గాన్పించు

తల్లి భావము వచ్చి యుండిన
పురుషునకు స్త్రీలు యందరు
తల్లులుగ గాను పించుట
తథ్య మనుచు చెప్పునమ్మ ॥ మ॥

3. ఆ భావము రాని యంత వరకు కూడ
నందరు గృహస్థులే

గృహస్థమె సత్యమైన ధర్మమూ
అట్టి దానిని నీవు – కాదని త్రోసిన
పోయి వున్నది కాస్త – దండుగ పాలౌదు

అనుచు చెప్పెడి అమ్మ మాటలు
మనము నందు నిలిపి నీవు
మిత్ర శత్రు భావ మిడచిన
లోకమే యిక లేక పోవును ॥ అ॥

## 31

### (కృష్ణా దీనదాయాళో - మాదిరి)

అమ్మ – మాటలు మీరు – వినగ రారండీ ॥

1. పంచ భూతము తోడి పొత్తు – పాడి గాదు మనకురా
వాటి పంచ జేరిన తప్పకుండ – వంచనయే గల్గురా
వద్దు – వద్దుర యంచు – పల్కు చుండురా ॥ అ॥

2. వెలుతురు స్నేహంబుతోడ – చూచు కన్ను కన్నురాయిది
అట్టి వెలుతురు లేక యుంటె – ఆ కన్ను సున్నరా
సున్న – సున్నర యంచు – పల్కు చుండురా ॥ అ॥

3. స్వయము గానె చూచునట్టి – కన్ను యొకటి కలదురా
ఆ కన్ను కలిగి యుంటె – అఖండు డగపడు
మేలు – మేలంచు మనతో – పల్కు చుండురా ॥ అ॥

4. దివ్యమైన తల్లి భావము – కలిగిన మగవారు
ఆడవారు మీరు పొండి – అవలకు యనుచును
పల్క – రెపుడు యనుచు – పల్కు చుండురా ॥ అ॥

5. దివ్యమైన తండ్రి భావము - కలిగిన ఆడవారు
మీరు పొంది ఆవలకు - మగవారు యనుచును
పల్క - రెపుడు యనుచు - పల్కుచుండురా ॥ అ॥

6. ఒకరి యింట పుట్టటము - సహజమైన ఎరుకరా
తోడ బుట్టిన వారితోడ - ఎట్టి భావముండునో
ఆ - భావమే యున్న - ఆడపిల్లకూ ॥ అ॥

7. అన్న దమ్ముల లాగానే - అగుపడు చుందురు
యింక భర్త యను వాడుండ బోడు - భువిని యందు చూడగా
భర్త - యనెడి భావము - కలుగగానె ॥ అ॥

8. కాని వారి నెవరినొ - కట్టు కొనుట జరుగును
అయిన వారి నందరిని - అట్టె విడిచి పోవును
పోవు - పోవుర యంచు - పల్కు చుండురా ॥ అ॥

9. ఎంచి చూడ అట్లనే యిల - ఆత్మ భావ మొకటి కలదు
ఆ భావ మబ్బి యున్న - అంతటాను పరమాత్మె
ఆత్మ - భావము కల్గిన - పెద్దవారిని ॥ అ॥

10. లోక వృత్తు లన్నియును - లేశమైన మిగులక
చెట్టు విడచిన ఆకువలె - అట్టె విడచి పోవును
అట్టి ఆత్మను కనుగొన్నది - గట్టిదైన భక్తిరా
భక్తి - భక్తిర యనుచు - పల్కు చుండురా ॥ అ॥

## 32

## (భజనచేసేవిధము - మాదిరి)

1. పూజలేలా మీకు చెప్పండి - ఓ భక్తులార
జప తపంబులు సలుప బోకండి
జప తపంబులు ఎన్ని చేసిన
జన్మ రాహిత్యంబు మీకు
కలుగ నేరదు గాన వాటిని
కలను నైనా చేయ బోకుడు ॥ పూ॥

2. ఆకలిని తీర్చ వలెనంటె - ఓ భక్తులార
అన్నమే యిల తీర్చ గలదండి
ఆ విధంబుగానె ఆత్మ
జీవ గుణముల త్రుంచివేయు

కంటి కింపగు పూలు ఆకలి
కాస్త అయినను తీర్చ జాలవు ॥ పూ॥

3. ఇచ్చ పెంచు పూజ లేలండి – ఓ భక్తులార
పిచ్చి యందున మీరు పడకండి

ఇచ్చ పెంచు పనులు చేస్తూ
పిచ్చి మార్గమునందు బడియు
చచ్చి పుట్టుచు నుండునేల
సత్య మార్గమునందు బోవుడు పూ॥

4. విధికి లోబడి నడువ వలెనండి – ఓ భక్తులార
ఋణము తీర్చుట నదియె సుమ్మండి

విధికి లోబడి నడచు కొనుచు
వృత్తి రహితము చేసు కొనుచో
ముక్తి యన్నది కలిగి తీరు
భక్తులార మదిని నమ్ముడు ॥ పూ॥

5. ఆత్మ శక్తియె మీకు రక్షండి – ఓ భక్తులార
ఆత్మశక్తిని ఆశ్రయించండి

ఆత్మ శక్తిని ఆశ్రయించిన
సత్యమైన మార్గమందున
నడువ గలవు నీవు తప్పక
కడు శుభంబు నీకు గల్గును ॥ పూ॥

## 33

## (రాజేంద్రవినుము విరాజితమగు - మాదిరి)

1. లోకము నందున గురువుల మనుకొను
వారు గురువులు కారురా
గురు శబ్దము లేదురా ఎవ్వారికీ

వెలుపుల గురువుండు – ననుమాట వట్టిది
గురువును తానని – మురియు టధర్మము

వెలుపలెవరో గురువులుండను – తలపు తనలో నున్న వరకు
అతడు కూడా శిష్యు డేయని – అమ్మ చెప్పుచు నుండువినర ॥ లో॥

2. వెలుపల ఎప్పుడు గురువు లేకుండునో
అప్పుడె గురువుండురా
మన లోపల తప్పక గురువుండు రా

లోనుండు గురువును - ఖండ శక్తీ యని
అమ్మ చెప్పెడి యట్టి - అర్థ మెరుగ వలయు
అమ్మ చెప్పెడి అర్థ రీతిని - అట్టి శక్తికి మనము శిష్యుల
మనుచు తలచ వలెనుగాని - అన్యు లెవ్వరు కారు గురువులు ॥ లో॥

3. లో నుండి తెలిపెడి ఖండ శక్తియె మనకు
దండియైన గురువురా
తెలిసి నటుల నడచునదే శిష్యుడూ

కర్తృత్వమే యిల - శిష్యుడు అన బరగి
ఖండించు నద్దియె - ఘనమైన గురు వగచు
గురువు శిష్యులు యిద్దరును - కలరు తప్పక మనల యందే
గాన వేరే గురువు కోసము - కలవరింతలు పెట్ట బోకుము ॥లో॥

4. శుద్ధ మగు మన మనసే మన గురువుర
వేరె గురువులు లేరురా
సత్యంబైన మాటయె యుపదేశమూ

సత్య శక్తికి లొంగి - నడచు నడతయె శిష్యు
డనుచు నెరుగ వలయు - ఆత్మ యందున నీవు
మనసు ఎపుడు లేక పోవునొ - మాట అపుడే లేక పోవును
మాట యన్నది లేని యపుడు - నడత కూడ మాయమగును ॥ లో॥

# పాటలు

## 2 వ భాగం

### 1

1. తిన్నగ పోయి చిన్నమ్మను
కన్నులతో గాంచుమయా
గాంచిన తోనే నీలో మార్పు
కలుగును తప్పక నమ్ముమయా ॥

2. నీవు నేను విన్నవి గాక
చిత్రపు మాటలు చెప్పునయా

ఎంత వినినా విసుగు పుట్టక
వింతగాను తోచునయా ॥ తి॥

3. అంతట నీవు అచ్చట నుండి
కదల లేక యుందువయా

ఇల్లు వాకిలి మరచి పోయి
చల్లని తల్లిని విడువవయా ॥ తి॥

4. పూజలు గీజలు చేయగ రాదని
పొందుగ నీతో చెప్పునయా

చెప్పిన యప్పుడు చిత్రంబిదియని
తప్పక మదిలో తోచునయా ॥ తి॥

5. ఏమిది యంచు అడిగిన మీదట
చక్కగ చెప్పగ పూనునయా

పటము నందలి గోవును పట్టుక
పాలను యిమ్మని అడుగకయా

అడిగిన లాభము ఏ మాత్రంబు
లేదని నీకే తెలుసునయా

అనుచు చెప్పును అంతట నీకు
సత్యంబిది యని తో చునయా॥ తి॥

6. దేవుని సృష్టి కాదని నీతో
తిన్నగ చెప్పును వినుమయ్యా

మాయా సృష్టని మర్మము లేక
చక్కగ తెల్పును వినుమయ్యా ॥ తి॥

7. ఉపదేశంబులు గిపదేశంబులు
వలదని నీతో పలుకునయా

చాటు మాటుగ చేసే బోధలు
చేటులు గూర్చని చెప్పునయా ॥ తి॥

8. అంతా నిజమని అప్పుడు నీకు
అట్టే తెలిసి పోవునయా

తెలిసిన దంతా అమలు జరిపితే
తిన్నగ ముక్తి దొరుకునయా ॥ తి॥

## 2

**(పోరా బాబూ పో - మాదిరి)**

**రావే జీవి రా**
**వచ్చి చూడు ఆ చిన్నమ్మను**

1. అమ్మ దర్శన మబ్బిన యేని
ధన్యత నీకు తప్పక కలుగు
ఆమె కృపకు నీవందితివేని
నీలో మార్పులు నిజముగ వచ్చు ॥ రా॥

2. అమ్మ చెప్పెడి కమ్మని మాటలు
ఆలకించిన వింతగ తోచు
అర్థమయ్యేనా అవంతైనా
అమృతంబులే అనిపించునురా ॥ రా॥

3. నిజమగు మార్గము నీకగుపడును
భజనలు గిజనలు పనికే రావు
భక్తి యొక్కటే నిజమనిపించు
భక్తి కల్గిన ముక్తే కల్గు॥ రా॥

4. అమ్మ సేవయే అబ్బిన నీకు
యిమ్మహిలోన లోటే లేదు
రమ్మిక పోదము రయమున అటకు
మాయలోక మిక మనకెందుకులే ॥ రా॥

5. ఆ పరమాత్మను అవలోకించే
అమ్మను చూడగ రమ్మిక పోదము
కాలహరణము జేసితివేని
చివరకు నీకు చింతే మిగులును ॥ రా॥

6. అమ్మకు మినహా ఎరిగినంతలో
ముక్తికి మార్గము జూపెడివారు
లేరు లేరని చాటుచు నీవు
పరుగును రమ్మిక భక్తిని గొల్వ ॥ రా॥

## 3

## (బాపూ చరితం వినరండీ - మాదిరి)

అమ్మ మాటలు వినరండీ
చిన్నమ్మ మాటలు కనరండీ

మాయా శక్తిని మాపీవేసి
ఆత్మ శక్తితో అలరునట్టి ॥

1. కాషాయాంబర వేషము లేదు
కపట బోధలు అసలే లేవు

గురు కట్నంబని కోరక యేమి
ధనమును తాకిన గడగడ వణకే ॥ అ॥

2. స్నానము సంధ్యలు చేయక యెపుడు
వేష భూషలు వేయక యెపుడు

నిరాడంబర రూపము తోడ
నిత్యము విరక్తి చెప్పెడి తల్లి ॥ అ॥

3. మతము వద్దు పటము వద్దు
మానవుల కది నీతి కాదు

నీతిగ మసలుటె నిజమగు మార్గం
అనుచు చెప్పును ఆ చిన్నమ్మ ॥ అ॥

4. గురువును నేనని మురువక యెపుడు
శిష్యులు మీరని చెప్పక యెపుడు

ప్రేమతొ నందరి నొకటిగ చూస్తూ
భక్తి మార్గమును చూపెడి తల్లి ॥ అ॥

5. పెద్ద పిన్నలను భేదము చూపక
వద్దకు యెవరు వచ్చినగాని

విసుగు జెందక యెల్ల వేళల
ప్రేమతొ మాటలు చెప్పుచునుండె ॥ అ॥

6. చేతయె గీతని చెప్పుచు యెపుడు
సత్యంబిది యని పలుకుచు నిత్యం

భక్తుల హృదయం పావనచేసే
ఆత్మ శక్తులను చేరుడు యనియెడి ॥ అ॥

7. నిజమగు సాధుల స్నేహము మీరు
విడువక చేసిన కడు లాభంబని
చెప్పుచు వద్దకు చేరిన వారికి
ముక్తికి మార్గము చూపెడి తల్లి ॥ అ॥

8. పెద్దలు యెవరో వ్రాసిరి యనుచు
గ్రంథములందలి గడబిడ చెప్పక
ఆత్మ శక్తికి అందిన విషయాల్
వక్కాణించెడి చక్కని తల్లి ॥ అ॥

## 4

### (రాజేంద్ర వినుము విరాజితమగు - మాదిరి)

1. వేదాంతి వినుము – విరాగిని యైన
శ్రీ చిన్నమ్మ చారిత్రమూ
సదా – సుధను వెలయించు సుపాత్రమూ
రాజిల్లు గుంటూరు – మండలాంతర్గత
రేపల్లె గ్రామమున – ఆ తల్లి యిప్పుడు
తాళపత్ర వినిర్మితంబగు – పాక యందున భక్తతతితో
ఏకమయి తానుండుచుండును – లేక డాంబిక మన్న దేమియు ॥ వే॥

2. పండితు లార – ఆ పండిన తల్లిని
రండి చూడగ మీరలూ
మహామహులు – దండి తత్వావేత్తలూ
ఖండిత కేశిని – మండిత వదనయు
పండిన ముదుసలి – భవ్య చారిత్రము
సకల శాస్త్ర పురాణ వేత్తలు – ముకుళితంబగు హస్తములతో
ఆలకించుచు సంతసంబున – నోల లాడుచు నుందు రెపుడు ॥ వే॥

3. మిత్రోత్తమా విను – చిత్రమైన మన
మాతృ దేవీ మాటలూ
సదా – సుధను చిందించు ఆవాక్కులూ
పూజలు గీజలు – వాజమ్మ పనులని
తేజ మెలరగ నామె – తెల్పుచు నిరతము
బుద్ధదేవుడు మరల భువిపై – నుద్ధరించగ సకల జనులను
అవతరించినయట్లు తోచగ – ఆమె మెలగుచు నుండు నిత్యము ॥ వే॥

4. సంసారి యికను నీ సద్గతి బొంద
శ్రీ చిన్నమ్మ దరి జేరరా
నిజం బచట సద్గతి చేకూరురా

తాజేయు కర్మయె – తనను నడుపుచు నుండ
రక్షింప మనుచును – రాతి బొమ్మల తోడ

చెప్పు కొన్నను లాభమేమియు – చేర బోదిల గానమీరలు
కర్మ రహితమైన బ్రతుకును – గడుప బూనుడటంచు పల్కును ॥ వే॥

5. అజ్ఞానులార యీ సుజ్ఞాన నిధిజేరి
మూర్ఖత పోద్రోలుడీ
హృదయంబున జ్యోతిని వెలిగించుడీ

రాతి బొమ్మను తెచ్చి – రాముడు వీడని
గుడులందు నిల్పుట – కూడదు మీకిల

కదల మెదల లేని బొమ్మల – కాళ్లు చేతులు పట్టు కేడ్చిన
వచ్చు పుణ్యము నాస్తి గావున – పిచ్చి పనులను మానుమనును॥ వే॥

6. బాధలు పెట్టు యే బోధ గురువుల జేర
రాదుర మీరెన్నడూ
యికీ తల్లిని చేరియె సేవింపుడీ

మంత్రపు తంత్రపు – మాటయె దలపక
తెల్లముగ నందరకు – తెల్పుచు సర్వము

చాటు మాటు బోధలకు తా – చోటు నివ్వక సుంతయైనను
మేటి తల్లి మెలగు చుండును – మెచ్చు కొనగ నెల్ల వారలు ॥ వే॥

## 5

### (ఏరువాక సాగారో రన్నాచిన్నన్నా - మాదిరి)

ఎంత గొప్ప ఆత్మయో
అమ్మా ! చిన్నమ్మా !

1. ఆలు బిడ్డలు గోల జేసిన
అన్న దమ్ములు అడ్డుకొన్నను
తల్లి దండ్రులు బ్రతిమిలాడిన
ఇల్లు వాకిలి విడిచి పెట్టి
ఉద్యోగంబులు వద్దు పొమ్మని

వచ్చినారము చూడమ్మా – అమ్మా ! చిన్నమ్మా !
యీా – పిచ్చియేలా పట్టిందో – అమ్మా ! చిన్నమ్మా ! ॥ ఎం॥

2. ఎట్లా వుండునో చూదామనుచు
ఏమి చెప్పునో విందామనుచు
బుద్ధి పుట్టి నీ వద్దకు వచ్చిన
పెద్దల యందలి పిన్నల యందలి

యిచ్ఛ మాసి పోయెనో – అమ్మా ! చిన్నమ్మా !
మా – యిచ్ఛ విరిగి పోయెనో – అమ్మా ! చిన్నమ్మా ! ఎం॥

3. పోదామంటే బుద్ధి పుట్టదు
వుందామంటే వుండనీయదు
కొంత దూరము పోయిన పిదప
తిరిగి వెనుకకు వచ్చి వేయుట
ఎంత వారును ఏడ్చి పోవుట

ఎందులకో తెలియదో – అమ్మా ! చిన్నమ్మా !
యీా గంద్ర గోళమేమిటో – అమ్మా ! చిన్నమ్మా ! ఎం॥

4. రాముడు మీకు రాడు పొమ్మని
మీరు దేవునికి లేరు పొమ్మని
సృష్టి అంతయు మాయదె లెమ్మని
క్రొత్త మాటలు ఎత్తి చెప్పుటచే

మా చిత్త మట్టే మారిందో – అమ్మా ! చిన్నమ్మా !
యీా – చిత్ర మేమిటో చెప్పమ్మా – అమ్మా ! చిన్నమ్మా ! ఎం॥

5. బొమ్మల నిలిపి పూజ చేయుట
అన్నము తినమని వాటికి చూపుట
దండము పెట్టి గడగడలాడుచు
దయతో మమ్ము కాపాడనుచు
వాటికి చెప్పి మొత్తు కొనుటలు

పిచ్చి చేష్టలన్నావా – అమ్మా ! చిన్నమ్మా !
యీా – పిచ్చి వదల మన్నావో – అమ్మా ! చిన్నమ్మా ! ఎం॥

6. పూజలు గీజలు మానివేసిక
పూతాత్ములకు సేవను జేసి
ఆత్మ శక్తిని వారినుండియే
సంపాదించుడు మీరలటంచు

చక్కగాను చెప్పావో –అమ్మా ! చిన్నమ్మా !
నీ – ప్రక్కనున్న చాలమ్మా – అమ్మా ! చిన్నమ్మా ! ॥ఎం॥

7. సపోట కొమ్మకు పాల మొక్కను
అంటు కట్టిన యట్టులె మీరు
ఆత్మ శక్తుల అండను చేరి
ఆత్మ శక్తిని పొందుడు యంచు

ఎంత చక్కగ చెప్పావో – అమ్మా ! చిన్నమ్మా !
నీ – కెంత తెలివి వున్నదో – అమ్మా ! చిన్నమ్మా ! ॥ ఎం॥

8. మల్లి చెట్టు దరి మన ముంటేను
మల్లి వాసనే పీలుస్తాము
ఉల్లి మొక్క దరి మనముం టేను
ఉల్లి వాసనే పీలుస్తాము
తీసుకొన్నదీ కాదంటావా

అల్లాగే అని అంటావో – అమ్మా ! చిన్నమ్మా !
నా – ఉల్లమలరి పోయిందో – అమ్మా ! చిన్నమ్మా !

9. భ్రమయే బ్రహ్మని గట్టిగ చెప్పి
భ్రమపై చర్యయె బ్రహ్మ చర్యమని
వాస్తవంబును వక్కాణింపుచు
ముక్కుకు సూటిగ చెప్పుట చేత

మా – భ్రాంతి దూరమయ్యేనో అమ్మా ! చిన్నమ్మా !
మా – భ్రమయు మాసిపోయెనో – అమ్మా ! చిన్నమ్మా ! ॥

10. నెమ్మ నంబున నిండగ మోదము
కమ్మ కమ్మని మాటలు చెప్పుచు
మాలో మాయను హడలు గొట్టుచు
మమ్ముల దయతో చూచెడి తల్లి

కష్టమంతా తీరిందో – అమ్మా ! చిన్నమ్మా !
మా – చింతలన్నీ బాసెనో – అమ్మా ! చిన్నమ్మా !

## 6.

## సన్యాసి సాంగత్య ఫలము - ఆహా ఏమని తెల్పుదు - ఎనలేని సుఖము

1. జనన మరణ చక్ర – మందున నెపుడు
కడుయిడుముల నీవు – కుందగనేల ॥స॥

2. జన్మరాహిత్యంబు - సాధించవలెనన్న
సాధుసేవయే నీకు - చక్కని బాట ॥స॥

3. మును అర్జునుండిల - శ్రీకృష్ణుదరిజేరి
ఘనమగు విజయము - గాంచియుండెనుగా ॥స॥

4. సర్వము త్యజియించి - సాధుల దరిజేరి
చెప్పరానియట్టి - స్థిరసౌఖ్యమనియెడి ॥స॥

5. వృత్తులన్నియు తామె - వరుసగ వదలుదు
ఈషణ రహితులై - యిలలోన వెలసెడి ॥స॥

6. మాతృభావము తోడ - మసలుచునెప్పుడు
ఆధారమేలేక - అలరుచుండెడి యట్టి ॥స॥

7. కర్తృత్వమెందున - కానరాకుండగ
విధికి లోబడి యెపుడు - విలసిల్లుచుండెడి ॥స॥

8. స్వస్థానమనునది - స్వల్పంబు లేకయు
భక్తుల హృదయాలె - బాసటయై నిల్చు ॥స॥

9. పవిత్రప్రేమయె - పరమపదమంచును
సత్యమార్గము మనకు - నిత్యము జూపెడి ॥స॥

10. త్యాగధీరత్వంబే - తరియించు జన్మల
యదార్థమియ్యది - ఎల్లరు గనుడనెడి ॥స॥

11. కార్యశూరత్వాన - కలుగు యానందంబు
సందియము లేదంచు - సత్యము పల్కెడి ॥స॥

12. చేతయె గీతని - స్థిర సత్యమును చెప్పే
చిన్నమ్మ చరితము - చదువగలేద ॥స॥

13. చిరునగవు మోముతో - చిందులు త్రొక్కు యా
సచ్చిదానందుని - సరగున జేరుదు ॥స॥

## ఎవరో!

సీ. ఇల్లు వాకిలి కాదు పిల్లజెల్లయు కాదు
ఏవియు కాదన్న దేవి ఎవరో!

ధనమన్న గజ గజ వణకు పుట్టియు వేగ
కెవ్వున కేకిడు అవ్వ ఎవరో!

కట్టుచుండెడి బట్ట కాలదన్నియు అభి
మానంబు చంపిన మాత ఎవరో!

తలనున్న వెంట్రుకల్ తొలగించియును బోడి
అవతార మెత్తించు అమ్మ ఎవరో!
ఆరోగ్యమును కోరి ఆచరించెదు నిత్య
స్నానంబు మాన్పిన శక్తి ఎవరో!

మెత్తకైన పరుపు బొత్తిగా తొలగించి
చాపను చూపిన సాధ్వి ఎవరో!

తలక్రింద బట్టలు తన్నుకు పోయి తా
తల, క్రిందు చేసిన తల్లి ఎవరో!

తే. విషయ వాసనలందుండి వేరుచేసి
సర్వవృత్తుల ఖండించి చక్కగాను
తరలి పోవుచునుండు నా తల్లి ఎవరో!
భక్తితో నామె నేగొల్తు శక్తి కొలది.

## అమ్మా!

అమ్మా! మా చిన్నమ్మా!
పరిపూర్ణ పవిత్రపు ఆత్మశక్తీ!

1. వేదాంత శిరోమణి వమ్మా!
మా అందరి పట్టుగొమ్మా!
వెలలేని అమూల్య పదాలు పల్కెడి
జ్ఞానుల రాణి వమ్మా! అ॥

2. ఆత్మ జ్ఞాన వివేకీ
అజ్ఞానము నంతయు బాపీ
పరమాత్మ మహత్వపు తత్వము జూపిన॥ అ॥

3. నీ నోటను వచ్చిన మాటా
యీ మానవ కోటికి బాటా
లోటులు కోటులు కూడిన బాటలు
కూడ వటంచును పలికిన అమ్మా! అ॥

## 2

వందనం వందనం శ్రీ చిన్నమ్మా!

1. భూతల మందున బుద్ధదేవునిలాగ
అవతరించిన యట్టి ఆత్మశక్తీ!

యీ తరము వారికి ఎన్న రానిమేలు
చేకూర్చి యున్నట్టి చిన్మమయ మూర్తీ!

2. వక్ర మార్గమునందు వదలక పోయెడి
నరులకు సరియగు మార్గము చూపీ!
వెలలేని కీర్తిని విరివిగ పొందిన
మాతరా నీకిదె మాదగు భక్తీ!

3. పూజలు గీజలు పుణ్యమీయవని
బోధించి యున్నట్టి భవ్యమూర్తీ!
మీ మీద యున్నట్టి నిండుభక్తి చేత
చేయు చుంటి మిద్ది చిన్న తల్లీ! వం॥

## 3

సీ. పేరుపొందిన యట్టి పెద్ద గురుల వద్ద
చేరి శుశ్రూషలు చేసి చేసి
మంత్రోపదేశంబు మానక గ్రహియించి
జపమాలతో నద్ది జపము చేసి

తలనున్న వెంట్రుకల్ తొలగించి పూర్తిగా
తలపులే లేవని తలచి మదిని

కాషాయ వస్త్రాల గంతలు ధరియించి
సాధువు నంచును సాటిచెప్పి

తే. కడకు ఆవంత శాంతియు గానలేక
అమ్మరో నీవు వచియించు అమృతంపు
పలుకులను ఆలకించియు పరమతృప్తి
పొందియున్నట్టి యీ భక్త బృందమిపుడు
అమ్మలేనట్టి బిడ్డలైరమ్మ నేడు.

## 4

సీ. ఉపవాస వ్రతముల నపరిమితంబుగా
గురువు చెప్పినయట్లు జరిపి జరిపి

వేదాంత గ్రంథముల్ విసుగన్నదియు లేక
పఠియించి పఠియించి పవలు రేయి

అఘపంక క్షాళన మగునంచు నెంచియు
నదులందు స్నానము నమ్మిచేసి

రామకృష్ణాయంచు రాత్రియుం బవలును
గొంతు బొంగురుబోవ గోలచేసి

తే. ఇన్ని చేసియు లాభంబు సున్నయనుచు
మనమునందున గ్రహియించి మాతనిన్ను
చేరి సేవించ మేలని చిత్తమందు
నమ్మియున్నట్టి మాకిక అమ్మ! లేవ!

## 5

సీ. ఇల్లువాకిలి వీడి పిల్లజెల్లను వీడి
తల్లి నీ చెంతకు తరలివచ్చి
అన్నదమ్ముల వీడి అనుగుభార్యను వీడి
అమ్మ నీచెంతకు అరుగుదెంచి
ఆస్తిపాస్తుల మీద ఆశను తెగగోసి
నీవె మానిధియని నిన్ను జేరి
వైవాహికంబది వద్దని వచియించి
నీ పాదసేవయే నెరపనెంచి

తే. ఇచ్చటికి వచ్చియున్నట్టి యింతమంది
నేమిచేయంగ విడిచితో ఎరుకరాదు
ఏది దిక్కిక మాకికమీద యిచట
అమ్మ! చిన్నమ్మ! మాగుండె లావటిల్లె.

## 6

సీ. ఏతల్లి ముఖపద్మ మింపార వీక్షింప
ఏతెంచవలయునో ఎరుకరాదు
ఏ తల్లి మాటల నింపార వినుటకు
ఏతెంచవలయునో ఎరుకరాదు
ఏతల్లి పదముల కెరగి దండముపెట్ట
ఏతెంచవలయునో ఎరుకరాదు
ఏతల్లి సేవకై యిచ్చటి కికమీద
ఏతెంచవలయునో ఎరుకరాదు

తే. శూన్యమైయున్న పాకను చూచినపుడు
కట్టెలాగున నిలబడి అట్టె అచట
బావురని యేడ్చు భక్తుల బాధనిచట
చెప్పలేమమ్మ చిన్నమ్మ! సెలవునిమ్మ!